# మాఘపురాణము

## ధనుర్మాస సహిత మాహాత్మ్యము

వచనము

30 కథలతో

గ్రంథకర్త:
జయంతి జగన్నాథశాస్త్రి

పబ్లిషర్స్:
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,
రాజమండ్రి.



వెల రు 10-00

# భూమిక

పూర్వమునుండియు మన దేశము ఋషివర్యులచే నడుపబడి మత సంబంధమైన వాతావరణమందలవడియున్నది. అనేక రీతులనీతి సాంప్రదాయములను మౌనివర్యులు ప్రచారముచేసి పురాణములం దుల్లేఖించియున్నారు. అట్టి పదునెనిమిది పురాణములను మహానుభావుడైన వ్యాసుడు సంస్కృత భాషలో రచించినాడు. దానిని జనసామాన్యము చదువుకొనుటకుగాని, అందలి యర్థమునవగాహన జేసికొనుటకు గాని సులభసాధ్యము కానేరదు. ఆకారణమున స్కాంద పురాణాంతర్గతమగు మాఘమాస మహాత్మ్యమును వచనరూపముగా నాబాలగోపాలము, స్త్రీలు, బాలురు, వృద్ధులు, చదివి యానందించునట్లును, తత్పురాణపఠనాదులవలన తాముతరించుటయే గాక వినువారినిగూడ తరింపజేయుదురను తలంపుతో సరళమగు భాషలో రచింపబడినది. ఇందు ముప్పది యధ్యాయములు గలవు. మాఘమాసమున స్నానానంతరము దినమున కొకయధ్యాయము వంతున మాసాంతము వరకు ముప్పది యధ్యాయములును జదువవలయును. పురాణమును చదువుటకుముందు పఠింపవలసిన ప్రార్థనశ్లోకములు, పఠనాంతరము చదువవలసిన శ్లోకములు కూడా నిందు జేర్చబడినవి. కావునభక్తులు, ముముక్షువులు, మతాభిలాషులు యీ గ్రంథము నామూలాగ్రముగాజదివి, దీనిప్రాశస్త్యమును గ్రహించిమమ్ములను ప్రోత్సహించి, తాము యిహపరసుఖములంది, యానందింతురుగాక యని ప్రార్థించుచున్నాను.

రాజమండ్రి
10-12-53

ఇట్లు
గ్రంథకర్త.

# విషయసూచిక

# ప్రార్థన శ్లోకములు

1. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వవిఘ్నోప శాంతయే॥

2. అభీప్సి తార్థ సిద్ధ్యర్థం పూజితో యస్సురైరపి
సర్వవిఘ్నచ్ఛిందే తస్మై గణాధిపతయేనమః॥

3. యాకుందేందుతుషార హారధవళాయా శుభ్రవస్త్రాన్వితా
యావీణావర దండమండితకరా, యా శ్వేతపద్మాసనా
యాబ్రహ్మాచ్యుతశంకర ప్రభృతిభిర్దే వైస్సదాపూజితా
సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా॥

4. వందేలక్ష్మీంపరశివమయీం శుద్ధజాంబూనదాభాం
తేజోరూపాం కనకవసనాం స్వర్ణభూషోజ్జ్వలాంగీం
బీజాపూరం కనకకలశం హేమపద్మం దధానా
మాద్యాంశక్తిం సకలజననీం విష్ణువామాంక సంస్థామ్॥

5. వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్
పరాశరాత్మజం వందే శుక తాతం తపోనిధిమ్॥

6. అచతుర్వదనో బ్రహ్మాద్విబాహు రపరోహరిః
అఫాలలోచనశ్శంభు ర్భగవాన్ బాదరాయణః॥

7. గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురు దేవోమహేశ్వరః
గురుస్సాక్షాత్పర బ్రహ్మతస్మై శ్రీగురవేనమః॥

8. జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥

# మాఘపురాణము

## మొదటి అధ్యాయము

పూర్వమందొకప్పుడు సాంబశివుడు రజతాద్రియందు సుఖాసీనుడై కూర్చుండియుండగా భార్యయైన పార్వతీదేవి, భర్తనుద్దేశించి, "విశ్వాత్మా! సర్వలోకములకు అధిపతివై సకల భూతకోటియందును దయగలవాడవై యుండు శంకరా! నీవలన ననేక పుణ్యవిషయములను వినియుంటిని. నీవచనామృతమును గ్రోలిన కొలది యింకను వినవలెనను కుతూహలము జనించుచున్నది. కాబట్టి మిక్కిలి పుణ్యమును యిచ్చునదియు, ప్రయాగమహాత్మ్యసహితమునగు మాఘమాస మహాత్మ్యమును వాకుసవిస్తరముగా దెల్పు" మని ప్రార్థించెను. అంతట శంభుదేవుడు పార్వతీ దేవికీ మాఘమాస మాహాత్మ్యమును జెప్పెను. మరియు 'పార్వతీ! యెంతటి రహస్యమైన దైనను నీకొరకు నేను దీనిని చెప్పుచున్నాను, వినుమని పల్కెను.

'సూర్యుడు మకరరాశియందుండగా మాఘమాసమున ప్రాతఃకాలమందు యేనరుడు స్నానమాచరించునో యాతడు సమస్త పాపములనుండి విముక్తుడై అంత్యమందు మోక్షము నందుచున్నాడు. మరియు సూర్యుడు మకరరాశి యందుండగా మాఘమాసమున ప్రయాగ క్షేత్రమం దేనరుడు స్నాన మాచరించునో యాతడు వైకుంఠమును చేరును. మాఘమాసమందు యేమానవుడుగాని యెచ్చటనైనగాని గోవుపాదము మునుగునంత లోతుగల నీళ్ళలోనయినను స్నానమాడిన యెడల ఆతడాస్నాన ఫలమువలన సమస్త పాతకములనుండి విడువ బడుచున్నాడు. రెండవ దినమున జేసిన

స్నానమువలన విష్ణులోకమును పొందును. మూడవ దినమున జేయు స్నానమువలన విష్ణుమూర్తి యే యీ పుణ్యాత్మునకేట్టిఫల మివ్వవలసియుండునను ఆలోచనలో నుండును. మాఘమాసమున ప్రయాగలోగల గంగయందు మునిగిన మానవునకు పునర్జన్మయుండనేరదు. సూర్యుడు మకరరాశియందుండగా మాఘమాసమందు సూర్యోదయ సమయమున నదిలోగాని, చెఱువులోగాని, స్నానము చేయువారు మోక్షము నొందుదురు. పార్వతీ! సూర్యుడు మాఘమాసమందు ప్రాతఃకాలమున ఉదయించుచున్న సమయమున, గ్రామమునకు బయటగల చెఱువుయందుగాని కాలువయందుగాని నూతియందుగాని యెవరు భక్తితో స్నానము చేయుదురో అట్టివారు మహా పాతకములనుండి విముక్తులు కాగలరు.

మాఘమాసమం దేమానవుడు గాని, ప్రాతఃకాలమున జలము లేకపోవుటచేతగాని, శరీరమందు శక్తిలేకగాని, పరిపూర్ణమైన స్నానమాచరింపజాలక, గోవుపాదము మునుగునంతటి నీటిలోనైనను మార్జన చేసుకొని పరిశుద్ధుడగునో అట్టివానిపాపములుగూడ పటాపంచ లగును. దైవవశముచేత తెలిసిగాని, తెలియకగాని ఒక్కమారు స్నానమాడినను పాపములు నశించును. భక్తితో స్నానము చేయువాని పుణ్యమును వినుము. అశ్వమేధ యాగమును జేసినందువలన గలుగు ఫలమును పొంది అంత్యమందు విష్ణుసాయుజ్యమును పొందును. మాఘమాసమంతయు శ్రద్ధాయుక్తుడై భక్తిగా స్నానమాచరించువాడును శ్రీమహావిష్ణువును అర్చించువాడును విష్ణులోక ప్రాప్తి నొందుటయేగాక వైకుంఠాధిపతి కూడ గాగలడు. పార్వతీ! మాఘమాసమున ప్రాతఃకాలమున స్నానముచేసి హరిని పూజించి యీ మాఘపురాణము వినినవాడు జీవన్ముక్తుడని చెప్పదగును. మరియు నట్టిపురాణ శ్రవణము, నదీతీరమందుగాని, జలా

శయనసమీపమందుగాని గావించినవాడు జన్మాంతరమందు మునీశ్వరుడై పుట్టును. ఎవడీరీతిగా మాఘమాసమందు స్నానము గాని, జపముగాని, విష్ణుపూజనుగాని, యథాశక్తిగా దానముగాని భక్తితో పురాణశ్రవణముగాని జేయడో, వాడు సమస్తపాపముల చేతను బాధనొందుచుండును. అట్లుగావించినవాని పాపములన్నియు నశించును. మరియుతిరిగి అంటనేరవు, మాఘమాసమం దేమానవుడు ప్రాతఃకాలమున స్నానము చేయడో అతడు మిక్కిలి క్రూరమైన కుంభీపాకనరకమందు కాలద్రోయబడి ఆయగ్నియందు వండబడుచున్నాడు. మదముచేత యేనరుడు స్నానము చేయడో అతడు కోటిజన్మలయందు చండాలుడై పుట్టుచున్నాడు. మాఘమాసమున చలికి భయపడి ప్రాతఃస్నాన మాచరింపనిస్త్రీనిగాని పురుషునిగాని చూడకూడదు. అట్లుచూచిన యెడల తిరిగి సూర్యుని చూచినగాని ఆదోషము నివారణ కాజాలదు. మాఘమాసమున ప్రాతఃస్నానము కోటియజ్ఞ ఫలప్రదము. గర్వముచేత ఎవడు స్నానము జేయడో, వాడు కోటి యజ్ఞములు చేసినను పశువులను చంపుచండాలుడగునే గాని వేరు కాజాలడు. బాలుడుగాని దరిద్రుడుగాని మాఘస్నాన మాచరించిన వేయియజ్ఞముల ఫలితమును పొంది అంత్యమందు పరమపదమును పొందును. బాలుడుగాని, పడుచువాడుగాని,వృద్ధుడుగాని మాఘస్నాన మాచరించిన హరి కటాక్షమువలన వారిపాపములన్నియు నశించును. బలమైన శరీరము గలవానికి మాఘస్నాన మత్యంతావశ్యకము. ఈస్నానము వలన నూరుసార్లు ఆకాశగంగలో మునిగినంత పుణ్యము లభించును. చండాలుడైనను, తెలియక మాఘస్నాన మాచరించిన, వాని పూర్వ పాపములన్నియునశించి పరిశుద్ధుడగును.

పార్వతీ! బ్రహ్మహత్యగావించినవాడును, మద్యపాన మొనరించినవాడును బంగారమును దొంగిలించిన వాడును, గురుభార్యను

పొందినవాడును వీరితో సహవాసమును గలిగియున్నవాడును యింకను యిట్టి మహాపాపముల నాచరించినవారు యీ మాఘస్నాన మాచరించిన యెడల వారు సమస్త పాపములనుండి విముక్తులై అంత్యమందు శ్రీహరిని పొందగలరు. ఈ మహాపాపములేగాక, కుక్కమాంసమును తినినవాడును, కులభ్రష్టుడును, క్రూరుడును, కులనాశకుడును దానము చేయనివాడును, నిత్యకర్మను విడనాడినవాడును, పశువులను జంపువాడును, పరులను వంచించు వాడును, అసత్యమాడువాడును, డాంబికుడును, భార్య, కుమారుడు, శిష్యుడు, సద్బ్రాహ్మణుడు, యోగ్యులైన బంధువులుగాక యితరులచే వండబడిన పదార్థములను భుజించువాడును, మిత్రద్రోహియు చేసినమేలు మరచువాడును, హత్యలను చేయువాడును, పరస్త్రీలోలుడును, పరులసొమ్మునపహరించువాడును, స్వధర్మమును విడిచి పరవృత్తులచేత జీవించువాడును వ్యవసాయము చేయు విప్రుడును, రాజద్రోహము చేయువాడును పరులను వచించు ఆశాపరుడై, యితరులమీద కొండెములు చెప్పుచు దీనుడై దేవతావిముఖుడై జీవించువాడును, తన్నుతాను పొగడుకొనుచు ధర్మకార్యములను చెడగొట్టుచు అయోగ్యులకు దానముల నిచ్చుచు, ఫలపుష్పసహితమగు చెట్లను నరుకుచుండువాడును, విశ్వాసఘాతకుడును, అగ్నిహోత్రములను విడిచినవాడును, పుత్రహీనుడును, చెడుకర్మలను చేయువాడును, గురువును నిందించు వాడును, మహాపాపియై దంపతులకు విభేదము గూర్చువాడును, గ్రామమునకు దేవాలయమునకు అధికారి యగువాడును, వేదములను చెప్పి ధనమార్జించువాడును, బహిష్కరింపబడినవాడును తెలిసి పాపమును చేయువాడును, తెలియక చేయువాడును, రహస్యముగా చేయువాడును, యీ విధమైన అనేక పాపకర్మలను చేసినవాడును, ప్రాయశ్చిత్తములేకనే మాఘమాసమందు ప్రాతఃకాలమున

సూర్యుడు సగము ఉదయించుచుండగా స్నాన మాచరించినచో వారందరును పరమపవిత్రముగా వగుదురని ఆ సమయమున సమస్త జలములును ఘోషించుచుండును.

పార్వతీ! క్రూరకర్మలు చేయువాడును, పాపములు చేయువాడును, లజ్జనువిడనాడినవాడును, మాఘమాసమున ప్రాతఃకాలమున స్నానమాచరించినవారి పాపములన్నియు హరింతుమని జలములు ఘోషించుచుంతును. సంసారభయమును, పాపభీతియు గల నరుడు మాఘమాసమున ప్రాతఃస్నానము చేయదగినది. ఇందుకు సందియము లేదు. ఎవడైనను బడాయికిగాని, భయముచేతగాని ఒకరి ప్రేరేపణ చేతగాని, సజ్జన సహవాసముచేతగాని సహజ స్వభావముచేతగాని మాఘమాసమందుషః స్నానమాచరించునో యతడు సమస్తమైన భయంకర పాపములనుండి విముక్తుడగును. ఏ నరుడు భక్తియుక్తుడై మాఘమాసమునకు మొదటిలో నేను ఉదయమున మాఘస్నానమును తప్పక చేయుదునని ఎవడు సంకల్పించిచేయునో అట్టివాని సమస్తపాపములు అగ్నిని వైచినదూదివలె అదృశ్యమగును. ఆ పాపములు నలుదిక్కులకు పారిపోవును. మరియు నాతడుపరబ్రహ్మమును పొందగలడు. పార్వతీ! సమస్తమైన నెలలలో మాఘమాసము మిక్కిలి ప్రశస్తము. సర్వదేవతలలో శ్రీహరి శ్రేష్ఠుడు. సమస్త శాస్త్రములలో వేదము ప్రధానము. సర్వవర్ణములలో బ్రాహ్మణులధికులు. అన్నిపర్వతములలో మేరుపర్వతము మిన్నయనందగును. గాన అట్టి సర్వోత్కృష్టమైన మాఘమాసమున స్నాన మొనరించువానికి వేయి రెట్లు ఫలము లభించును. కాంతా! మాఘమాసమున చలిచేత స్నానము చేయజాలని మానవుడు, దృఢమైన మరియొకని చేత స్నానముచేయించి వానికి దక్షిణనిచ్చి, వానివలన స్నాన ఫలమును గ్రహించినను, యిహసౌఖ్యము లనంతముగా పొంది

అంత్యమందు పరలోకసుఖమును బొందుచు, హరిసాన్నిధ్యమున సంతోషముతో చిరకాలము ఉండగలడు. మాఘస్నానమును చేయ జాలక చలికి వణకువారికి, యెండుకట్టెలను తెచ్చిఅగ్నిని ప్రజ్వలింప జేసినవానికి సమర్పించువారు, ఆ స్నానఫలమునుపొందుదురు.మాఘ స్నాన మాచరించినపిదప చలికి తాళజాలక అగ్ని నాశించువారు స్నానమును శ్రీహరికి అర్పించి మరియు నగ్నిని సేవింపవలయును. ఏ మానవుడు, దరిద్రుడు, కుటుంబీకుడును, వస్త్రహీనుడును నై మాఘస్నాన మాచరించి శీతపీడితుడై యుండువానికి వస్త్రదానము చేయునో యాతడు నా స్నానఫలమునుపొంది అంత్యమందు పరమ పదమును, పొందును. మాఘస్నానము చేయుట యందాసక్తుడును, దరిద్రుడును, కుటుంబీకుడును అగు బ్రాహ్మణునకు వస్త్రమునుగాని శాలువనుగాని దానము చేయువాడు సమస్తకర్మలను అంటని యోగీశ్వరునివలె పాపములను అంటనేరడు. మాఘమాసమురాగానే స్నానమును చేయుటయందిష్టములేనివానిని, మంచిమాటలచేతగాని బలవంతముచేసిగాని ఎవరుమాఘస్నానమునకు తీసికొనివెళ్ళునో,అత డును, అతనితో వచ్చినవాడునుకూడ పుణ్యవంతులగుదురు.ఏనరుడు మాఘమాసమున సూర్యుడు సగము ఉదయించుచుండగా,ప్రోత్సాహ పరచి జనులను స్నానార్థముతీసుకొని వెళ్ళునో, వారందరకును నూరు వాజపేయ యాగములను జేసినందువలన కలుగు ఫలితమును పొంద కలుగుదురు. మాఘస్నానమాచరించిన మానవుని యేపాపాత్ముడు దూషించునో వానిని సమస్తపాపములు ఆశ్రయించియుండును.

పార్వతీ! ఎవడు, ప్రేమచేతనైనను తండ్రినిగాని, తల్లినిగాని తమ్మునిగాని, కుమారునిగాని, మాఘస్నానమును మానుమని నిందింపునో, వాడు గోవును చంపిన పాపమును పొంది సమస్త కర్మల

చేతను తొలగింపబడును. మరియు ఘోర నరకమును పొందును. ఏ నరుడు, విప్రునిగాని, క్షత్రియునిగాని, వైశ్యునిగాని, శూద్రునిగాని, ఆడువారిని గాని మాఘ స్నానమును చేయుమని చెప్పునో వాడు పుణ్యలోకమును పొందును. మాఘస్నానమాచరించినవానిని చూచి యానందించువాడు పుణ్యమును పొందును. నిందించువాడు పాపుడగును. మాఘస్నానముతో సమానమయిన పుణ్యము మూడులోకములందును లేదు. ఆసమయమందే పాపములనుతొలగించి పుణ్యమునిచ్చును. శక్తిలేనివాడు పాదప్రక్షాళన మాచరించి పురాణమును వినినమొదల స్నానఫలమును పొందును. గాన శక్తిలేనివారు మాస మంతయు మాఘపురాణమును వినినమొదల స్నానఫలమును పొందగలరు. దుఃఖనివారణమునకు మాఘస్నానమునకు మించిన పుణ్యము లేదు. నూరుమారులు అశ్వమేధయాగములు చేసి దక్షిణల నిచ్చి సంపాదించిన ఫలితమును మాఘస్నానమువలన కలిగిన పుణ్యములు సమానములు! పాపభీతిచే సూర్యుడుదయించు వేళ మాఘమాసమున స్నానమాచరించువాడు రౌరవాది నరకములనుండి విడివడి విష్ణుసాయుజ్యమును పొందును. బుద్ధిగలవాడుగాని, జ్ఞానిగాని శ్రీహరిని ధ్యానించుచు మాఘమాసమున ప్రాతఃస్నానమాచరించినచో వాడు విష్ణుపదప్రాప్తి నందును. సోదరుని చంపినవాడుగాని, తల్లిని చంపిన వాడుగాని, మునీశ్వరుని చంపినవాడుగాని, స్నేహితుని చంపినవాడు గాని, మాఘమాసమున సూర్యోదయకాలమున స్నానము చేసిన మొదల సమస్తపాపములనుండి విముక్తి నగుటయేగాక శ్రీహరిని చేరగలడు.

ఓ పార్వతీ! ఎవరు మాఘమాస మందు స్నానమును చేసి భక్తితో యీకథను వినుచున్నారో, వారికి లభించు పుణ్యము

నింతింతయని నేను చెప్పజాలను. స్నానముచేయు శక్తిలేక మాస మంతయు యీకథ వినినవాడు చిరకాలము విష్ణులోకమందుండును.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున మొదటి అధ్యాయము

---

## రెండవ అధ్యాయము

పార్వతీ! వినుము. ఈ మాఘమాసమున స్నాన మాచరించిన మహిమవలన పూర్వకాలమువం దొక బ్రాహ్మణ వనిత పాపములచే విడువబడి తనభర్తతో గూడుకొని శ్రీమహావిష్ణువు సాయుజ్యమును పొందెను అని శంకరుడు చెప్పగా పార్వతీ దేవి, "నాథా! ఆ బ్రాహ్మణ పుత్రిక యెవరు! ఆమె చేసిన పాపకర్మమేమి? అది మాఘ స్నానమువలన యెట్లు నివర్తితమయ్యెను? యీ విషయములన్నియు సవిస్తరముగా నాకు తెలుపు" మని భర్తనుద్దేశించి పలుకగా పరమేశ్వరుడు పార్వతీ దేవి కీరీతిగా చెప్పసాగెను.

పూర్వకాలమున సౌరాష్ట్ర దేశమునందు బృందారక మను గ్రామమున సుదేవుడను ఒక [illegible] పుడుకలడు. అతడు సదాచారవంతుడును సజ్జనులను పోషించువాడును, వేదము, దాని యర్థము తత్వ సహితముగ తెలిసినవాడును, వేదాంతపంచకమును బాగుగ చదివినవాడును అయియుండెను. ఆ బ్రాహ్మణునకు వేదవేదాంగములను తెలిసిన శిష్యగణము చాలమంది గలరు. వారందరు ఆ బ్రహ్మజ్ఞాన సంపూర్ణుడగు సుదేవుని నిత్యము సేవించుచుండిరి. ఆ బ్రాహ్మణునకు పదిసంవత్సరముల వయసు గలదియు, మంచి చక్కని రూపముగలదియు, సమస్త అవయవ సమత్వ సౌందర్యము గలదియు, కాంతిగల

దియు బాలికామణియు, లేడిచూపులవంటి చూపులు గలదియు నగు కుమార్తెగలదు. మరియు నాబాలికామణి పొడవైన కేశములు గలదియు, సుందరమైన ముఖ వికాసము కలదియు, పండిన దొండ పండువంటి పెదవులు గలదియు, శంఖమునుబోలినకంఠముగలదియు చిలుకయొక్క స్వరమును బోలినస్వరవిశేషము గలదియు, చక్కని ముక్కు కలదియు, రమ్యమైనమందహాసము గలదియునై విరాజిల్లుచుండెను. ఆకన్యకను జూచి సుదేవుడు యీ బాలికను యెవరి కిచ్చి పెండ్లిగావింతునని ఆలోచించుచుండగా, కొంతకాలమునకు శిష్యుడైన సుమిత్రుడనువాడుఒకనాడు గురువునిమిత్తమై సమిత్కుశ ఫలపుష్పాదులను దెచ్చుటకై యరణ్యమునకుబోవుచుండగా బంతి యాడుకొనుచు నాకన్యకామణి వాని వెన్నంటి ఆ యరణ్యమునకు పోయెను. సుమిత్రుడును చాలదూరముగా నా యరణ్యమునం బడి పోయెను. అందు జలపూరిత మయిన తటాకమును గాంచెను.

ఆ సరస్సుయొక్క తీరమందు అనేక విధములగు వృక్షము లున్నవి. నిర్మలమైన,చల్లనినీటితో నిండి యున్నది.వికసించిన పద్మములచేత విరాజిల్లు చున్నది. తుమ్మెదలతో తులతూగుచున్నది. యెఱ్ఱని పద్మములచేతను బంగరువన్నె గలకలువలచేతను ప్రకాశించు చున్నది. జలజంతువులచేతను, విభిన్నతరంగములచేతను, స్వేచ్ఛగా తిరుగాడుచు, కూయుచున్న పక్షివిశేషములచేతను ప్రకాశించు చుండెను. మరియు, కోకిల స్వరములతోడను,చిలుకపలుకులతోడను, వృక్షములతోడను, అంతఃపురతుల్యమై రాణించు నావనమునుజూచి యచ్చటగల తటాకోదకమును గ్రోలి, ఆతీరమునగల ఫలములను భుజించి యేకాంత స్థలమందు సుఖాసీనమై యున్న ఆ బ్రాహ్మణ పుత్రిక, చలించినదై, మన్మథవికారావేశమై, తొందరపాటుగల

మానస్సుగలదై ఆ సుమిత్రుడను శిష్యునితో రతిక్రీడలను సలుప నిశ్చయించినదై వానినుద్దేశించి ఓ శుభాకారా! యీదివ్యమైన జన శూన్యమైన, ప్రకృతి విరాజమానమైన యీ వనమందు నీతోగూడ సంభోగింప నామనస్సు వాంఛను దవిలియున్నది. యీవనమందణగి యున్న మన్మథాగ్ని నన్ను దహించుచున్నది. నీవునాతో సురత క్రీడలదేలి యీ యగ్నిని చల్లార్చుము. ఇరువురమనంబులకును రమ్య మైనదియు, సమానమగు యీవనముగల వారమగుటచే సంభోగ మున కనుకూలమగునదియు, సుఖవంతమగు నీప్రదేశమున తల స్పర్శ చేయక నావద్దకువచ్చి, నామృదువైన శరీరమును కోమల మైన యవయవములను నీవు ప్రేమతో మన్మథావిష్టుడవై నన్నా లింగనము చేసికొనుము. అనిపల్కిన బ్రాహ్మణవనితను సుమిత్రుడు చూచి బాలికా! యిట్టి అపవిత్రమైన వాక్కులను నీవు పలుకరాదు. నీవునాకు గురువుకుమార్తెవు పుణ్యవతివి. నాకుసోదరివగుదువు మన్మథా వేశవై యీరీతిగా సోదరుడనగు నన్ను రతిక్రీడకు రమ్మని యర్థించుచున్నావు. సంభోగమునకు నేనంగీకరింపను. అట్లుగావించితి మేని సూర్యచంద్రాదులుండు నంతకాల మీకర్మ ఫలము ననుభ వించుచు నరకమందుండ గలవారము. కాన లేచి యింటికిపొమ్ము. గురువు నామీదకోపము వహించును. ఆలస్యమైన తండ్రి నిన్ను కొట్టును. సమిత్కుశపుష్ప ఫలాదులం గైకొని యింటికిత్వరగా పోదము రమ్ము. నామాట వినుమని పలువిధముల పలికెను. ఆకన్య సుమిత్రునిగాంచి మోహనా! కన్యక, రత్నము, బంగారము, విద్య అమృతము తనంతటతానె స్వయముగా యెవరికి వచ్చినప్పుడువద్దని నిరాకరించువాడు మూర్ఖుడని తెలియదగును. అన్యోన్యము ఆలిం గనము సురతము ననుభవింపక నన్ను విడిచి నీవింటికేగ దలచిన నీ వనమందే ప్రాణత్యాగ మొనరింతును. నేను లేకుండ

నీ వొంటరిగా జనినయెడల నాతండ్రి నిన్ను శపింపగలడు. సంభోగ రహితవై శరీరధారివై యావనమున నుండజాలను. నీతో గలసి నే నింటికిరాను. నీవాకర్మఫలమనుభవింపుము అనిపల్కినంతట విషమ పరిస్థితిలో బడి సుమిత్రుడు ఆ బ్రాహ్మణ వనితతోకూడ సురతక్రీడల దేలుటకై నిశ్చయించెను.

పార్వతీ! యీరీతిగా వారిద్దరును ఒక సుందర ప్రదేశమందు పద్మములతోడను, పువ్వులతోడను, సువాసనలతోడను, సంభోగమున కనుకూలమగు శయనము నేర్పరచి కోయిల నిస్వనముల మధ్య, కపోతముల కలకలములనడుమ, చిలుక పలుకుల శబ్దములయందు, పరిమళయుక్తమగు వాయు సంస్పర్శలతో, మన్మథ వికారములచేత విలసిల్లుచున్న అన్యోన్య చుంబనాలింగనాది చేష్టలం జరిపి సురత క్రీడ దేలియాడు చుండిరి. వారట్లుగావించి పరస్పర మనోల్లాసమును పొంది, బంతియాటలాడి, సమిత్కుశపుష్పఫలాదులు సంగ్రహించి యా సుందరవనమును విడిచి గ్రామమున కేగిరి. సుమిత్రుడు తెచ్చిన సమిత్కుశాదికమును గురువైన వసుదేవునికి సమర్పించెను. సుదేవుడును శిష్యుని సంతోషబరచి కుమార్తె నుద్దేశించి కన్యకా! నీవు బంతియాటలాడి అరణ్యమున మిక్కిలి యాయాసపడి యున్నావు. ఈ రుచికరమగు భోజనమును చేయుమని పలుకగా తండ్రి యానతి ప్రకారమామె యట్లేచేసెను. తరువాత కొంతకాలమునకు ఆ కన్య కను కాశ్మీరదేశస్థుడగు బ్రాహ్మణుడొకడు పెండ్లియాడెను. పిమ్మట కాలకర్మవశమున ఆ బ్రాహ్మణుడు చనిపోయెను.

అప్పుడా భర్తశవమునుగని నేలంబడి యేడ్చుచున్నట్టియు, వేడిమూపులు గలదియు, విగతకేశియు, ఊడిన వస్త్రములు గల దియు, నగు, తనకుమార్తెనుజూచి, సుదేవుడు విచారించెను.

మరియు, పతివ్రతయై బాలికామణియై, మన్మథావస్థంబడి భర్తృహీనమైయున్న యీ నా కుమారికను చూచుట బహుకష్టము. యీమెకీ విచారముతో దినము లెట్లుగడుచును? ఈమె పూర్వజన్మమందొనరించిన పాపకృత్యములచేత యీరీతిగా వైధవ్యదుఃఖమును పొందినది. బ్రహ్మ యిట్టిసుందరవనితకు వైధవ్యము నుదుటవ్రాసెను. గదా! ఎంతమూఢాత్ముడు! సృష్టిచేయుధాత యీరీతిగాదుష్కర్మ చేయబూనినాడు. అని సుదేవుడు భార్యతో గూడ పలువిధముల విలపించెను. అంతట నియతమైన వ్రతనిష్టగలవాడును, సమస్తభూతములందును దయగలవాడునునగు దృఢవ్రతుడగు మునీశ్వరుడచటికి వచ్చెను. అతడు బిక్షార్థము యింటింట దిరుగుచు,నచ్చట నారోదనమును విని దయగలవాడై యచ్చటకువచ్చి సుదేవునితో అయ్యా! నీవెందుకట్లు యేడ్చుచున్నావు? కారణమును జెప్పుము. నీదుఃఖము నేను క్షణములో నివారింతును. అని పల్కిన మునిపల్కులు విని సుదేవు డాతనితో మహానుభావా! మా దుఃఖకారణము నాలింపుము. నీదర్శన భాగ్యమువలన మా దుఃఖమంతరించినది. నాకు శాంతి కలిగెను. ఈ చిన్నది నా కుమార్తె; దీనిభర్త చనిపోయెను. అందువలన నిది యేడ్చుచున్నది. దీని విచారమువలన, దీనియందుగల ప్రేమచేత నేనును యేడ్చుచుంటిని. ఈబాలిక పూర్వజన్మమునందేమిపాప మాచరించెనో తెలిసి జెప్పుము. నీవాక్యామృతముచే నాదుఃఖాగ్నిం జల్లార్పుము.అని బలికిన సుదేవుని పలుకులువిని యతీశ్వరు డిట్లు బలికెను.

పాపరహితుడైన విప్రుడా! వినుము. నీ కుమార్తె,పూర్వకాలమందు క్షత్రియకన్యక; మిగుల సుందరవతి, జరాసక్తిచే జారుల మాటలను లెక్కకొనుచు భర్తను జంప నుద్దేశించెను. మరియు విదర్భదేశాధిపతియగు నాతని యర్థరాత్రియందు నిద్రించుచుండగా

కత్తితో జంపెను. మిక్కిలి భయముగలదానివలె విచారించెను. పిమ్మట ఆ కత్తితోనే తనను కూడా చంపుకొనెను. ఇట్లు భర్తను చంపి తాను కూడ నిహతురాలయ్యెను. అట్టి పాతకురాలు నీకు కూతురుగా బుట్టెను. నీకుమార్తె దోషమువలన నీ యల్లుడు మృతి బొందెను. విధవయయ్యెను. ఈ కన్యక, దోషసహిత యైనప్పటికిని. పాపరహితమైన నీయింటియందు పుట్టుటకు కారణమును చెప్పెదను; వినుము.

పూర్వకాలమున పదునాలుగు జన్మల క్రిందట మాఘమాస మందు మకరరాశియందు సూర్యుడుండగా గౌరీవ్రతపరాయణులైన వరింగూడి సరస్వతీనదికి వెళ్ళి అచట విప్రస్త్రీ లందరును ఇసుకతో మాఘగౌరిని చేసి ప్రతిదినమును భక్తితో పూజించుచుండగా నీకుమార్తె వారు చేయు పూజాదికమును జూచుటవలన పవిత్రమయిన నీ వంశమందు జన్మించినది. ఆ విధముగానే యీ జన్మమందును, వనమునకు బోయి అచట ఘోరమైన పాపమును చేసినది. ఎట్టిదనగా చెప్పెదను వినుము. మన్మథపరవశయై నీశిష్యుడగు సుమిత్రునితో సంభోగించినందువలన యీజన్మమందే నీ కుమార్తె ఫలితమును పొందెను. కాబట్టి పూర్వార్జితపాపమును, యీ జన్మమందలి పాపములు నీ కుమార్తె నీరీతిగా బాధించుచున్నవి. వృథాగా శోకించుటవలన ప్రయోజనములేదు. మానవులకుతాము చేసిన పాపపుణ్యము లనుభవింపక తప్పదుగదా! అనిపలికిన యోగీశ్వరుని పలుకు లాలించి సుదేవుడు తన రెండు చెవులను చేతులతో మూసికొనుచూ, హరి హరీ! ఎంతటి పాపపు పలుకులు వినవలసి వచ్చెను. నాకుమార్తె పూర్వజన్మమున పతిని జంపి తానాత్మహత్య గావించుకొనెను ఈ జన్మమున కన్యకగానుండగనే గురుపుత్రునితో

తుల్యుడగు నా శిష్యునితో సంగమించినది. అని కొంతతడవు విచారించి యోగీశ్వరు నుద్దేశించి ఇట్లు పలికెను.

ఆర్యా! నాకుమార్తె చేసిన పాపము లెట్లు నశించును. నా యల్లుడు తిరిగి యెట్లు జీవింపగలడు ? ఇందుకుగల విధానమును నీవు నాకు సవస్తరముగా దెలియబల్కుమని సుదేవుడడిగెను. దృఢవ్రతుడగు నా యతీశ్వరుడు సుదేవునిగాంచి గురుదేవా! నీకుమార్తెయొక్క సౌభాగ్యమును, నీ యల్లుని జీవనమును గోరుచున్నావు గాన చెప్పెదను వినుము. మాఘమాసమందు సూర్యోదయకాలమున చెఱువు నందుగాని నదియందుగాని నీ కుమార్తె చేత స్నానము చేయింపుము. మరియు నా తీరమునందే యిసుకతో గౌరీ ప్రతిమను చేసి సువాసనలతో గూడినవై, ధూపదీప నైవేద్యములచేత పూజింపవలెను. ఇట్లు మాఘమాసమున నెలరోజు లీవ్రతమును నీకుమార్తెచేత చేయించితి వేని నీకుమార్తెయొక్క సంచిత పాపము లన్నియు నశించును. భర్తకూడ పునర్జీవుడగును; మాఘశుద్ధ తదియ దినమందున రెండు క్రొత్తచేటలను దెచ్చి, దానియందు చీర, రవికె, పసుపు, పండ్లు, తాంబూలము, దక్షిణలనుంచి, యొక ముత్తయిదువ స్త్రీని కాటుక మొదలైన యలంకరణ ద్రవ్యములచే పూజించి, యా రెండు చేటలను (మూసివాయనము) నామెకు సమర్పించి ఏడుమారులు ప్రదక్షిణ నమస్కారములను గావించి సంతుష్టినిగా భోజనమిడిన యెడల నీకుమార్తె చేసిన సంసర్గదోషము నివృత్తియగును. ఆ పాపము నశించును. కాబట్టి మాఘస్నానమువలన స్త్రీకిగాని పురుషునకుగాని స్వకృతపాపసంచయ మంతయు పటాపంచలగును. మకరమందు రవియుండగా మాఘమాసమున స్నానము జేసి హరిని ధ్యానించి చక్రాంకితమును పొందువాడు శ్రీహరిని బొందును. విధవగాని, ముత్తయిదువ కాని మాఘస్నాన మాచరించిన, శ్రీహరిని

జేరును. సువాసిని సర్వదా సౌభాగ్యమును పొందగలదు. ఆడువారి మాఘస్నానము ముఖ్యముగా విప్రులకు విశేషమైన ఫలితమిచ్చును. సమస్త శుభములనిచ్చును. సర్వదుఃఖములను రూపుమాపును. ఋషిసత్తములు మాఘస్నాన మాచరించినవారికి పాపము లంటవని వక్కాణించిరి. పిచ్చివాడైనను, అమాయకుడైనను, స్త్రీ గాని పురుషుడుగాని, సహవాసముచేతగాని, సహజముగాగాని డాంబికము నకుగాని, మాఘమాసమందు మార్తాండు డుదయించు వేళకు స్నాన మాచరించునో, వాడు సమస్త పాపములచేత విడువబడి శ్రీహరిని పొందగలడు. ఈరీతిగా పలికిన యతీశ్వరుని మాటలు విని సుదేవుడు వెడలిపోయెను, దృఢపుత్రికయును, తనదారిని స్వేచ్ఛగా జనెను. పిమ్మట సుదేవుడు తన కుమార్తెను మాఘమాసమున స్నానమును జేయించి మాఘగౌరీవ్రత మాచరింపజేసెను. కాబట్టి ఓ హైమవతీ! ఆ పుణ్యముచేత నామె పాపములు నశించెను. భర్త జీవించెను. పిమ్మట స్నేహితులతోడను, తండ్రితోడను అనేక సుఖముల నను భవించి అంత్యమున భర్తతో కైవల్యమున కేగెను. సుదేవుడును మాఘస్నాన మాచరించి ముక్తినొందెను.”

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున రెండవ అధ్యాయము.

—

## మూడవ అధ్యాయము

పార్వతీదేవి శంకరుని గూర్చి “నాథా! సుదేవుడును, నాతని కుమార్తెయు పాపములచేత విడువబడి పవిత్రవంతులైరని బల్కితిరి

గదా! గురుశిష్యుడైన సుమిత్రునికి గల పాపమెట్లు పరిణమించెను? వినగోరుచుంటి" నని పలుకగా సాంబశివుడు తన కాంతను గాంచి "పార్వతీ! కొంతకాలమునకు పాపరహితుడైయున్న తన గురువును గాంచి సుమిత్రుడు పశ్చాత్తాపము బొందినవాడై యిట్లుపలికెను.

"గురువర్యా! అరణ్యమున నేను నీ పుత్రికతో సురత క్రీడల దేలితిని. నేను కోరి చేసిన కృత్యముకాదు. నీకుమార్తెయే నన్ను కోరినది. నేను వలదని పలువిధముల వారించితిని, వినక నేనామెను కలియని యెడల ఆత్మహత్యాగ మొనరింతునని క్రూరముగా బెదరించెను. మీపుత్రిక మృతిజెందిన తాము శాపమిత్తురను భయమున సంభోగించితిని. నీ పుత్రికవలన నాకిట్టి మహాపాపము సంభవించినది. నేనీ పాపమును భరింపలేను గాన దీనికి తగు ప్రాయశ్చిత్తమును చెప్పుము. తదనుష్ఠానమున నేను పాపవిముక్తుడనగుదును. అనిపల్కిన శిష్యుని మాటలను విని వాని పాపమునకు పరిహారమును తెల్పెను. అదెట్లన గంగానదీ తీరమునకుబోయి యచ్చట పండ్రెండు సంవత్సరములు ఘోరతప మాచరింపవలయును. దానివలన సురతేచ్ఛవలన గలిగిన పాపములు నశించును. అంత నాసుమిత్రుడాపల్కులాలించి గురునాజ్ఞనుపొంది గంగానదీ తీరమును గూర్చి వెడలెను. మార్గమున మునులచేత గూడినదియు మనసున కానంద దాయకమైనదియు, సమస్తజీవులకును సుఖము నిచ్చునదియునగు; నొకదివ్యమైన ఆశ్రమమును జూచెను. సుమిత్రుడు మార్గాయాసముచేత మెండబాధకు బడలినవాడై ఆ యాశ్రమమును ప్రవేశించినంత కన్నులకానందదాయకముగ నదీతీరమున మాఘస్నానముచేసి పరిశుద్ధులై సంతానముతోడను, శిష్యగణముతోడను; భార్యలతోను గూడుకొని సుఖాసీనులై మాఘపురాణమును శ్రద్ధతో విని యానందించుచు శ్రీహరిని పూజించుచున్న మునీశ్వరు లాతనికంట బడిరి. అంతట

సుమిత్రుడు వారికి వినయముతో నమస్కరించి, మునులారా! మీ రాచరించు వ్రతమేది? దీనివలన కలుగు ఫలితమేది? ఏపుణ్య లోకము కలుగును. మీరు పూజించున దెవరు? యీ మొదలగు విశేషములను వివరముగా నాకు దెల్పుడని ప్రార్థించెను.

మునీశ్వరు లా సుమిత్రుని పలుకులువిని మాఘమాసధర్మము లను వానికి దెల్పుటకై సత్యవ్రతుండను నొకముని శ్రేష్టుని నియమిం చిరి. అంత నా సత్యవ్రతుఁడా సుమిత్రునితో నిట్లని చెప్పసాగెను. విప్రకుమారా! చెప్పెదను సావధాన చిత్తుడవై వినుము. ఇది మాఘమాసవ్రతము. ఇది మహా పాపములను సహితము నాశనము చేయును. మాఘమాసమున మకరరాశియందు సూర్యుడుండగా సూర్యోదయమగుచుండగా నదియందే నరుడు స్నానమాచరించునో వాడు శ్రీవిష్ణువున కిష్టుడగును. దోషములేక శ్రీహరిని పూజించి యీ మాఘమాసమహాత్మ్యమును వినుచు ఒక మాఘమాసమైనను పూర్తిగా నెలదినములు వ్రతమాచరించునో వాడు శ్రీహరిసాయుజ్య మును పొందును. మాఘస్నానము చేయనివాడును, సత్యమును, పరిశుద్ధతనువిడనాడినవాడును, సదాచారపరులను నిందించువాడును, బ్రహ్మహత్యనాచరించిన వానితో తుల్యుడని యెఱుంగుము. కూటసాక్ష్యములు జెప్పువానిని, దురాచారసంపన్నుని, సంభోగప్రియుని, పరస్త్రీరతుని, మాఘవ్రతము వదిలిన వానినికూడ బ్రహ్మహత్యా పాతకుడని యెఱుంగుము. వృక్షములను తోటలను నరుకువానిని, దుర్మార్గుని, కన్యలను, గుఱ్ఱములను, పశువులను, అమ్ము వానిని, మాఘమాస వ్రతమునుద్యజించినవానిని, బ్రహ్మఘాతకుడని దెలిసి కొనుము. చెఱువు గట్టలను తెగగొట్టి, నీటిని పోనిచ్చువానిని, పర స్త్రీలయందాసక్తుడగు వానిని, మాఘస్నానమునుమానినవా నిని, బ్రహ్మహంతకుడని గ్రహింపుము. దేవద్రవ్యమునుదొంగిలించువానిని

మాఘ స్నానమును చేయనివాని నిస్తేయియని పండితులు పల్కుదురు. అనగా పంచ మహాపాతకముల నాచరించు వారితో సమానులగుదురు. విప్రునకు వాగ్దాన మొసంగిభిన్నముగానొనరించు వాడు మాఘస్నానమును వదలిన మానవునివలె పాపమతియగును. గురువుతోను, విప్రునితోను తగవులాడి ద్వేషించువాడును, ఆత్మ స్తుతిగావించుకొనువాడు, వైశ్య దేవరహితమైనయన్నము తిను వాడును బంగారమును దొంగిలించినవాడును, పరభార్యాసంగమమును సోదర భార్యాసంగమమును, మాఘస్నాన పరిత్యక్తుడును, గురుభార్యా రతుడును, చండాలురతో భాషించువిప్రుడును, దర్భలుచేత లేని బ్రాహ్మణుడును, రజస్వల, చండాలుడు మొదలగు వారిమాటలు వినుచుభుజించువాడును, దుష్టసహవాసము చేయువాడును, వేదశూన్య మగు గ్రామమున నివసించువాడును, పంచమహాపాతకులలో లెక్క గొనబడును.

పురాణమునువినుచుండగను, పెండ్లి నిశ్చయమగు చుండ గను, ఉపనయనము జరుపుచుండగను, ధర్మకార్యము లొనర్చు చుండగను, విఘ్నములు కల్పించువాడు మాఘమాసపురాణమును వినని మూర్ఖునివలె పశుఘాతకుడగును. శరణాగతుడగువానినిచంపిన వాడును, తీర్థయాత్రలయందు మనసు లేనివాడును, ఈవ్రతమును విసర్జించువాడును సమాన పాపులేయగుదురు. పితృయజ్ఞము మొద లగు కర్మలను వదలినవాడును, భార్యనువిడచినవాడును కులాధము డును, ఈ వ్రతహీనుడును, సమానులే యగుదురు, మాతాపితరు లతో కలహించువాడును, మాఘస్నాన పరిత్యక్తుడును సమానులు, పాపాత్ములు పొందుకష్టములుమాఘస్నానము మానిన వాని నాశ్ర యించునుగాన బుద్ధిమంతులు మాఘస్నాన మాచరించి సుఖింప వలెను. మేము చేయునది మాఘవ్రతము దీని నాచరించువాడు పాపములచే విడువబడి సుఖవంతుడగును.

మాఘమాసమున అరుణోదయ కాలమున శ్రీహరిని పూజించి స్నాన మాచరించువాడు, అశ్వమేధయాగ ఫలమును పొందును. మాఘమాసమునకు శ్రీహరి అధిదేవత. ఈ మాసఫలము నిచ్చువాడు శ్రీహరిగాన మాఘవ్రతము చేయువాడా మాధవుని పూజింపవలెను. ఎవడు మాఘమాసమున ప్రాతః కాలమున స్నానము చేసి మాధవుని తులసి దళముచేత పూజించునో యతడు విష్ణుసాయుజ్యమును పొందును. శ్రీహరిని తులసిగుత్తులతో నదీతీరమున బూజింపవలెను. కల్పోక్తరీతిని గంధము, అర్ఘ్యపాద్యాది విధులచేతను, ధూపదీప నైవేదన తాంబూలాదుల చేతను, ఫలాదులతోడను భక్తియుక్తముగ పూజింపవలెను. మరియు నా శ్రీహరిని సన్నిధానమున మాఘ పురాణమును బఠింపవలెను. పురాణ శ్రవణానంతరము విప్రులకు బంగారము, వస్త్రము, అన్నము, ఉదకము లోనగు వాటిచే తృప్తిపరచి; కందమూల ఫలాదులచేత మాసమంతయు వ్రతమాచరించవలెను. మాసమంతయు నీ రీతిగా వ్రతమును జరిపి మాసాంతమందు మాఘస్నాన ఫలితమునకై శ్రీహరి ప్రీతిగా బ్రాహ్మణసమారాధన జేయువలయును. ఈరీతిగా ఏ మానవుడు మాఘవ్రత మాచరించునో వానికి పాపములంటవు. యముడు దరికిరానేరడు. పునర్జన్మలేదు. తిరిగి మాతృస్తన్య పానమును చేయడు. ఇంద్రియవశుడు కాడు. దుఃఖమును పొందడు. సుఖవంతుడగును. ఇదియే మాఘ వ్రతము. నీవు వినదలచితివి గాన చెప్పితిని. ఇక మాఘమాసము మూడుదోజులు మాత్రమే గలదు. పాపములను హరించునదిగాన వెంటనే యీ నదిలో మునుగుము. అని చెప్పిన సత్యవతుని మాటలను సుమిత్రుడు విని పశ్చాత్తాపజనితమైన పాపమును గూర్చి నివేదించెను. సుదేవునితో తనవిషయమును జెప్పుటయు, సుదేవుడు తనకు చెప్పిన పాప నివారణోపాయమును గూడ సుమిత్రుడు చెప్పగా విని సుదేవు డిట్లు పలికెను.

అమాసమున భక్తితో మూడు దినములు స్నానమాడినను కథాపురాణములను వినుటవల్లను, పాపముల్నియు నశించిపోవును. సర్వఫలమును సమకూర్చి గంగాతీరమునకు వెళ్ళును. గురువుగారి వచనప్రకార మాచరింపుము. అట్లు గావించితివేని జన్మరాహిత్య మును పొందగలవు. జరామరణ వివర్జితమైన మోక్షమును పొంద గలుగుదువు అని చెప్పిన సత్యవ్రతుని మాటలు విని మాఘమాస మున మిగిలిన మూడు దినములు స్నానము చేసి పాపవిముక్తుడై భక్తితో గంగాతీరము జేరి ఘోరమగు తపమొనరించెను. ఇంద్రియ ములను బంధించి, చలి, యెండ, గాలి బాధలనుసహించి, వేరేదృష్టి లేక, యేమాత్రమును చలింపక, భక్తిగలిగి ముక్తినాసించి, శంఖ చక్రగదాధారియు, చతుర్భుజ విరాజమానుడును పీతాంబర ధరు డును కౌస్తుభ ధారియు, కంఠమందు ముత్యాలహారము గలవాడును కిరీటమును గలిగియున్న లక్ష్మీవిభుడైన శ్రీమహావిష్ణువును మనసు నందు నిలిపి ధ్యానింపుచు తపమాచరించుచుండెను.

పార్వతీ! వినుము. యీ రీతిగా తపమును జేయుచున్న సుమి త్రుని జూచుటకుగాని, తపః ప్రభావ మిట్టిదని చెప్పుటకుగాని యెవ్వరి కిని సాధ్యముగాకుండెను. ఇట్లు సుమిత్రుడు తపస్సును పన్నెండు సంవత్సరములు చేసెను. పిమ్మట శ్రీహరి కరుణా కటాక్షమువలన సుమిత్రుడు మోక్షము బొందెను. ఇది యంతయు మాఘమాస స్నానమువలన గల ఫలితమని తెలియవలెను. నీ వడిగిన ప్రశ్నకు సమాధాన మిచ్చితిని గదా! యీ సుదేవుని శిష్యుడైన సుమిత్రుని పాపనాశనమైన కథను యేమానవుడు మాఘస్నాన మాచరించి యొక మారైనను వినునో యాతడు సమస్త పాతకములనుండి విడువబడి వైకుంఠ మును జేరగలడు.

ఈ అధ్యాయమును, భక్తిచేత గాని, బలవంతముచేత గాని, యిష్టతలేకగాని వినినవాడు మాఘస్నాన ఫలమును పొందును. భగవంతుని భక్తిప్రసక్తిగల యీకథను యేనరుడు వినడో వాడు అంధతమమను నరకమున బడియుండును. ఛందస్సులేని మంత్రమును ఓంకారములేని తపస్సును, మాఘమాస కథను వినని వ్రతధర్మములును నిష్ఫలములే కాని ప్రయోజనకారి కాజాలవు" అని యీరీతిగా పరమేశ్వరుడు పార్వతికి చెప్పెను.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు మూడవ అధ్యాయము.

—0—

## నాల్గవ అధ్యాయము

మహాదేవుడు పార్వతిను ద్దేశించి చెప్పుచున్నాడు. "పార్వతీ! ఇహపరసుఖములనిచ్చు మాఘస్నాన ప్రభావమును దెల్పుమరియొక ఇతిహాసమును చెప్పెదను వినుము. మాఘమాసమున స్నానమాచరించువాడు యీ లోకమందును పరలోకమందును కూడ చక్రవర్తియగును. మరియు యీ శుద్ధదశమియందుభక్తితో శ్రీహరిని పూజించినవాడు వారికిప్రియుడగుచున్నాడు." అంత పార్వతి శంకరునితో "ప్రియా! యీ లక్ష్మీనారాయణవ్రతము యిష్టార్థముల నిచ్చునది గాన దీనిని నాచరించువిధానమెట్టిది? దీనికి కావలసిన ద్రవ్యసంచయమేమి? ఎట్లుపూజింపవలెను? యీవిషయములు చెప్పు"మని యడుగగా శంకరుడు చెప్పుచున్నాడు. "ఈశుక్లదశమినాడు ఉదయమున స్నానముచేసి నదీతీరమందుగాని స్వగృహమందుగాని మంటపమును యేర్పరచవలెను. ఆ మంటపమును గోమయముచేత నలికి రంగు

రంగుల ముగ్గులతో అలంకరించి మధ్యను అష్టదళపద్మమును నిర్మించి స్వస్తికావరణను పరికల్పించవలెను. అనేక పువ్వులు పండ్లతోను చాందినీలతోను అలంకరించి ఆమంటపమందు జగదీశ్వరుడైన శ్రీ లక్ష్మీనారాయణుల పూజ చేయవలెను. క్రొత్త కలశమందు నీరును పోసి ఆకుచిగుళ్ళను, పండ్లను వుంచి వస్త్రమును క్రొత్తదానిని కప్పి ఆవస్త్రమధ్యమున లక్ష్మీనారాయణ ప్రతిమనుంచి పూజ చేయవలెను. ఆపీఠమున మధ్యగా సాలగ్రామమునుంచి పూజింపవలెను. పవిత్రులైన బ్రాహ్మణుల చేత నా సాలగ్రామమును పంచామృతస్నానమును చేయించి తులసీదళముల చేతను, పువ్వుల చేతను, పూజచేసి చందనము, ధూపదీప నైవేద్యమును యిచ్చి, పాయసాన్నములు, అపూపములు, మొదలగునవి సమర్పించి పూజించవలెను. మరియు పూజించునప్పుడు, వైకుంఠవాసునికొరకు స్నానమును సమర్పించుచుంటిని, ఇష్టార్థ ప్రదునకు వస్త్రమిచ్చుచుంటిని. జనార్ధనునకు యజ్ఞోపవీతమును, గోవర్ధనోద్ధారునకు గంధమును, పద్మాలయాకాంతునకు పుష్పములను, సూర్యసమాన తేజునకు ధూపమును యిచ్చుచుంటిని. సురేశ్వరునకు దీపమును, కేశవునకు నైవేద్యమును, సుముఖునకు తాంబూలమును, విష్ణుదేవునకు ప్రదక్షిణమును, నరసింహమూర్తికి నమస్కారమును, లక్ష్మీనారాయణ స్వరూపుడైన శ్రీరామచంద్రునకు ఓంకారసహితమగు మంత్రముల చేత జపమును సమర్పించుచున్నాను అనుచు భక్తితో శ్రీహరికి తామ్రపాత్రలోని నీరు అర్ఘ్య ప్రధానమివ్వవలెను. ఓ లక్ష్మీపతే! సమస్త దేవతలకు ఆధారభూతుడవును, లక్ష్మీనారాయణ స్వరూపుడవును, అగు నీ కొరకు అర్ఘ్యమిచ్చుచుంటిని. స్వీకరింపుమని ప్రార్థింపవలెను.

దేవా! నా చేత చేయబడు యీ వ్రతమును ఫలప్రదముగా నొనరింపుమని ప్రార్థింపవలెను. మాఘస్నానము చేయువారు

స్నేహితులతోను. బంధువులతోను, తల్లిదండ్రులతోను, కూడుకున్న వారై బ్రాహ్మణులకు; బియ్యము, బెల్లము, ఉప్పు దానమియ్య వలెను. పిమ్మట యీ వ్రతము చేయువారు చేత నక్షింతలనుంచుకొని మాఘపురాణమును భక్తితో వినవలెను. అనంతరమందు యథా శక్తిగా బ్రాహ్మణ సంతర్పమును జేయవలెను. పార్వతీ! ఇట్లీ స్నానము చేసి ఈశుద్ధదశమినాడు లక్ష్మీనారాయణ పూజగావించిన వ్రతమహిమచేత మేరుపర్వతము మందరపర్వతముతో సమానముగు పాపములైనను నశించును.

మందస్మిత ముఖారవిందురాలవగు పార్వతీ! వినుము. మాఘ వ్రతము నారంభించు వారికి యెవరు ధనసహాయమును చేయుదురో వారలకా వ్రతఫలము సిద్ధించును. ఈ మాసమున లక్ష్మీనారాయణుని దర్శించినవాడు రాజు దుర్యోనివలన యెట్లు ముక్తిని గాంచెనో అట్లే పాపవిముక్తుడై మోక్షమునుపొందును. అని చెప్పగా శంకరా! ఆరాజు యెవ్వడు! ఏ పాపము చేత దుర్యోనిని పొందెను? వాని కా పాపమునుండి ముక్తి యెట్లుకలిగెను? నాకు యీ విషయము వివరముగా దెల్పుమనిన పార్వతి యడుగగా శంకరుడు చెప్పుచున్నాడు.

శాంభవీ! పూర్వకాలమున సమస్త శాస్త్రకోవిదుడును, సర్వ భూతదయాపరుడును, సర్వమానిసన్మానుడును అగు గౌతముడను ఋషివర్యుడు అనేకమంది శిష్యులతోను, భక్తులతోనుకూడినవాడై తీర్థయాత్రలు సల్పుచు సమస్తముగు నదులలో గుంకులిడుచు క్రమముగా నుత్తమమగు కృష్ణవేణీనదీతీరమును చేరెను. గౌతముడు మాఘమాసము రాగానే ఆ నదీతీరమున యాశ్రమమును నిర్మించుకొనెను. గౌతముడు తనశిష్యులతో కూడినవాడై కృష్ణవేణీనదియందు సూర్యోదయసమయమున ప్రాతఃస్నానము గావించెను. పిమ్మట ఆతీరమునగల అశ్వత్థమూలమునందుగల శ్రీహరిని విధియుక్తముగా

భక్తితో పూజించెను. అచ్చటనే శిష్యులకు గౌతముడు ఈమాసము యొక్క గొప్పదనమును చెప్పెను. ఇట్లు దినములు గడచుచుండగా గౌతముడు శిష్యులతో కూడుకొని యీ శుద్ధదశమినాడు అయశ్వత్థ వృక్షమూలమునందు శుభ్రప్రదముగా మంటపమేర్పరచి ఫలపుష్పము లతో నలంకరించి ఆ మంటపమునకు మధ్యగా శ్రీహరిని నిలిపి పూజించెను. ఆ ప్రదేశమునకు ఒక ఆడకుక్కవచ్చి ఆ శ్రీహరి యొక్క పూజావిధానములు చూచుచు నా యశ్వత్థవృక్షమునకు యెదురుగా సమీపములోనే కూర్చుండెను. గౌతముని శిష్యులు, గురువునాజ్ఞనుపొంది వారిదండముతో నా కుక్కను భయపెట్టిరి. ఆకుక్క నెమ్మదిగా యుత్తరదిశకుపోయి పిమ్మట మరల తూర్పునకు వచ్చి దక్షిణదిశనుండి పడమరవైపున యధాస్థానము నాక్రమించెను. తిరిగి శిష్యులు దానిని భయపెట్టిరి. పూర్వమువలెనే ఆకుక్క ప్రదక్షిణముచేసి నిలచెను. ఇట్లే వారు భయపెట్టుటవలన మాఘశుద్ధ దశమినాఁ భానువారమున శ్రీమహావిష్ణువుకు మూడుమారులు ప్రదక్షిణము చేసి మహాత్ములు పూజించుటచూచి వారిదర్శనము చేసెను. వెం టనే ఆకుక్క తనదేహమును విడిచి దివ్యదేహమును ధరించి ఆ వీర మందే రాజుగా అయ్యెను. ఆరాజు సమస్తభూషణములచేతను నిండిన వాడై లేచి సమస్కరించి గౌతమముని దగ్గరకువచ్చి నమస్కరించి నిలచెను. గౌతముడు తనశిష్యులతోకూడ నారాజును జూచి కుక్క గానున్న నీతడు రాజగుటను పరమాశ్చర్యమునుపొంది నీ వెవ్వడవని యడిగెను. పార్వతీ! ఆ కథావిధానమును చెప్పెదను వినుము.

గౌతముడు ఆ రాజు నుద్దేశించి నీవు యెవ్వడవు! గంధర్వు డవా! మనుష్యుడవా! దేవుడవా, రాక్షసుడవా, కిన్నరుడవా; వేగమే నాతో చెప్పుము. అని యడిగెను. రాజు గౌతమునితో నిట్లుచెప్పెను. మునిపుంగవా! నేను వంగదేశమునకు రాజునునా పేరు

వేగరథుడు, చంద్రవంశమున బుట్టితిని ధైర్యవంతుడను, శస్త్రాస్త్ర విద్యాపారంగతుడను, సర్వదేశములకు అధిపతిని ధర్మమార్గమును తప్పక ప్రజలను పాలించువాడును ధర్మమును సంపాదించువాడను, ధర్మమునందాసక్తిగలవాడను, గోదానము, భూదానము, వస్త్రదానము మొదలగు పెక్కుదానములను చేసితిని. విశేషించి అన్నదానమును కూడా చేసితిని. తిలదానము నిచ్చితిని, హిరణ్యదానములను చేసితిని. అనేక యజ్ఞముల నాచరించితిని. ఇష్టాపూర్తకర్మలను చేసితిని; తటాకములను, గుళ్ళను నిర్మించితిని. నూతులను, ఉద్యానవనము లను నిర్మించితిని; వేయేల. మునులు చెప్పిన సమస్త ధర్మములను నిర్వహించితిని విప్రోత్తమా ! ఇట్టినాకు సద్గతి గలుగలేదు. కారణము చెప్పెదను వినుము. ఒకానొకప్పుడు సకలధర్మములు తెలిసినవాడును, మానిజన వందితుడును నగు పైంగలుండనుముని యజ్ఞమును చేయుచు యజ్ఞదక్షిణకొరకు నన్నడుగుటకై నాయింటికి వచ్చెను. నేనువానినిచూచి లేచి వందనమాచరించి అర్ఘ్యపాద్యాది విధులచేత పూజించి కుశల ప్రశ్న చేసితిని. పైంగలుడు తృప్తుడయి నన్నుజూచి యిట్లు చెప్పెను. రాజా! నీకొక రహస్యమును చెప్పుచుంటిని వినుము. ఈ నెలయందు మకరరాశి యందు సూర్యుడుండగా సూర్యుడుదయించుచుండగా శ్రద్ధాభక్తులతో స్నానముచేసి మాఘమాస మహాత్మ్యమును వినుము. అందువలన నీకు విష్ణుసాయుజ్యము లభించును. మరియు అశ్వమేధ యాగఫలమును, తీర్థస్నాన దాన, అన్నదాన ఫలితములను పొందగలవు. మాఘశుద్ధ సప్తమీ ఆదివారమందుగాని, దశమీ ఆదివారమందు గాని, ప్రాతఃస్నానమాచరించినవాడు విష్ణులోకమును పొందును. మాఘపూర్ణిమయందు ప్రాతఃస్నానమాచరించిన వాడు పాపములచేత విడువబడును. ఎవడు

అజ్ఞానముచేత ప్రాతఃకాలమున యీ మాసమున స్నానమును ముప్పదిదినములలో నొక్కనాడైనను చేయడో వాడు జన్మజన్మాంతరములందు ఛండాలుడై పుట్టును. ఈ నెలయందు ప్రాతఃకాలమున అజ్ఞానముచేతగాని, చలిబాధచేతగాని, స్నానమాచరించనివాడు బ్రాహ్మణుడైనను చండాలుడగుచున్నాడు. స్నానము చేసినయెడల మత్తము విప్రుడగుచున్నాడు. ఇతరకర్మలను తగ్గించినను, మాఘ-మాసమున ప్రాతఃస్నానమును చేయవలెను. వారికి యమభటుల భయముండనేరదు. ఇట్లు చెప్పిన పైంగలముని మాటలకు దుర్గతిని చేకూర్చు జవాబు నిచ్చితిని.

విప్రోత్తమా! నేను మాఘస్నానమును చేయను. నాకుశక్తి లేదు. నేనుచలిబాధకు, తాళజాలను, విప్రులకు దావమిచ్చెదనుగాని స్నానము చేయను అట్లు స్నానము చేయుమని యెన్నడును చెప్పకుము. చలిబాధకు నా ప్రాణములు పోవును. శరీరము నశించును. దేహము పోయినతరువాత ధర్మసంపాదనమెట్లుజరుగును. గాన నేను స్నానమును చేయను అని పలికిన, పైంగలుడా మాటలు విని నావలన యజ్ఞదక్షిణను తీసికొనక నా ప్రార్థనను అంగీకరింపక వెంటనే యిలనుండి కదలిపోయెను. నా పైంగలు ననేకరీతుల బ్రతిమాలి యజ్ఞమునకు వలయు దక్షిణనిచ్చి పంపితిని. పైంగలుడా దక్షిణను గ్రహించి తనయాశ్రమమునకు వెళ్ళెను. పిమ్మట కాలానుగతిచే నేను మృతినిబొంది క్రూరమైన నరకబాధ పాలైతిని. ఆ యనుభవమునకు పిమ్మట భూలోకమున నూరుజన్మలు గాడిదనై పుట్టితిని. ఇరువది నాలుగు మారులు కుక్కనైతిని. విప్రోత్తమా! దైవయోగమువలన యీకుక్కజన్మనుండి యిప్పుడు విముక్తిని బొందితిని. ఈ ముక్తి యెట్లు కలిగినదో యానతిండు. మీరుచెప్పిన ప్రకారము ఆచరించి పవిత్రుడనగుదును అని చెప్పెను.

గౌతముడారాజు మాటలను విని ఆశ్చర్యముపొంది క్షణకాల మాలోచించి వానితోనిట్లుచెప్పెను. రాజా! పైంగలుడు పలికిన రీతిని మాఘస్నాన ప్రభావమునిక్కలియెక్కువైనది. అందసత్యము లేదు. నీకు కలిగినవిపత్తు మాఘస్నాన తిరస్కారమువలన గలిగినది గ్రహింపుము. దుర్యోనియగు కుక్కజన్మనుండి ముక్తుడగుటకుకారణమును చెప్పెదను వినుము. కృష్ణవేణీనదీతీరమున నేనును, నాశిష్యులును మాఘశుద్ధదశమి దినమున భక్తితో లక్ష్మీనారాయణ పూజను కావించితిమి. దైవవశమున నీవచటికి వచ్చితివి నీవుచూచుచుండగా వ్రతము చేయుట విధియుక్తముకాదని నాశిష్యులునిన్నుదండముతో బెదిరింపగా నీవుపోయి మూడుసారులు చుట్టి ఆభగవంతునికిప్రదక్షిణమాచరించితివి.ఆపుణ్యవిశేషముచేతకుక్కజన్మపోయినది. మోక్షము కలిగినది. గానయీనదీ జలమందు మాఘస్నానము ఆచరింపుము. అందువలన యితర జన్మలలో చేసిన పాపములునశించును. పిమ్మట వైకుంఠప్రాప్తి కలుగును. చలికి భయపడక స్నానమాచరింపుము. ఆరాజును గౌతముని మాటలను విని స్నానముచేయుటకై ఆ నదీతీరమందే నివసించెను.

ఇంతలో అశ్వత్థవృక్షముయొక్క తొఱ్ఱలోనుండియొక కప్ప క్రిందపడి గౌతముని ముందఱకు వచ్చెను. శిష్యులందరును చూచుచుండగా ఆకప్ప భూమిం పడి యిటునటు తిరుగుచు విచారించు చుండెను. కూయుచుండెను. పాముకుబుసమును విడిచినట్లు ఆకప్ప తన దేహమును విడిచి దివ్యదేహమును ధరించి, సుందరాంగియగు స్త్రీ రూపముతో నిలిచెను. నారచీరలు ధరించి మునిభార్యయై, సుందరమును, వలుదలగు కుచములును గలిగి మందస్మిత వదనముతో విలసిల్లుచుండెను. గౌతముని పాదములను దర్శించుచు, కుచములపైగల చీరను పైకెగద్రోయుచు, ఆవనిత నమ్రశిరస్కయై సిగ్గుతో భూమిని

జూచుచు, వారిమధ్య నిలిచెను. గౌతము డాకప్పదేహము వదలి సుందరవనితగామారినిలిచియున్న మునిభార్యను జూచి భయము లేదని యామె కభయమిచ్చి నీవెవ్వరిదానవు? ఏపాపముచేత యిట్లు కప్పవైతివి? ఎందుల కిచ్చటికి వచ్చితివి? ఏపాపమున నీకు కప్ప స్వరూపము గలిగినది? పూర్వజన్మమున యిట్టిజన్మమును పొందుట కెట్టిపాపమును గావించితివి? ఇదియంతయు సవిస్తరముగా జెప్పుము. అని గౌతమముని యడుగగా నమస్కరించి గౌతమముని సందర్శనము వలన కలిగిన జ్ఞానసంపత్తివలన సమస్తము తెలిసికొని పూర్వజన్మమందు తానొనరించిన పాపమును చెప్పసాగెను.

ఇదిస్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున నాల్గవ అధ్యాయము.



## అయిదవ అధ్యాయము

ఆమునికాంత తన పూర్వజన్మవృత్తాంతమును గౌతమునకిట్లు చెప్పెను. ఆర్యా! నేను పూర్వజన్మమున జ్ఞానసిద్ధియను వానికుమార్తెను. ప్రజ్ఞామునియొక్క భార్యను, మాకాపురము కావేరీ తీరము, నాభర్త సమస్త ధర్మములను తెలిసినవాడును, ఆత్మజ్ఞానియు, మంచి స్వభావముగలవాడును, దయగలవాడును, సమస్తజీవులకు ఉపకారమును చేయువాడునుగా నుండెను. అతడు కావేరీ నదికి ఉత్తరపు టొడ్డున ఒక ఆశ్రమమును నిర్మించుకొని దానిలో నివసించుచు మాఘమాసమున శుచిగా స్నానమాచరించు చుండెను. ఒకదినమున నా భర్త, నన్నుగూడ, మాఘస్నానము వలన పుణ్యము కలదనియు పాపములు నశించు ననియు, నందువలన స్నానమునకు తనతోకూడ

రమ్మనియు, ఆతీరమున విష్ణుప్రీతికై పూజను చేయుటకు గోమయము చేత అలికి పంచరంగుల ముగ్గులను బెట్టుమనియు, హరి సేవ చేయుమనియు, హరిపూజార్థము, దీపారాధనకు వత్తిని చేయుమనియు, శ్రీహరికి ధూపము, దీపము, నైవేద్యము సమర్పింపుమనియు, ప్రతీదినమును ప్రదక్షిణ నమస్కారములను తనతో గూడ జేయుమనియు, ప్రాతఃస్నానము చేసి యీమాహాత్మ్యమును కొంత కాలమైనను వినుమనియు. హరిపాదోదకమును సేవింపుమనియు, శ్రీహరిని పెక్కునామముల చేత, కృష్ణా, విష్ణూ, మధుసూదనా, నారాయణా, జనార్దనా. అచ్యుతా, అనంతా విశ్వాత్మా అని కీర్తించుమనియు, కోపము, మత్సరము యీ మొదలగు దుర్గుణములు చేరనీక సక్రమపద్ధతిని ఈ వ్రతము గావించిన నీవు శాశ్వతమగు ముక్తిని పొందగలవు. అని చెప్పిన నాభర్తమాటలనువిని నేను తిరిగి వినరాని మాటల చేతను, నరక దాయకమగు దుర్భాషల చేతను నాభర్తను నిందించితిని.

విప్రుడా! మాఘమాసనగానేమి? ఎక్కడి దేవుడు? విధియెవరు? ఫలితమేమి? ఎవడు మాఘమాస? ధర్మవ్యతిరిక్తమేమి? మాఘఫలిత మెక్కడ? గతియేమి? ఈనెలయందె సూర్యుడు మకరరాశి యందు వుండగా సూర్యోదయ కాలమునను చలిలోపోయి చలిగాలిలో చల్లని నీటిలో నేనెట్లు స్నానము చేయగలదానను? మీరు చెప్పిన కర్మ విశేషములను నేను చేయలేను. సూర్యుడు మిట్టమధ్యాహ్నమున నెత్తిమీదకు వచ్చువరకు పర్ణశాలనుండి బయటకు రాలేను. అట్టితరి చలిగాలిలో శీతలోదకములందు సూర్యోదయ సమయమున ఎవతె స్నానము చేయును? ఇట్టి చలిలో స్నానము జేసిన నా ప్రాణములుండ నేరవు. కాబట్టి నేను స్నానము చేయను. నీమాట కంగీకరించి చలి చేత చచ్చుటకు నేను సిద్ధపడను. అని యీ ప్రకారముగా నా మొగుడు భర్తతో బలుకగా మాఘమాసధర్మములను బాగుగా నెరిగి నాభర్త

నిత్యమును శాంతస్వభావుడైనను నేనుపలికిన దుర్భాషలకు కోపించి నన్ను శపించెను.

ధర్మము నతిక్రమించిన కుమారుని, దుర్భాషలాడు భార్యను బ్రాహ్మణద్వేషుడైన రాజు తత్క్షణమే శాపముచేత దండింపవలెను. అందువలన నాభర్త నన్ను యీరీతిగా కృష్ణవేణి నదీతీరమున, జల శూన్యమైన అశ్వత్థవృక్షముయొక్క తొఱ్ఱలో కప్పగా పడియుండు మని శపించెను ఇట్లు శాపమునందిన పిమ్మట నాకుగల యజ్ఞానము తొలగి కండ్లు తెఱచి భయముతో భర్తపాదములంబడి అనేకరీతుల ప్రార్థించితిని. అట్లుప్రార్థించగా నాభర్త నాకిచ్చిన శాపమున కొక గడు వేర్పరచెను, అది ఎట్టిదనిన మాఘశుద్ధ దశమినాడు నీవుగౌతమ మునిని ఎప్పుడు దర్శించెదవో ఆక్షణమందునీకుశాపవిముక్తియగును. మరియు నా మునివలన నీవు యెప్పుడు మాఘమాస మహాత్మ్యమును వినెదవో ఆక్షణమందే కప్పరూపముపోయి నీపూర్వరూపమును నీవు పొందగలవు. అని పలికి నాభర్తయూరకుండెను. వెంటనే నాసుందర మైన స్త్రీరూప మంతరించి కప్పరూపము లభించెను. పిమ్మట నేను విచారముతో నెదురుకొనుచు దాటుకొనుచు, కృష్ణవేణీనదీతీరమున గల యీ యశ్వత్థవృక్షమున నివసించితిని. నా శాపమునకు గడువు కాలము చెప్పెదను వినుము ఇప్పటికి పదివే లేండ్లు గడచినవి. కోటి అరుణోదయములును గడచినవి. పిమ్మట మీదర్శనభాగ్యము కలిగి నది. మీవలన పురాణమువింటిని. మీకరుణాకటాక్షముచేత కప్ప రూపమును వదలి స్త్రీనైతిని అని పలికిన ఆ వనితను జూచి గౌతమ ముని నవ్వుచు యామెతో నిట్లనెను. భర్తమాటవినక, మాఘమాస ఫలమును వినకయున్నందున నీభర్త శపింపగా యాశాపమువలన కప్పజన్మ కలిగినది. ఇంతకంటె వేరొక నరక హేతువు కలుగనేరదు. నరకముకంటె కూడ మిక్కిలి దుఃఖభాజనమైన యీ కప్పరూపము మాఘఫల నిరాదరణవలన గల్గిన శాపఫలితముగాని వేరుగాదు.

నీభర్త చాలాబుద్ధి వికాసముగలవాడు. నీవు మాఘమాసమున చలికి వెరచి స్నానముమానితివిగాన జలసూన్యమైన శుష్కకోటర మందు కప్పగా జేసెను. నీకు జలనివాసమిచ్చినయెడల నన్నే నీవు పొందగలుగుదువు దానివలన నీకుముక్తిగలుగునని యాలోచనవలన నిట్లు గావించెను. ఏలయనగా మాఘమాసమున నీటియందుండువారికి నీచజన్మలనుండి విముక్తిగలుగును. పూర్వకాలమున నీటియందు సంచరించు జలచరములను మాఘమాసమున నీచజన్మలనుండిముక్తిని పొంది దివ్య దేహములను ధరించి స్వర్గమును జేరినవి. గాన నీకు జలవాసమును కలుగ జేయక స్వమలాహారమగు మండూక జన్మను ప్రసాదించెను.

స్త్రీలకుస్వాతంత్రములేదు. భర్తమాట జవదాటరాదు. పాతివ్రత్యపుణ్యముచేతను, పతిసేవచేతను స్త్రీలు విష్ణులోకమునుపొందగల్గుదురు. ఇతర వ్రతములవలన పొందజాలరు. స్త్రీలకు భర్తయే ఆత్మ, శ్రీమహావిష్ణువు, బ్రహ్మ, శంకరుడు; గురువు, తీర్థము ,అని పెద్దలు చెప్పుదురు. పతిసేవను విడిచి పలుధర్మములను నిర్వహించినను ఆస్త్రీయెన్నడును ముక్తినిపొందజాలదు. ఏస్త్రీ భర్తను విడనాడి స్వేచ్ఛానువర్తినియై సంచరించునో యామె యమలోకమున సూర్యచంద్రాదులున్నంతవరకు నిలిచియుండును. పతిలేనిస్త్రీ, గురువులచేతను, ధర్మవేత్తలచేతను ప్రేరేపింపబడినదైనను లేకున్నను పతిపరాయణమైధర్మమును ఆచరింపవలెను. ఏస్త్రీయైనను పతిపాదముల జలమును శిరస్సుపై జల్లుకొనునో, ఆస్త్రీ హరిలోకమును చేరగలదు. గంగాస్నానఫలమును పొందగల్గును. పతిపాదోదకమును ఏస్త్రీత్రాగునో ఆస్త్రీ వెయ్యి చాంద్రాయణ వ్రతముల ఫలమును పొందును, గనుక నీవు చేసిన కర్మదోషమున ఫలము నీవే అనుభవింపవలెను. నీకు మాఘశుద్ధదశమినాడు పుణ్యవశమున కప్పజన్మ

నుండి ముక్తిగలిగి యందమగు స్త్రీరూపమును పొందితిని. ఈ మాఘ మాసమున పాపమునుపోగొట్టు కృష్ణవేణీనదియందు స్నానమును చేయుము, నీకు విష్ణులోక ప్రాప్తికలుగును. స్త్రీలుగాని పురుషులు గాని, యీమాఘమాసమున ప్రాతఃకాలమునస్నానముచేయుదు రేని వారు శ్రీమహావిష్ణువుసన్నిధానమును జేరుదురు. ఎవ్వరైనను తెలియక గాని, తెలిసిగాని, మాఘశుద్ధదశమి దినమునను, సప్తమియందును. పౌర్ణమియందును, పాడ్యమియందును స్నానము చేసినయెడల వారి పాపములన్నియు పటాపంచలగును. మాఘశుద్ధపాడ్యమి దినమున స్నానముచేసినవారిపాపములు గాలిచేత మేఘములు విడిపోయినట్లు నశించును. ఎవడు మాఘశుద్ధఏకాదశినాడు, ద్వాదశినాడు స్నానము చేసి శ్రీహరినిపూజించి, తత్సన్నిధానమునవిష్ణుకథలను, మాఘమాస మహాత్మ్యమును సంతోషముగా భక్తితో వినునో వానిపాపములు నిప్పుతగిలిన గడ్డిపువ్వవలె భస్మమగును.

ఎవడు మాఘశుద్ధ చతుర్దశియందుగాని పౌర్ణమియందుగాని భక్తితో స్నానముచేసి మాఘమాసాధిదేవతయగు శ్రీహరినిధ్యానించి పత్తునానిమిది అప్పములు గాని పూరీలుగాని వేణు పాత్రయందుంచి విప్రునకుదానమిచ్చునో ఆపుణ్యాత్ముడు యిహలోకమందు సమస్త సుఖములను అనుభవించి అంతమందు స్వర్గసుఖముల ననుభవించి శ్రీహరిప్రసాదమువలన తిరిగి భూలోకమున చక్రవర్తిగా జనింపగలడు. ఎట్లయినను స్నానముచేసి శ్రీహరిపూజచేసి మాఘమాసమున శక్తికొలది తప్పకుండా దానమును జేయవలెను. ఈపుణ్యమైన మాఘమాసమహాత్మ్యమును నీకు నేను చెప్పితినిఅని గౌతముని యువతి తెలిపెను.

పార్వతీ! వినుము. ఆరాజు కృష్ణవేణీ నదీతోయములందు భక్తితో స్నానముచేసి శ్రీమహావిష్ణువును పూజించి మాఘపురాణ

మును విని భూలోకమున పుత్రపౌత్రసమేతుడై రథ గజాశ్వసంపద లతో తులతూగి రాజ్యసుఖముల ననుభవించి పిమ్మట మాఘస్నాన మును చేసి గౌతముని దయవలను, హరి కృపవల్లనను అంత మందు పునర్జన్మ లేని వైకుంఠమును జేరి ముక్తిని పొందెను. ఆ ముని కాంత కృష్ణవేణీ నదీతీరమున మాఘమాసమంతయు అచ్యుతుననే శ్రీహరి పద ధ్యానపరాయణరాయై సూర్యోదర్ధోదితు డగుచుండగా ప్రతి దినము స్నానము చేయుచు భర్తృ పదసేవా మానసరాయై మాధవకథాసుధా రసమును గ్రోలుచు, కాలము గడపి అంత్యమందు హరి ప్రసాదము చేతను, మాఘమహిమ చేతను ఇంద్రాది దేవతలకు గూడ నలవిగాని వైకుంఠము చేరెను.

మాఘమాసమున చేసిన తపస్సు బుద్ధికి మిక్కిలి ఫలితము నిచ్చును అని విద్వాంసులు చెప్పుదురు. సూర్యోదయ కాలమున మాఘమాసమందు చేయు స్నానము సమస్త కోరికల నిచ్చును. సకల పాపములను హరించును. సర్వభయములను పోగొట్టును. పర్వత సమూహములవంటి పాపములయినను మాఘస్నానమువలన వజ్రా యుధము చేత నరకబడినట్లు మాయమయి మాఘస్నానము చేయని మానవులందు రహస్యముగా నున్నవి, బలముగల వాయువు వలన మబ్బులు నశించునట్లును, సూర్యునివలన చీకట్లులు బోవునట్లును, మాఘస్నానమువలన పాపములన్నియు నిర్మూలములగును. మిగిలి యున్నవి మాఘస్నాన మెరుగని మానవునందణగి యుండును. ఎన్ని వ్రతములు చేసినను మాఘమాస స్నానముతో సమానము కానేరవు. కాన మానవుడు ప్రయత్నపూర్వకముగా మాఘస్నాన మాచరించ వలెను. పార్వతీ ! నీకు యీ రీతిగా దుఃఖన శకరమును సుఖప్రదమగు నగు మాఘమాస మహాత్మ్యమును చెప్పితిని దీనిని వినువారు పఠించు

వారును సమస్తమైన యజ్ఞములను చేసినందువలన కలుగు ఫలమును పొందంగల్గురుదు సందియము లేదు.

పార్వతీ! చెప్పెదను వినుము. మాఘమాసమునం దెవరైనను దైవవశముచేత నొకమారు స్నానమాడినను శూద్రుడు, వానిభార్య సద్గతినిపొందినట్లు విష్ణులోకప్రాప్తినిజెందెద'రన పార్వతీదేవి 'నాథా శూద్రుడు, వానిభార్య మాఘస్నానమెట్లు చేసిరి? వారేమి పాపము చేసిరి? చెప్పు 'మనియడిగెను. శంకరుడు 'పార్వతీ! వినుము పాప నాశన కరమగు నీకథను జెప్పెదను విని యానందింపుము.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున అయిదవ అధ్యాయము.

---

## ఆఱవ అధ్యాయము

పూర్వకాలమున ఆంధ్రదేశమున సుమంద్రుడను శూద్రుడొక డుండెను. అతడు అమితమగు ధనము ధాన్యము గలిగి యుండెను. నిత్యము వ్యవసాయము జేయుచు, క్రూరమైన వడ్డీవ్యాపారము చేయుచు, అపకారపు బుద్ధిగలిగి, గోవులను, గేదెలను, గుర్రములను, మేకలను, గొఱ్ఱెలను, ఒంటెలను, కొనుచు, అమ్ముచు, మితిలేనిధన మును సంపాదించెను. అట్టివానికి సర్వభూతములయందు దయగల కుముదయను భార్యగలదు. సుమంచుడు దురాత్మ్గుడు, నాస్తికుడు. దేవతావిముఖుడు, అసత్యవాది, పాపాత్ముడు, నిర్దయుడు నైయుం డెను. అత డతి కష్టపడి సంపాదించిన ధనమంతయు తాను తినక యొవరికిని పెట్టజాలక భూమియందు పాతిపెట్టెను. కొంతకాలమునకు విధివశమున శుచివ్రతుడను ఒక మునిపుంగవుడు మాఘమాసమున

రాత్రికాలమున ఆ సుమందుని యింటికివచ్చెను. ఆముని మార్గాయాసముచేతను, వర్ష బాధ చేతను, బాధనుపొంది చలికిఁ జణకిపోవుచు మాటాడ జాలక ఆ సుమందుని భార్యను నివాసముకై యిట్లు ప్రార్థించెను.

కల్యాణీ! నేను బ్రాహ్మణుడను. మార్గమున వర్షము వలన మిక్కిలి బాధపడితిని. ఆకాశము మేఘములతో నిండి వర్షమును సూచించుచున్నది. చీకటి అలముకొని యున్నది. మీ గృహము బాగుగా నున్నదిగాన యీ చలికి వర్షమునకు మీగృహమందుండి బాధ లేకుండ నిద్రించి ఉదయమున వెడలిపోదును. గాన మీయింట నాకు నివాసమును యిమ్మని అని పలికెను. ఆ విప్రుని మాటలకు సుమందుని భార్య కుముద దయగలదై బ్రాహ్మణోత్తమా! మా యింటిలోనికి వచ్చి నీబాధ నివృత్తిగావించుకొని సుఖంపుము అని చెప్పి గోవులను కట్టు స్థానమును శుభ్రపరచి, అలికి ముగ్గులిడి యొక కంబళమునుపరచి ఆ బ్రాహ్మణుని కూర్చుండ నియమించెను. ఆశుచివ్రతుడను మునిపుంగవుడు లోనికి పోయి యా కంబళమున కూర్చుండెను. శీతవాత బాధానివారణకై కుముద మరియొక కంబళమును కప్పుకొనుటకిచ్చి యగ్నిని ప్రజ్వలింపజేసి ముని ముందర నుంచెను. ఆవుపాలు పితికి, కాచి, ఆకలితీర్చుకొనుటకా విప్రున కిచ్చెను. ఇట్లు మాఘమాసమున కుముద విప్రునకు సేవచేసినది. ఆ సమయమున భర్త గ్రామమునందు లేడు.

భర్త తిరిగి యింటికి వచ్చిన, యిట్టిసజ్జనసేవను చేయనివ్వడని విప్రుని సేవించి కుముద మిక్కిలి సంతోషమును పొందియుండెను. విప్రుడును, సంతోషించి ఆరాత్రినిద్రించి మార్గాయాసమునుపోగొట్టు కొని అపరరాత్రి యందు శ్రీహరినామ సంకీర్తన గావింపసాగెను. కుముదనిద్రనుండి లేచి, ఆవిప్రుని చూచి సంతోషించి “విప్రోత్తమా

తామెచ్చటనుండి వచ్చుచుండిరి? ఎచ్చటకి వెళ్ళుచున్నారు; దయ యుంచి చెప్పవేడెదను. అని యడిగెను. విప్రుడు యిట్లు చెప్పెను. కాంతా! నే నిప్పుడు తుంగభద్రా నదీతీరమునుండి వచ్చు చున్నాను. శ్రీరంగమును చూచుకోరికతో వెళ్ళుచున్నాను. మాఘ మాసమున తీర్థసేవలను చేయుకోరికతో వచ్చుచుంటిని. ఇందువలన విష్ణులోక ప్రాప్తికలుగును. అని పలికిన ముని మాటలు విని కుముద తిరిగి విప్రునితో ఆర్యా! మాఘఫలమేమి? తీర్థసేవ యనగా నేమి? ఏమిఫలముగలదు? దేనిచేత పాపములు నశించును. శ్రీహరి దేని వలన సంతుష్టుడగును. సెలవిండు" అని ప్రార్థించెను.

శుచివ్రతుడు కుముదతో నీరీతిగా చెప్పెను. కళ్యాణీ! మాఘ ఫలమును వినినవానిపాపములునశించి మోక్షమునుపొందును. నూరు జన్మలలో సంపాదించిన పాపము సహితము నశించును. మాఘమాస మున సూర్యుడు మకరరాశియందుండగా ప్రాతఃకాలమున నెవడు కోట్టియజ్ఞముల ఫలమిచ్చు మాఘస్నానముచేయునో, వానిపాపము లన్నియు నశించిపోవును. ఎవడు సూర్యోదయకాలమున స్నానము చేసి రంగురంగుల పుష్పములచేతను, పరిమళ యుక్తమగు పువ్వుల చేతను, లేత తులసీదళము చేతను, మాఘమాసాధి దేవత యగు శ్రీహరినిపూజించి మాఘమాసధర్మప్రతిపాదకమైన శ్రీహరిసత్కథ లను వినుచు యథాశక్తిగా దానముల నిచ్చెదరో వారికి గలుగుఫల మనంతము. పురుషులుగాని స్త్రీలుగాని విజ్ఞానముచేతగాని, అజ్ఞానము చేతగాని, చేసినబ్రహ్మహత్యాదిమహాపాతకము లన్నియు క్షణములో నివారణమగును. మాఘమాసమున స్నానముగాని, జపముగాని, దానముగానిచేయక కాలముగడపుమానవుడుఅంధతామిస్రమను నర కమునబడిశాశ్వతముగాపొర్లాడు చుండును. ఏ ఒక్కనాడైననుమాఘ మాసమున స్నానము చేయని నరుడు అనంతమగు జన్మలెత్తుచు.

మహాపాపుడై రౌరవాది నరకమందు దుఃఖ మనుభవించుచుండును. దీనితో సమానఫలము నిచ్చు మాసములేదు. యజ్ఞయాగ ధానాదుల వలన గలుగు ఫలము యీ మాఘస్నానము వలన కలుగును. శుభప్రదమైన ప్రయాగయందు యీ మాసమున స్నానము చేయువారికి, పునరావృత్తి రహిత శాశ్వత విష్ణులోక ప్రాప్తికలుగును. అట్లే యీ మాసమందు కావేరీ, కృష్ణవేణి, రేవా, తుంగభద్రా, సరస్వతీ గోకర్ణ, ప్రభాస, శోణ, భద్ర, గౌతమీ, దక్షిణకూపాది వేగవతి, సురదీర్ఘిక, ప్రత్యక్సింధూ, కావేరీ, తామ్రపర్ణీ. యీ నదులందు స్నానముచేయువారు విష్ణులోకమును పొందుదురు. మాఘమందు నుయ్యి, కాలువ, చెరువు, నదులు, మొదలగువానియందు స్నానమాచరించువారికి మోక్షము కలుగును. మరియు తిరిగి వారు జన్మముపొందరు. మాఘమాసమున పుణ్యక్షేత్రములందుండు జలములలోగాని గోవుపాదమంతటి నీటిలోగాని ప్రాతఃస్నానముచేసిన పాపములుండనేరవు, యమభటులు దరిజేరరు. ఇహమందనంత సుఖములనంది పరమందు శ్రీహరి సాన్నిధ్యమును జేరుదురు.

బలవంతముచేత గాని, భక్తిచేతగాని, అజ్ఞానముచేతగాని, మాఘస్నానమాచరించినయెడల వారికి మోక్షము కరతలామలకము. ఆ పుణ్యమును చెప్పుటకు రుద్రేంద్రాది దేవతలు కూడ సమర్థులుగారు. ఈరీతిగా పలికిన శుచివ్రతుని మాటలను విని కుముద సంతోషముతో నాతని స్తోత్రముచేసెను. మహానుభావా! మీదర్శన భాగ్యముచేత నేను ధన్యనైతిని. మా కులము పావనమైనది. మా పితృ దేవతలు తరించిరి. మాగృహము పవిత్రమయ్యెను. అని మునీశ్వరునితో పలుకుచుండగా నారాత్రిగడచిపోయినది. బ్రాహ్మీ ముహూర్తమున సూర్యోదయకాలమందు స్నానార్థమా మునీశ్వ

రుడు బయలు దేరుచున్నంత, వారి వెంట నా కుముదయునుగూడ వెన్నంటి యిట్లనెను. విప్రోత్తమా! నామాటనువినుము నన్ను కరుణింపుము. నేను నీతో వచ్చి స్నానము జేయుదును. మునివల్లభుడామె సద్బుద్ధికి చాల సంతసమందెను. అంతట కుముదస్నానమునకు బోవు తొందరలోనుండగా నామెభర్త సుమందుడు వచ్చెను. అంత కుముద నాతనితో మునికాంతునిరాకయు తనసేవయు మాఘమాసమహిమను తానామునివలన వినుటయు, చెప్పి సూర్యోదయకాలమున నామునితో నదికి స్నానార్థ మరిగెదనని ప్రార్థించెను.

అట్లు పలికిన తనభార్య మాటలను విని సుమందుండు మిగుల కోపముతో అమాయకురాలా! ప్రాతఃకాలమున శీతల జలములందు ఏల మునిగెదవు? మాఘమనగా నేమి? దాని ఫలితమేమి? ఇదియంతయు నమ్మదగినది కాదు. ఏవిప్రుడు నీకీస్నానమునుగురించి బోధించినాడు? కదలకయుండుము అట్లు కాదేని నిన్ను యిపుడు యీ గదా దండముచేత దండింతును అని పలికిన భర్తమాటలను విని కుముద మనోవ్యాకులతజెంది మాఘస్నానమునం దాసక్తిగలదియై యామునివల్లభుని వెన్నంటి వేగముగా తటాకమునకుబోయి తొందరగా మాఘస్నానమాచరించెను. ఆసూర్యోదయకాలమందు మాఘమాసమున నా సుమందుడు భార్యయగు కుముదను దండించు సంకల్పముతో కఱ్ఱను చేబూని, భార్యను కొట్టుచు బలాత్కారముగా నామెను పట్టుకొనియుండగా, నట్లిరువురు జలమధ్యమున పెనుగులాడుటలో నాతడుగూడ స్నానమాడినవాడాయెను. ఇట్లు ఒకరి నొకరు నీటముంచుటయు ఇష్టము లేకపోయినను స్నానము చేసినవారై యింటికి వెళ్ళిరి. విప్రుడును స్నానసంధ్యావందనాదికములను గావించుకొని శిష్యసేవకుడై తూర్పుదిక్కునకు జనెను.

కొంతకాలమున కాశూద్ర దంపతులు కాలానుగతముగా రోగ పీడితులై మరణించిరి. అంతట క్రూరాకారులును, వికృత వేషులు నగు యమభటులు నాసుమందుని యమపాశముచేత బంధించిరి. వైకుంఠమునుండి విష్ణుదూతలు వచ్చి బంగారు ప్రాకారమును, మణి మయరత్నమాణిక్యాద్యలంకృతమును, స్వర్ణపతాకములతో నిండిన దివ్యవిమానమును దెచ్చి యందామెను కూర్చుండబెట్టిరి. ఇట్లు యమ భటులు సుమందుని, విష్ణుదూతలు కుముదను తమ లోకములకు తీసు కొని పోవుచుండగా కుముద విష్ణుదూతలలో నిట్లనెను. ఓ విష్ణుదూత లార! నామాట వినుడు. నా భర్త దురాత్ముడు. పాపము చేసిన వాడు. సమస్తధర్మములను నిందించినవాడును అగును. అందువలన నతడు దుఃఖపూరిత మయిన యమలోకమునకు తీసికొని పోబడు చున్నాడు. అతని భార్యనగుట వలన తత్సంసర్గదోషము నాకును కలదు. నాభర్త వలన భయముచేత నేను గూడ పుణ్యమును చేసి యుండలేదు. అట్టిదానికి నాకు పుణ్యలోకమెట్లు కలిగినదని యడు గగా విష్ణుదూత లిట్లు చెప్పసాగిరి.

అమ్మా! నీవు విప్రుని సదోపదేశవలన మాఘ స్నానమాచరిం చితివి. అదిసకలపాపములను పోగొట్టునదిగాన ఆ పుణ్యవిశేషము వలన నీకు ముక్తికలిగినది. అని వారు చెప్పగా కుముద మరల వారి నిట్లు ప్రశ్నించెను. విష్ణుదూతలారా! నాభర్తకూడా నన్ను తీసు కొనిపోవుటకై నీటం ప్రవేశించి నన్నాకర్షించుటలో బలవంతముగ స్నానము చేసిన వాడయ్యెనుగదా! ఆమాఘస్నాన ఫలిత మాతనికి లేదాయేమి? అని యడిగెను. విష్ణుదూతలును యమదూతలు గూడ పాపములను పుణ్యములను వివరముగా వ్రాయు చిత్రగుప్తు నడిగిరి. అతడు స్నానార్థమై భార్యకొరకు బలత్కారముగా సంభవించిన పుణ్యమాతని లెక్కయందుండుటజూచి సుమందునికి గూడ స్నాన

ఫలితము గలదని నిశ్చయించిరి. ఇతనికి పాపము లేదు. పుణ్యము గలదు. గాన యమదూతలారా! మీరితని వదలితొలగిపొండు అని పలికిరి.

చిత్రగుప్తుని యాజ్ఞానుసారము యమభటులా సుమందుని వదలి వెడలి పోయిరి. విష్ణుదూత లాతనిని తమ దివ్య విమానమున నెక్కించుకొని వైకుంఠమునకు గొంపోయిరి. అచ్చటసుమందుడును కుముదయు సుఖముగా నుండిరి, కాన ఓపార్వతీ! వింటివా! సత్సాంగత్యముచేత సుమందుడును కుముదయు మాఘ స్నానమాచరించి తత్ఫలితమువలన వారు పుణ్యలోకప్రాప్తిని పొందిరి. మరియు పునరావృత్తిరహితమైన శాశ్వతపదవినిపొందిరిసత్సాంగత్యమువలన మోక్ష ప్రాప్తియు, దుస్సాంగత్యమువలన నరకమునుపొందుదురు. ఎల్లప్పుడును. సాంగత్యమే వర్జింపవలెను. అథవా సత్సాంగత్యము చేయవలెను. దుస్సాంగత్యమును వదలవలెను. ఈ విధముగా సత్సాంగత్యమువలన మాఘ ఫలము మానవులకులభించినది. ఇట్లేసదాసిద్ధించుగాక ఇతరమైన ప్రసక్తివలన ప్రయోజనములేదు. కాన నెన్ని పనులున్నను శ్రద్ధతో మాఘస్నాన మాచరించ వలెను. స్నానము, దానము చేయక మాఘమాసమును గడుపువాడు అనేకనరకముల ననుభవించిరాక్షసుడై భూలోకమునజన్మించుచున్నాడు. నదియందు మాఘమున స్నానముచేసినవాడు పాపములనుండి ముక్తుడై వెయ్యి అగ్నిష్టోమక్రతువులును, నూరువాజపేయక్రతువులును, వెయ్యి అతిరాత్రియజ్ఞములు, యితరమైన సమస్త యాగములను చేసినందువలన కలుగు ఫలితముకంటె అధికమగు ఫలమును పొందును. పార్వతీ! మాఘమాసమున సూర్యోదయకాలమునందైన యోగముచే విధ్యుక్తముగా స్నాన మాచరించి శ్రీహరిని పూజించినవారు, శారీరకమామున దోషములచేత విడువబడి అంతమందు శాంతాకార

మయిన శరీరముతో తమ పితృవర్గముతో మిత్రబంధువర్గముతో కూడినవారై, విశ్వ పరిపాలకుడును, బ్రహ్మేంద్రాదిస్తుత్యుడును, నగు విష్ణుసాయుజ్యము జేరుదురు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున ఆఱవ అధ్యాయము.

---

## ఏడవ అధ్యాయము

శంకరుడు పార్వతి నుద్దేశించి పార్వతీ! ఇంకను మాఘస్నాన ఫలములను చెప్పుచున్నాను వినుము అని చెప్పసాగెను. విన్న మాత్రముచేతనే నూరు జన్మలందు చేసిన పాపరాసులన్నియు నశించును. ఈమాఘమాసమందు విధివశమున యెవడు శ్రీహరి నుద్దేసించి స్నానమాడునో వాడు వైకుంఠమును చేరును. ఇందుకు తార్కాణముగ నొక కథ గలదు. దానిని చెప్పెదను వినుము.

తొల్లి గోదావరీ తీరమున ద్వాపర యుగమందు వేదము, వేదాంగములు, వానితత్వార్థములు తెలిసిన సుశీలుడను విప్రోత్తముడు కలడు. అతడు దేశాటనము చేయుచు దారితప్పి యొక మహారణ్యమును ప్రవేశించెను, ఆయరణ్యము అనేక మైన వృక్షముల తోడను, దట్టమైన వెలగ, మామిడి, మర్రి, దిరిసెన, దేవదారు మొదలయిన చెట్లతోడను, ముండ్లపొదలతోడను, దారువృక్షముల తోడను, చీకటిమైయుండు భయంకరమైన వెదురు పొదల తోడను, కుక్క, నక్క కూతలతోడను, పక్షుల కలకలారవములతోడను, ఎండుటాకుల నిండుచప్పుళ్ళతోడను, మదించినఏనుగు, దున్న, పంది పెద్దపులి మొదలగు క్రూరజంతువుల ఘీంకారములతోడను, దవానల

ముచే బుతులు దేరిన భటభటధ్వనులచేతను, భయంకరమైన యితర ధ్వనులచేతను నిండియుండెను. ఆ యరణ్యమున చంద్రచెట్టు ఆకారమున ఒక రాక్షసుడుండెను. ఆ రాక్షసుని పాదములు చంద్ర చెట్టుగాను మిగిలిన శరీరమంతయు క్రూరమైన రాక్షసాకారముగాను వుండెను. పాదములు చంద్ర చెట్టులో నుండెను. అది ముళ్ళుగలిగి దానికొమ్మలుగాలికికదలినప్పుడు శరీరమునకు ముళ్ళుగు గ్చుకొనుచు ఆ క్రూరుడైన, బ్రహ్మరాక్షసుడు నల్లని మబ్బువలె, కాటుక కాంతి గలవాడై, ప్రళయకాల రాత్రితో సమానమైన ఆకారముతో పెద్దనోరుతో, శుష్కమైన పొట్టతో, వంకర పండ్లతో, క్రూరబుద్ధి గలవాడై, ఎర్రని కండ్లుగలవాడై,దూరదృష్టితో దిగంబరుడై తిండిలేక, ఎర్రని గడ్డము, మీసము, వెంట్రుకలు గలవాడునై యుం డెను. పాదములు చెట్టునందుండుటచేత కదలలేక యిటునటు తిరు గుచు కొమ్మల చేత కప్పబడి యుండెను. ఆ ముండ్లు గ్రుచ్చుకొన్నం దున శరీరమంతయు నెత్తురు బయలు వెడలుచున్నది. కొమ్మలద్వారా కారురుధిరము దిగి కాలువగా ప్రవహించుచున్నది. ఆ రాక్షసునకు ఆహారము, నీరు లేక జంతువులను తినుటకు వీలు లేక నరకదుఃఖ మును పొందుచుండెను. సుశీలుడు మార్గము తప్పుటచేత తీర్థయాత్ర చేయుచు, భయముచేత. కష్టములనుబాపు కేశవుని ప్రార్థించుచు, ఆ చంద్ర చెట్టునందుగల రాక్షసుని చూచెను. ఆ రాక్షసుడు బాధ చేత కిక్కిలి యేడ్చుచుండెను. మార్గముతప్పి భయమందిన విప్రుడు రాక్షసుని చూచి మరింత భయమందెను. కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని స్మశానమందుగాని, వనమందుగాని, నీటియందుగాని ఇంటియందుగాని, కలిగిన భయమును శ్రీహరి తొలగించునను విషయము తలచుకొని, శ్రీహరిని ధ్యానించుచు భయమును విడచి రాక్షసుని జూచుచు వచ్చుటనే నిలిచియుండెను.

కొంతసేపటికి రాక్షసుడు బాధచే మూర్ఛనొందెను. లేచి యిటు నటుకదలి మరలమూర్ఛితుండగు చుండెను. ముండ్లు గ్రుచ్చుకొని రక్తము మాంసము బయటకు వచ్చుచుండెను. విచారించుచుండెను. మూర్ఛను బొందుచుండెను. రాక్షసులకుగూడ భయంకరుడైన ఆబ్రహ్మరాక్షసుని జూచి సుశీలుడు దయగలవాడై యిట్లనెను. ఓరీ! రాక్షసాధమా! ఇటునటు తిరుగకుము. విచారింపకుము. కొంతకాలమట్లుండుము. నీవు ఎవరు? పూర్వ జన్మమునందేమి పాపము చేసితివి? నీవేకర్మచేత యీదుఃఖమును పొందితివి? ఈ విషయ మంతయు నాకు చెప్పుమని యడిగెను. ఆరాక్షసుడు, సర్వభూతదయాళుడైన సుశీలుని పలుకులు విని, యేడుపుమాని, విప్రదర్శనము వలన తనయొక్క స్మృతికలిగి, బ్రాహ్మణోత్తమా నాకుయిప్పుడు మీదర్శనము వలన జన్మస్మృతి కలిగినది. నేను పూర్వము పుణ్యమునుచేయక పాపమును జేసితిని. పడమటితీరమున గోకర్ణమందు మధువ్రతమనునొక గ్రామముకలదు. ఆ గ్రామమందు అనేకులు విప్రులుండిరి. నేనుబ్రాహ్మణుడను. ఆగ్రామమునకు నేను అధికారిని. అందువలన అన్ని వ్యవహారములను, నేనే చూచుచుంటిని. గాని విముఖత చూపుచుండువాడను. సదాఅసత్యమునే పల్కుచుంటిని. బ్రాహ్మణ ధనముల నపహరించితిని. ఆ ధనమేనాకు యిష్టము. ప్రతిదినము విప్రగృహముల నుండి ధనము వచ్చెడిది. అదిరానిదే నేను భోజనముగూడ చేసెడి వాడనుకాను. నాశరీరమంతయు విప్రధనముతో నిండినది. ఇట్లసంఖ్యాకమైన ధనము నార్జించితిని. నాయిల్లు ధనధాన్యములతో నిండినది ధర్మార్థము కొంచెమైనను ఖర్చుపెట్టలేదు. నేను ఎప్పుడును విప్రులను అతిథులను పూజింపలేదు. అడిగిన విప్రులకు అన్నమును పెటలేదు. పుణ్యకాలములందు విప్రులకుఅన్నముగాని, ధనముగాని, ధాన్యము

గాని ఒకప్పుడైనను యివ్వలేదు. స్నానమును చేయలేదు. జప మెన్నడును చేయలేదు. ఆచారమసలేలేదు. మంచి కార్యములను చేయ లేదు. సంధ్యావందనము సలుపలేదు. మంత్రములను విడిచి అందరకు కనపడునట్లు తంత్రము మాత్రము జరుపుచు విప్రద్రవ్య మెట్లు వచ్చునా యను మంత్రము మాత్రము పఠించువాడను. విష్ణుపూజ యెన్నడును చేయలేదు. సదా విషయలోలుడనై స్వభోజనప్రియు డనై యుంటిని. దేవునియెదుట తృటికాలమైనను దీపమునుంచలేదు సత్సాంగత్య మెన్నడైనను చేయలేదు. సజ్జనులు సంభవించినను వారుండు తావువదలి దుర్జనులుండు స్థలమునకేగి నరకమున కను కూలమైన పలుకులతో సంతసించువాడను. నా మనస్సున హరి పాదారవిందధ్యానము యెన్నడును చేయలేదు. వినుటయందు నాకు యిష్టములేదు. నేనున్న స్థలమందు హరికథ జరిగినచో ఆ చోటును వదలిపోవుదును. నాజీవితమందే జంతువునకు ఉపకారము చేయలేదు. ఇట్టి నాదురవస్థ స్వకర్మచేత సంభవించినది. నేనంతట చనిపోయి ఘోరమైన యమలోకముజేరి తొమ్మిది యుగములు మిక్కిలి కష్టములను అనుభవించితిని. యమభటులు యముని ఆజ్ఞవలన నన్ను భూతలమునకు పడద్రోసిరి. నేను గాడిదనై, ఏనుగునై, కుక్కనై నక్కనై పిల్లినై, పందినై, తోడేలై, జన్మించితిని. ఒక్కొక్క జన్మయందు పదివేల సంవత్సరములు జీవించితిని. పిమ్మట యీ అరణ్యమందు చండ్రచెట్టునైతిని. పాదములు చండ్రచెట్టు, పై భా గము రాక్షసరూపము. పాదము లీ చెట్టునందుండుటచేత నెచ్చటకు పోలేక, వాయువశమున ముండ్లుగ్రుచ్చుకొని శరీరము మిక్కిలి బాధ నొందుచున్నది. నెత్తురు మాంసము బయటకువచ్చుచున్నది. దానిని నేను తినుచున్నాను. నేను పూర్వజన్మమువలన యీ విచారమును పొందితిని. నీదర్శనభాగ్యమున నా పూర్వజన్మకృతము తెలిసినది.

నా పాపమును బాసి నన్నెట్లు రక్షించెదవో యని ప్రార్థించెను. సుశీలుడు రాక్షసుని వృత్తాంతమును విని రాక్షసా! నీకు గొప్ప కష్టము సంభవించినది. ఈ యరణ్యమున దగ్గరగా నీరున్నదా? చెప్పుము, ఆ నీటితో నిన్ను రక్షింతును. నీ దుఃఖము తొలగింతును, అని పలికెను అప్పుడు రాక్షసుడు, విప్రోత్తమా! యీ వనమందు పన్నెండు యోజనముల మధ్య నీరు లేదు ఆపైన కలదని చెప్పెను.

అంత నా విప్రుడు నీ పాపము పోవు విధానమును చెప్పెదను వినుము. అని బలుకగా నా రాక్షసుడు పలుకుచున్నాడు. ఆర్యా! నాకు నలుగురు పుత్రులు కలరు. నా కాపురము పూర్వముకోగోకర్ణ దేశమున గలదు. అప్పుడా నలుగురు పుత్రులు దుష్ప్రవర్తనల చేత నరకదుఃఖమును బొందిరి. అట్లే వారి వంశక్రమశః సంతానమంతయు అనుభవించిరి. వారిలో నొక డిప్పటికి అచ్చట నివసించుచున్నాడు. అతనిపేరు బాహ్కలుడు. వాడును వానితండ్రులతో సమానబుద్ధిగలవాడై ఆ గ్రామమునకు అధికారిగా నుండెను. అతడును పాపములను చేయు దురాచారుడు గాన వానివలననాకు ముక్తి లేదు. మాకుదుఃఖ విమోచన మెట్లు సంభవించును? అని పలుకగా బ్రాహ్మణుడు చెప్పుచున్నాడు.

ఓరీ! రాక్షసా! నీకు భయము లేదు. బాహ్కలుని వలన ముక్తికలుగును. నేను వెంటనే మీ గ్రామమునకు బోయి బాహ్కలునితో నీవు తరించు త్రోవనుగూర్చి చెప్పెదను. అని రాక్షసునితో సుశీలుడు పలికి గోకర్ణ దేశమున గల బాహ్కలుని చూచెను. విప్రుడా బాహ్కలునితో తాను జూచిన సంగతి సవిస్తరముగాజెప్పి బాహ్కలా! నీవు మాఘమాసమున సూర్యోదయకాల మందు స్నానము చేయుము. దానిచేత నీ పితృదేవతలు ముక్తిని పొందుదురు. ఎవడు ఈ మాసమున సూర్యోదయ కాలమున స్నానము

చేయునో వాడు శ్రీహరి సాన్నిధ్యమును చేరును. ఓయీ! నీ వంశమందొకడు బ్రాహ్మరాక్షస రూపమును పొంది బాధపడుచున్నాడు. నీవతని పాపవిమోచనకై మాఘస్నానము ఆచరింపుము. దానివలన నాతడు తరించును అని చెప్పి సుశీలుడు తన యిచ్చ వచ్చిన రీతిని పోయెను.

పార్వతీ! కొంత కాలమునకు మాఘమాసము రాగానే శాపక్లుడు సుశీలుని వచనప్రకారము మాఘస్నానమును జేసెను. ఇట్లు శాపక్లుడు స్నానము, జపము, తర్పణము మొదలగునవి ఆ బ్రహ్మరాక్షసుని కొఱకై యీ మాసమంతయు జరిపెను. మాసాంత మగునప్పటికి బ్రహ్మరాక్షసుడు ముక్తిని పొందెను. చంద్రచెట్టు నేలమీద బడెను. ఆ రాక్షసుడు రాక్షస దేహమును విడిచి, దివ్యమైన శరీరమును దాల్చి స్వర్గలోకము చేరెను. ఈ విధమైన యీ మాసఫలమును నీకు చెప్పితిని. పాపభీతికలవాడు మాఘస్నానము ఆచరించిన పాపములు పటాపంచలగును. విష్ణులోకప్రాప్తి కలుగును. భక్తిశూన్యుడై శ్రద్ధగలిగి మాఘస్నానమును ఆచరించనిచో, దేహాంతమందు కుంభీపాక నరకమును బొందు ననుటకు సందియము లేదు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున ఏడవ అధ్యాయము.

---

## ఎనిమిదవ అధ్యాయము

హిమాచలతనయా! పార్వతీ! వినుము. పూర్వకాలమున ఒక విద్యాధర కన్యక మాఘమాసమున స్నానవ్రత మాచరించి

శ్రీహరిభక్తుని భర్తగా బడసి అంతమందు హరిసన్నిధానమును చేరెను. అని శంకరుడు చెప్పగా వినిన పార్వతి దయాసముద్రా! శంకరా! విద్యాధరకన్యక యెచ్చట మాఘస్నాన మాచరించినది? ఎట్లు హరిభక్తుని భర్తగాబొందినది చెప్పు మని యడుగగా త్రిపు రాంతకుడా గౌరిం గాంచి యిట్లుచెప్పసాగెను.

తొల్లి దేవతాంశసంభవుడైన విద్యాధరుడు సంతానములేక సంతానమును గోరుచు గంగానదీతీరమందు బ్రహ్మదేవుని గురించి తపస్సు చేసెను. అతడు యింద్రియములను నిగ్రహించి చలి, వేడి మొదలగు వాతావరణములను సహించుచు బ్రహ్మనుగూర్చి మంత్ర ముల జపించుచు, మనస్సున శ్రీహరిని ధ్యానింపుచు వెయ్యి దివ్య సంవత్సరములు తపస్సుచేసెను. ఇట్లుతపస్సు చేయుచున్న విద్యా ధరునికి వెయ్యి దివ్యసంవత్సరముల పిదప బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై అతనితో విద్యాధరా! వినుము నేను బ్రహ్మదేవుడను, నీవు చేయు చున్న గొప్పతపస్సునకు మెచ్చితిని, నీవు కోరినవర మిచ్చెదను అడుగుము. అనిచెప్పెను. విద్యాధరుడంతట బ్రహ్మదేవా! నేను పుత్రార్థినై తపస్సు చేయుచున్నాను. గాన నాకు పుత్రుని ప్రసా దింపుమని వేడెను. బ్రహ్మదేవుండా విద్యాధరునితో ఓయీ! నీకు పుత్రసంతానప్రాప్తి లేదు. అయినను నీతపస్సునకు మెచ్చి నేనొక వరమిచ్చుచున్నాను. నీకుఆడపిల్ల పుట్టును అనిచెప్పెను. విద్యాధరు డందులకు సంతోషించి బ్రహ్మకు నమస్కరించివెడలెను. బ్రహ్మయు నటనుండి కదలిపోయెను. బ్రహ్మదేవుని వరప్రసాదమున విద్యాధరుని భార్య ఆడపిల్లను కనెను.

విద్యాధర బాలిక క్రమముగా వృద్ధినిబొందెను. సుందరరూప మును, చంద్రునివంటి ముఖమును, మెత్తని అవయవములను, మందహాసమును, చంపక పుష్పకాంతివంటి కాంతియు, వికసించినపద్మమువలె

పుష్పమువంటి ముక్కును, విశాలమైన నేత్రములును యోగ్యమైన నడవడియు; చక్కని వటువ గల బంగారు కలశములతో సమానమైన కుచద్వయమును, మదించిన యేనుగు నడకవంటి నడకయు, సౌందర్యమును వెలిబుచ్చు శోభనకాంతియు గలిగిన యా రూపవతి యగు పుత్రికను జూచి విద్యాధరుడు సంతోషించెను. ఆమెను లాలింపుచు ఆమెను పెండ్లి విషయమై వరునెవ్వనిగా జూచిన బాగుండును. అల్లుని నాయింటియందే నాస్వాధీనమందే యుంచుకొందును అని పలువిధముల యోచించుచుండెను. అంతట ఒక రాక్షసుడు తన కులదేవత యగు మాయాదేవిని పూజించి, యామెవలన వరమును పొంది ఆవర ప్రభావమున సమస్త శాస్త్రార్థములను, సమస్త విద్యలను, వేదములను వేదాంగములను, తెలిసినవాడై, వానియందు ప్రవీణుడై శాస్త్రార్థవాదములను జేయసమర్థుడై మాయాదృష్టిని జేయగల విద్యాపరిపూర్ణుడై, మాయాయుద్ధవిశారదుడై, కామరూపమును పొందుశక్తి గలవాడై అంతటయు తృప్తిచెందక త్రిశూలమును బొందగోరిక గలవాడై ద్రోణపర్వతము మీద తపస్సు చేయ ప్రారంభించెను.

ఆ ద్రోణపర్వతము సమస్తమైన జంతువులకు ఆశ్రయమును సుఖమును యిచ్చునదియు, అనేకవిధములగు మృగసమూహము చేత నిండియుండునదియునై చకోరములు, సారసములు, లోనగు పక్షిగణములచేతను, విద్యాధరులు; కిన్నరులు, గుహ్యకులు, అప్సరసలు, యితర దేవతాగణముల చేత సేవింపబడుచునుండెను. ఆపర్వతమందొక సమతల ప్రదేశమున బిల్వవృక్ష మూలమున దయాస్వరూపుడనైన నన్ను గూర్చి ఆరాక్షసుడు త్రిశూలమునకై తపస్సు చేసెను. కాలియొక్క చిటికిన వ్రేలు భూమిపై మోపి కొంచెమైనను చలనములేక నూర్ధ్వ ముఖము గలవాడై చేతులు

జోడించి ఊర్ధ్వబాహుడై నన్ను గూర్చి మంత్రములనుచ్చరించుచు ఒక సంవత్సర కాలము తీవ్రమైన తపస్సు చేసెను.

ఆరాక్షసుడు చేయుచున్న తపస్సునకు నేను మెచ్చి వర మిత్తునని బలుకగా నా రాక్షసుడు నా చేతనున్న త్రిశూలము నిమ్మని యడిగెను. అంతట త్రిశూలమును వాని కిచ్చితిని. మరియు నా శూలము శత్రువులచేత నెప్పుడుబడునో యప్పుడే నీకు మరణము సంభవించును అనికూడ చెప్పితిని. రాక్షసుడంత నాతో నిట్లనెను.

శంకరా ! నీ వశమందున్న త్రిశూలము నా చేతికి వచ్చినది. నాకు శత్రువు లెచటనున్నారు? అయినను నా చేతినుండి శత్రువుల హస్తమునందెట్లు చేరును? నేనెట్లు త్రిశూలమును వదలుదును? అని పల్కుచుండగానే నే నచట అంతర్ధానమైతిని. ఆరాక్షసుడు భయ పెట్టుచు నా త్రిశూలమును చేతబూని మూడులోకములు తిరిగెను. నాతో సమాను డెచటను లేడు. అని చెప్పుచు సముద్ర మధ్యమున లోతైన నీటియందు నొక పట్టణమును నిర్మించెను.

ఆపట్టణము ప్రాకారములచే నిండినదియు, నాలుగుద్వార ములతో శోభిల్లునదియు మేడ లనేకములు గలదియు, బంగారు విశారమైన తోరణముల చేత అలంకరింప బడినదియునై, ప్రపంచ మున నిట్టిదిగలదా! యను నట్లుండెను. ఇదంతయు, రాక్షసుని మాయాబలము వలన సంభవించినది ఈ నగరమును నిర్మించి సంతసముతో రాక్షసు డిట్లు యాలోచించెను. నాకు సుందరవతి యగు భార్య యెచట దొరకును? దేవతా స్త్రీలతో సంభోగము నాకు దోషమును కలిగించుచున్నది. వివాహముగాని కన్య నాకు కావలెను. అట్టికన్యను లోకమంతు వెదకి దెచ్చుకొందు నని రాక్షసుడు బయలు దేరెను. మరియు భూలోకము మొదలగు పదు నాలుగు లోకములు వెదకి రాక్షస లోకము, దేవలోకము, ముని

లోకము, మానవలోకము లంచు క్రమముగా వెదకుచు దేవతా లోకమందు గల విద్యాధరుని పుత్రిక నీటికుండను నెత్తిన పెట్టు కొని తండ్రి యింటికి వెళ్ళుచుండగా చూచి తన రాక్షస రూప మును వదలి మన్మథుని వలె ప్రకాశించుచు తనను వరింపు మని కోరెను. రాక్షసుని పలుకులు విని విద్యాధరపుత్రిక యిట్లుచెప్పెను. నాతండ్రి యింటివద్ద నున్నాడు. నీవాతనిని యడుగుము. అంత రాక్షసుడు విద్యాధరుని వద్దకు పోయి, యాతని పుత్రికను తన కిచ్చి పెండ్లిచేయుమని యడిగెను. అతడు నిరాకరించెను. రాక్షసు డంతట మిక్కిలి విచారము గలవాడై ఆ గ్రామమందు కొంత దూరము నెమ్మదిగా నడచి కామరూపములు ధరించియైనను నా కన్యను బెండ్లాడుదునని నిశ్చయించుకొని, పూర్వమందువలె ఉదక కలశమును గొని తెచ్చుచున్న విద్యాధరుని కన్యకను హరించెను. మరియు బలాత్కారముగా నామెను చంక నిడుకొని తన గృహము నకు గొంపోయి తన కోరిక తీరినదని సంతసించెను. విద్యాధరుడు కూతురుని గానక విచారించుచుండెను. రాక్షసు డా విద్యాధర కన్య కను శుభకాలమున పెండ్లి చేసుకొన నిశ్చయించి లగ్న నిశ్చయము నకై బ్రహ్మదేవుని వద్దకుపోయెను. బ్రహ్మదేవుడు రాక్షసునితో ఓయీ! నీవు వివాహమాడుటకు యెనిమిది నెలలు గడువవలెను, ఆపైన మంచి దగును. అని చెప్పెను. వాడును అట్లేయని అంగీక రించి విద్యాధరుని పుత్రికతో నిట్లనియెను.

కళ్యాణీ! ఎనిమిది మాసముల తదనంతరమందు మంచిలగ్న మున మంచి తిథియందు నిన్ను పెండ్లాడగలను. అంతవరకు నీతో రమింపను! నీవు సుఖముగా నుండుము. స్వర్గములోనగు లోకము లందు గల అమూల్యమైన రత్నములు మొదలగు వానిబోని కెను

కావలెనో చెప్పుము. వాటినన్నిటిని తెచ్చి ఇచ్చెదను నీకేమి భయములేదు. అనిపలికిన రాక్షసుని పలుకులకు చంద్రుడుదయించి నప్పుడు ముడుచుకొనియున్న పద్మమువలె విద్యాధరకన్యక దీన త్వము నొంది యేమియుపలుకక యూరకుండెను. పిమ్మట రాక్షసుడు ప్రార్థించగా కొంతసేపటికి యిట్లనెను. రాక్షసుడా! నాకు యే వస్తువును అక్కరలేదు. నాకు నన్నియు కలవు. నాకు కావలసినప్పుడు నీతో చెప్పెదను. నాకు సోమవారం సాయంకాలమందు శివదర్శన వ్రతము కలదు. దానికిలింగము నెచ్చట ప్రతిష్ఠించితివో చెప్పుము. అని అడిగెను. ఆరాక్షసుడా చిన్నదానిని తనయింటినుండి పాతాళమునకు గొనిపోయి యచ్చటగల హాటకేశ్వరస్వామిని చూపెను. విద్యాధరకన్యక అందువలన సంతోషించెను. వాడును స్వేచ్ఛానుగతుడై నిర్భయముగా దిరుగుచుండెను. విద్యాధర కన్యకయు ప్రతి సోమవారమును పాతాళమునగల హాటకేశ్వరుని దర్శించుచుండెను.

పాతాళ లోకమునఅందరును ప్రతిదినమునుసాయంకాలమున ఈశ్వరదర్శనార్థము హాటకేశ్వరాలయమునకువచ్చిస్వామినిదర్శించి వెళ్ళుచుందురు. అంతట నారదుడు మూడులోకములందు పర్యటించుచు పాతాళమునకు జేరెను. మరియు ఈశ్వరదర్శనార్థమై హాటకేశ్వరస్వామి ఆలయమున జేరెను. అచ్చట సోమవార వ్రత దీక్షగల విద్యాధర కన్యక ప్రదోషకాలమున హాటకేశ్వర ఆలయమునకు వచ్చెను. నారదుడాకన్యకను జూచి చిన్నదానా! నీ విచ్చటకేలవచ్చితివి? నాకాశ్చర్యము కలుగుచున్నది. నేను నారదుడను భయములేదు చెప్పుము అని యడుగగా విద్యాధర కన్యక నారదునితో నిట్లు చెప్పెను.

మహానుభావా! నా యాగమనమును గురించి చెప్పెదను వినుము. దుర్మార్గుడైన రాక్షసుడొకడు నాతండ్రి యింటినుండి నన్ను తెచ్చి సముద్రమధ్యమునగల పట్టణమందుంచెను. ఎనిమిది నెలలు గడువు తరువాత ఆతడు నన్ను పెండ్లియాడదలచెను. మరియు తనకామార్థము నన్ను బొందును. అట్టి యిక్కట్టున పడియున్నాను. అని పలికిన విద్యాధరకన్యక పలుకులు విని, నారదుడు బాలికా! భయపడకుము. నీవు శ్రీహరి భక్తుడైన భర్తనుసీవున్న సముద్రమధ్యమందుగలయింటికి తెచ్చెదను. యిందుకు కొకయుపాయము జెప్పెదను. ఈ శివునికి ముందరభాగమున మానససమను సరస్సు గలదు. సూర్యుం డర్ధోదితు డగుచుండగా ఆసరస్సున మాఘ స్నానము చేయుము. ఇకపదునైదుదినములకు మాఘము వచ్చును. స్నానము చేయుటకు పిమ్మట నీటియందుగాని, స్థలమందుగాని, స్థండిలమందు గాని భక్తితో శ్రీహరినిపువ్వులచే గంధ, అగరు, చందన, ప్రదక్షిణ నమస్కారములచేతనుపూజచేయుము. మాఘమాసాధిపతిమాధవుడే గాన నీ యభీష్టములను తప్పక దీర్చగలడు. మాఘమాసమున స్నానము చేయువాడు పాపములచే విడువబడి, శ్రీహరి పురమును జేరును. శ్రీహరిని పూజించువాడమిత ఫలమును పొందును. మాఘ స్నానము చేయువాడు కన్యను కోరిన కన్యయు, ధనము వాంఛించిన ధనమును, పతిని గోరిన స్త్రీ పతిని, పుత్రులను గోరువాడు పుత్రులను, స్వర్గము నభిలషించువాడు స్వర్గమును, భార్యను పొందగోరువాడు భార్యను, రాజ్యమును గోరువాడు రాజ్యమును, జ్ఞానమును గోరువాడుజ్ఞానమును, మోక్షమును మోక్షమును పొందగలడు. గాన మకరమందు సూర్యుండుండగా మాఘమాసమున స్నానము చేయుము. దానివలన నీకోరిక సిద్ధించును సంశయము లేదు, నామాట నమ్ముము అని చెప్పినారదుడు యథేచ్ఛంజనెను.

నారదుని పలుకులు విని మాఘమాసమునకై విద్యాధర కన్యక ప్రతీక్షించుచుండెను. సరిగా పదునైదు దినములకు మాఘ మాస మేతెంచెను. సూర్యుడు శిశిరమందుండగా విద్యాధరకన్యక హాటకేశ్వరుని ముందరగల సరస్సునందు ప్రాతఃకాలమున మాఘ స్నానము చేసి, అనేకరీతుల హరిని పూజించి, ఆ నెలయంతయు స్నాన పూజాదికములచే వ్రతమును జరిపి, నారదుని స్మరణ గావించుచుం డెను. నారదుడు సమస్తదేశములు తిరుగుచు, సౌరాష్ట్రదేశమునకు వెళ్ళి సదా శ్రీహరిని పూజించు తద్దేశాధిపతియగు హరిద్రధునిగాం చెను. ఆ రాజు, భూమి మొదలు ఆకాశమువరకు నిండియున్న సమస్త జీవకోటులను, కుమారుని, తండ్రిని, గురువుని, సేవకుని, పశువును, మనుష్యుని, చండాలుని, కుక్కను, పాపుని, అణు వును పరమాణువును, గోవును వృక్షమును, గృహమును, బ్రహ్మ దేవుని మొదలు దోమవరకుగల యేవస్తువునైనను కూడ, హరితో సమానముగా జూచుచు, తలచుచు, కీర్తించుచు నుండెను. ఎవరి నైన పిలుచునపుడు శ్రీహరినామమును చ్చరించుచు, ఎచ్చటికేగినను విష్ణువును కీర్తించుచు, మాట్లాడునపుడు మాధవు నారాధించుచు, స్వీకరించునప్పుడు గోవిందుని దలచుచు, భోజనావసరమున దామో దరుని స్మరించుచు, నిద్రనుండి లేచువేళ కేశవుని ప్రార్థించుచు నిద్రించునపుడు నారాయణుని లోనెంచుచు, నిద్రసమయమున శ్రీకృష్ణుని నిలుపుచు, కేళీవిలాసములందు కామజనకుని కనుగొనుచు, సంచా రము చేయుచున్నప్పుడు వామనుని మననము చేయుచు, కష్టకాల మందు హృషీకేశుని దలంచుచు, సంతోషమున శ్రీధరుని సత్కరిం చుచు నుండును. ఈరీతిగా నిరంతరము విష్ణుదేవుని ధ్యానింపుచు మిక్కిలి తేజస్సుతో హరికథలను వినుచు సమస్తమును విష్ణుమయ ముగా జూచుచుండెను. నారదుడా రాజును జూడబోగా నాతడునార దుని అనేకరీతుల పూజించి వందన మాచరించి సంతసపరచెను.

అంత నారదుడా సౌరాష్ట్రదేశాధిపతినిజూచి రాజోత్తమా! ఒక విద్యాధర కన్యకను ఒక రాక్షసుడు బలవంతముగా యెత్తుకొని పోయి సముద్రమధ్యమందుంచెను. ఆ బాలిక కడుంగడు సుందరవతి. మరియు చక్కని యౌవనమును పొందియున్నది. గాన నీవు నీ విక్రమముచేత ఆబాలికను గొనివచ్చి భార్యగాగొనుము. ఆరాక్షసునివద్ద శివునిచే ప్రసాదింపబడిన త్రిశూలముకలదు. నీవాశూలమును గొని దానితో వానిని సంహరింపుము అని నారదుడు పలుకగా సౌరాష్ట్రరాజు ఆశ్చర్యము గలవాడై మహాత్మా! సముద్రమధ్యమందున్న రాక్షసుని నేనెట్లు చంపగలను? ఆ విద్యాధరకన్యను ఎట్లుతీసుకొని రాగలను, అని యడిగెను. నారదుడా రాజుతో రాజోత్తమా! నీవు సముద్రముదరికి పోవుము. సముద్రము నీకు దారినిచ్చును. ఆ మార్గమునబోయి రాక్షసునితో యుద్ధముచేసి, వానివద్దగల శివదత్త శూలమును బలిమినిపొంది, దానిచేతనే వానిని చంపి నా బాలికను తీసుకొని రమ్ము. అని యుపదేశించెను. హరిద్రధుడును నారదుని పలుకులు విని రథారూఢుడై సముద్రముదరికి వెడలెను. సముద్ర మా రాజును జూచి రెండుగావిడి మార్గము నిచ్చెను. ఆ మార్గమున రాజు రాక్షసపురము చేరెను.

రాక్షసుడు శుభలగ్నమును కనుగొనుటకై బ్రహ్మదేవుని యొద్దకు పోవునపుడు శివదత్తమైన త్రిశూలమును యింటివద్దనే వదలి వెడలెను. అందువలన హరిద్రధుడాయింటియందున్న త్రిశూలమును గ్రహింపగలిగెను. రాక్షసుడు బ్రహ్మదేవునివద్దమూడుదినములుండి తిరిగి తన యింటికి వచ్చెను. ఇంటికి వచ్చుసరికి, శివదత్తశూలమును ధరించి యుద్ధమునకు సిద్ధుడైయున్న హరిద్రధునిచూచి మనమున రాక్షసు డిట్లు దలంచెను. నా యింటియందు దెవ్వడో ప్రవేశించి త్రిశూలమును ధరించి దేవవంద్యుడయిన శ్రీమహావిష్ణువును కీర్తించు

చున్నాడు. నాకు ఇట్టి విష్ణుభక్తునిచేత మరణము తథ్యము. ఇదియెట్టి తపస్సువలనను సిద్ధింపదు. మానవునకు యెప్పుడయినను చావు తప్పదు. ఇట్లు విచారించి రాక్షసుడు యుద్ధసన్నద్ధుడై రాజుమీాదికి పోయెను. రాజును రాక్షసున కభిముఖుడయ్యెను. ఇరువురును ఘోర మైన యుద్ధము చేసిరి. హరిద్రదుడు త్రిశూలముచేత రాక్షసుని వక్షమునగొట్టెను. రాక్షసుడా దెబ్బచేత చచ్చి వజ్రాయుధముచేతగొట్టబడిన పర్వతమువలె నేలంబడెను హరిద్రధుడు సంతోషముతో విద్యాధరకన్యను జూచెను. ఆ కన్యకయు సిగ్గుచేత తలవంచుకొని నారదుని వచనములను స్మరించుచు సుఖమును చేకూర్చు భర్తను పొంది సంతసించెను. పిమ్మట నాదంపతు లుభయులు వారిగృహంబు చేరిరి. హరిద్రధుడును, భార్యయు నిరంతరము శ్రీహరిని పూజించి భక్తితో మెలంగుచు, అంత్యమందు జన్మరాహిత్యమును, సుఖప్రద మును నగు విష్ణులోకమును చేరిరి.

కాన గౌరీ ! మాఘవ్రతమును వివరముగా తెలుసుకొని ఆచ రించువాడు ఋషివరుడయి, అంతమందు మోక్షమును పొందును. మేనకాకుమారీరత్నమా! మాఘమాసమున స్నానముచేసి మకర మందు సూర్యుడుండగా శ్రీహరిని ధ్యానించువాడు పాతకుడయినను విష్ణుమందిరమును చేరగలడు. అట్లు చేయలేని వారు యమాలయ మున కతిథులు కాగలరు. ఎవరు మాఘమాసమున బహిర్జలమందు స్నానముచేసి నారాయణుని పూజింతురో, మాఘమాసమున హరి కథ నాలకింతురో, ఆపాదోదకమును పానము చేయుదురో, అట్టి పుణ్యాత్ములు పురాణపురుషుడగు పుండరీకాక్షుని పురవరమును జేరి పుణ్యవంతులయి సుఖమును పొందుదురు. ఈ చరిత్రమును, మాఘ మాసమున సదాస్నానముచేయు వ్రతముకలవారు, స్నానాంతరము

వినువారు, సమస్త పాపములచేతను విముక్తబడి మోక్షమును పొందుదురు.”

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున నెనిమిదవ అధ్యాయము.

—0—

## తొమ్మిదవ అధ్యాయము.

శంకరుడు పార్వతీదేవినిగూర్చి మాఘమాసమహిమను చెప్పుచున్నాడు. “శాంభవీ! పూర్వకాలమున వేదవేదాంగ వేత్తయైన గృత్సమదమహర్షి గంగానదియందు శిష్యులతోసహా మాఘమాసమందు స్నానముచేసి శ్రీహరి పూజచేసి శిష్యులకు హరికథా పఠనము చేయుచున్న సమయమున జహ్నువు మాఘమాసస్నాన ప్రభావమును వినగోరి, చెప్పుమని యడుగగా నా మాఘ మహిమను నాతడిట్లు చెప్పదొడగెను.

మాఘమాసమున ప్రాతఃకాలమున సూర్యుడు మకరరాశి యందుండగా మాఘస్నానము చేయువాడు ఇంద్రునివలె సమస్త పాతకములనుండియు విడువబడును. అని చెప్పిన గృత్సమదుని పలుకులు విని జహ్నువు ఆర్యా! ఇంద్రుడేమి పాపము చేసెను? మాఘస్నానమువలన నతడెట్లు ఆ పాపమును పోగొట్టుకొనగలిగెను. చెప్పుమని యడిగెను. అంత గృత్సమదుడా జహ్నుమహర్షి కిట్లు చెప్పదొడగెను.

కృతయుగమున తుంగభద్రానదీతీరమున నొక పుణ్యాశ్రమమందు నూరాడు వేదములు చదివిన మిత్రవిందుడను నొక మహాముని

యుండెను. అతని భార్య సుందరవదనయు, గొప్పవగు పిరుదుల గలదియు, ఘనమగు కుచములు గలదియు, మిగుల సౌందర్యవతియు, మిక్కిలి కామము గలదియునై యుండెను. పవిత్రమైన తుంగభద్రా నదీతోయములందు ఆ మునిభార్య ఉదయమందు ఋతుస్నానయై తలవెండ్రుకలను విడదీసుకొనుచు లేతయెండను సేవించుచుండెను. ఆసమయమున ఇంద్రుడు రాక్షస సంహారము చేయు కోరికతో దిక్పాలకులతోడను, స్వర్గవాసులగు శూరులైన దేవతలతోడను వెళ్ళుచు, ఆ మునిపత్నిని జూచి మనంబున నామెతో రమింప నిశ్చయించుకొనెను. ఇంద్రుడు మార్గమందే ఆమెనుచూచి మోహించినవాడై, వెళ్ళి దక్షిణమందున రాక్షసులతో ఘోరమైన యుద్ధమును చేసి వారిని జయించి తిరిగి తన పురమును జేరెను. గాని మనమున మునిపత్నిని గూడు కోరికగలవాడై సాయంసమయమున ఇంద్రుడు గాముని యాశ్రమమునకు వచ్చి దేవతలనందరిని స్వర్గమునకు బంపి తానుమాత్ర మచ్చటనే మునియొక్క పర్ణశాల ద్వారమందు మెరిసెలో నుండి మునిభార్యను జూచుచునుండెను.

మిత్రవిందుడు యథాగతిని అపరాత్రియందు వేదమును జెప్పుటకై పర్ణశాలయందున నిద్రించుచున్న శిష్యులను లేపుటకు బయటకు వచ్చెను. అంతలో దేవేంద్రుడు నెమ్మదిగా లోనికి ప్రవేశించి పర్ణశాలయందున్న మునిభార్యను నేను దేవేంద్రుడనని బలుకుచు పట్టుకొనెను. శీఘ్రముగాలేచి మునిపత్ని బయటకుపోగా నామెను ఇంద్రుడు రెండుచేతులతో గట్టిగా పట్టుకొనెను. మరియు మంచిమాటలతో గౌరవించెను. ఏమి బలికాలెను మునిపత్నియు మన్మథ వికారమున చిక్కుపడెను. ఆ దుచేత ఇంద్రుడు ముని భార్యతో సంభోగించి వెళ్ళుట కుద్యుక్తుడాయెను. మిత్రవిందు

డంతలో నింటికివచ్చి కుటీరమందున్న ఇంద్రునిజూచెను. వెంటనే జారుడని తలచి వానిం బట్టెను. ఇంద్రుడు నేను దేవేంద్రుడను గాని యితరుడను కానని మునితో పల్కెను. ముని ఇంద్రునితో నీ విచ్చటి కెందుకు వచ్చితి వని యడుగగా ఇంద్రుడు సిగ్గుచేతతల వంచుకొని మాటాడక యూరకుండెను. మిత్రవిందుడు యింద్రుని నేరమునకు వాని నిట్లు శపించెను.

ఓరీ! జారకర్మపరాయణా! దురాత్మా! మూఢా! జంభారీ! నీ ముఖము గాడిదముఖమై జారిన పెదవులుగలిగి స్వర్గమునకుబోవు శక్తి లేకుండనుందువుగాక! ఇంద్రుడు శాపవశమున గాడిద ముఖము గలవాడై యుండెను. మిత్రవిందుడు తన భార్యను అరణ్యమందు పాషాణముగా నుండమని శపించెను. పిమ్మట మిత్రవిందుడు గంగా తీరమునకు బోయి ఆత్మయోగముచేత దేహమును వదలి బ్రహ్మమును జేరెను.

ఇంద్రుడు ముఖము గాడిద ముఖముకాగా చెవులు నిలబెట్టి ముఖమును పైకెత్తి ఘోరమైన కూతలు కూయుచు, శరీరము మాత్రము పూర్వపురీతినేపొంది యుండెను. క్రమముగా ఇంద్రుడు పద్మపర్వతమునకు జేరి యట నొక గుహాయందు ప్రవేశించియెటు బోవుటకును శక్తి లేక, గడ్డి, గాదము తినుచు ఆ యరణ్యమందు విచారముతో నుండెను. ఇట్లు పన్నెండు సంవత్సరములు గడచినవి. దేవేంద్రుడు స్వర్గమందు లేని కారణముచేత రాక్షసులు స్వర్గముపై దండెత్తి దేవతలతో యుద్ధము జేయ నారంభించిరి. ప్రతి దినము జరుగు యీ క్రూరయుద్ధమువలన దేవతలు ఆయాసపడిరి. అందువలన యింద్రుని వెదకుచు దేవత లందరు నాల్గుభాగములుగా నల్దిశలకు వెళ్ళిరి. దేవత లందరు అన్నిదిక్కుల యందును మూడు

లోకములందును, అరణ్యముల యందును, పర్వతములయందును, పట్టణములయందును, పల్లెలయందును, గుహలయందును, లోయల యందును యింద్రునికొరకై వెదకిరి. కాని వానింగానక దేవతలు భయమును పొందిరి. స్వర్గము రాక్షసులింకను వశముగావించుకొన లేదని తెలిసి స్వర్గమునకు దేవతలు వెళ్ళిరి.

రాక్షసులతో యథారీతిని యుద్ధముచేసి వారిచేత దెబ్బలుతిని ఓడిపోయి దేవతలు కొందరిని స్వర్గమునకు కాపుదలగానుంచి, స్వర్గ మున కధిపతి లేడని ఏదోయొక మార్గమును కనిపెట్టవలెనని సము ద్రము దరి జేరిరి. ఈమాసము వచ్చుచుండగా సూర్యుడు మకరరాశి యందుండగా సముద్రతీరమున స్నానము కొరకాకాశమార్గము నుండి కొందరు మునులువచ్చిరి. వారు దేవతల ప్రత్యంతాగ్రమగదు యీ మాసమున మార్తాండోదయ సమయమందు స్నానమాడి హరిని పూజించి మాఘప్రభావమును చెప్పుకొనుచుండిరి. దేవతలు వారివద్దకుపోయి సముద్రమున వేరు వేరుగా మీరనుష్ఠించుచున్న పుణ్య వ్రతమేమి? దీని ఫలమేమి? మాకు చెప్పుమని యడిగిరి. ఆ కాశగాములైన మునులు సుఖమునిచ్చు మాఘస్నాన ఫలమును గురించి చెప్పదొడగిరి.

దేవతలారా! మేము చేయునది మాఘవ్రతము. దీనివలన సమస్తపాపములు హరించును. లోకోపకారార్థము దీనిని మీకు చెప్పుచున్నాము. ఈ మాసమున మకరమందు సూర్యుడుష్ణ కిర ణుడై యుండగా ప్రాతఃకాలమున స్నాన మాచరించువాడు మోక్ష మునుపొందగలడు. బ్రాహ్మీముహూర్తమందు లేచి శ్రీహరినిపూజించు వాడు పాపవిముక్తు డగును. ఈ మాసమున జల ప్రాంతమందు స్నానము, దానము, జపము, హోమములను చేయువారు ధన్యులు అగుదురు. మాఘశుద్ధ చతుర్దశి, పూర్ణిమ తిథులందు భక్తి

యుక్తుడై గోదానమును వృషోత్సర్జనమును, తిలదానము, అప్పములు అన్నదానము, పాయసదానము, కంబళము.వస్త్రము, బ్రాహ్మణున కిచ్చువారు శ్రీహరి సన్నిధానమున శాశ్వతముగానుందురు. గోదానము వలన స్వర్గలోకమును వృషోత్సర్జనము చేత శ్రీహరి పురమును తిలదానముచేత త్రియామానా లోకమును అప్పముల దానముచేత సూర్యమండలమును, అన్నదానముచేత దేవలోకమును పాయస దానమువలన ధ్రువమండలమును, కంబళివస్త్రాదిదానములచేతకృష్ణ వర్యుని సదనమును, వస్త్రదానముచేత బ్రహ్మ లోకమును పొంద గలరు. ఈలోకములన్నియు విష్ణుదేవుని యంశలుగాన మాఘస్నాన మును చేయువారీలోకములనుపొంది సుఖింతురు. ఈ మాఘవ్రత మును మించిన వ్రతముమరియొకటిలేదు. అరణ్యవాసులైన మును లకు ఈ మాఘవ్రతము మిక్కిలి యనుకూలము. గృహస్థులకును మిక్కిలి యుపయోగించును.

చలికి బాధపడువాడుగాని, పిచ్చివాడుగాని, ముసలివాడు గాని, రోగబాధితుడుగాని, బ్రహ్మచారిగాని, బాలుడుగాని, స్త్రీగాని శూద్రాదులుగాని మాఘమాసమున ప్రాతఃకాలమున స్నానము చేయనివారు అంతమందు ఛండాలురై జన్మింతురు పిమ్మటవుల్కాన తోలానులందును, చాకలికులమందును, కుమ్మరికులమందును, తెలి కులజాతియందు జన్మించి ఆపిమ్మట కుక్క, గాడిద, ఒంటె నక్క, తోడేలు, పెద్దపులి, ఎలుక పిశాచము, యీ మొదలయిన జన్మముల నెత్తి బాధపడుచుందురు. కాబట్టియేమానవుడు యీ మాసమున ప్రాతఃకాల స్నాన మాచరింపడో వాడు ఛండాలుడును. కుక్క మాంసమును తినువాడును, పశువులను వధించువాడును కాగలడు. మాఘవ్రతభంగమును గావించువారు చెప్పరాని సంకరులగుదురు. అట్టివారిని బహిష్కరింపవలెను. దేవతలారా! యెక్కువగా చెప్పుట

వలన ప్రయోజనము లేదు. ఛండాలుడైనను మాఘవ్రతమునం దాసక్తిగలవా డగునేని వాడుమిగుల శ్రేష్ఠుడు కాగలడు. అగ్ర జాతివాడైనను మాఘవ్రతభంగ మొనర్చువాడు ఛండాలునికంటె దక్కువవాడగును.

ఏ నరుడు వేదార్థమును గ్రహించి తనస్కాలమున మాఘ వ్రతము మిక్కిలి పవిత్రమైనదని యెరుంగునో, యే మానవుడా వ్రతము నాచరించునో వాడును ముక్తి బొందును. దేవతలారా! మేము చేయునది మాఘవ్రతము. దానిని మీకు చెప్పితిని. గృత్సమదుడు జహ్నుమహార్షితో ఓయీ! ఈ విధమున ఆకాశగాములైన మునీశ్వరుల పలుకులు దేవతలు విని తమ యభీష్టములను దీర్చుకొనుటకై సముద్రమున స్నానముచేసిరి. పిమ్మట దేవతలు స్నానాంతరమున జగదారాధ్యుడును, జగద్గురువును, చతుర్బాహుడును,మృదులాంగుడును, శంఖచక్ర గదాపద్మధరుడును, పీతాంబరధారియును, కంబుకంఠుడును, కిరీటము, ముత్యాలహారము; మణిగణఖచిత కనక భూషణ విరాజితుడును, వైజయంతీ విలాసుడును, మందస్మితుడును, సర్వవ్యాపియు, పద్మమువంటి విశాలమైన నేత్రములు గలవాడును కనుపడని చీలమండలు గలవాడును, కూర్మముబోలు పాదములుగల వాడును, అందమైన పిక్కలు గలవాడును, బలమైన తొడలు గల వాడును నాభికి పై భాగమున త్రివళీ పరిశోభితుడును, శుభ్రహాసము కలవాడును, సనకాది మునీశ్వరులచేత పొగడబడువాడును, నల్లని మేఘమువంటి శరీరకాంతి గలవాడును, కౌస్తుభమణియుతవక్షమునగల వాడును, అందమైన తిలకముచేతను ప్రకాశించు లలాటము కలవాడును, మకరకుండలములచేతను సమస్త భూషణాలంకారములచేతను ప్రకాశించువాడును, లక్ష్మీదేవితో కూడినవాడును

అగు శ్రీమహావిష్ణువును చూచి నమస్కరించిరి. అంజలిబద్ధులై స్తోత్రముచేసిరి. మరియు నా శ్రీహరిని సంతుష్టుని జేసిరి.

ఇది స్కాందపురాణాంతర్గమగు
మాఘపురాణమున తొమ్మిదవ అధ్యాయము

## ప ది య వ అ ధ్యా య ము

దేవతలు శ్రీమహావిష్ణువును యీ విధముగా స్తోత్రము చేయసాగిరి. ఓ వేద వేద్యా ! నీవు సర్వజీవులకు గురువు, వేదములచేత తెలియబడువాడవు. వేదములే స్థానముగా గలవాడవు, ఇట్టి నిన్ను బ్రహ్మవేత్తలు తెలుసుకొనుచున్నారు. అజ్ఞానులు తెలియజాలకున్నారు. సూర్యాది నవగ్రహములను, లోకములచే బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు వారిచేత స్తోత్రములనందుచుండు నీపాదసరోజయుగము మాకిప్పుడు కనిపించినది. దేవతలయొక్క సంతోష సముద్రమునకు పూర్ణచంద్రుడవును, స్వర్గలోక మోక్షములనిచ్చువాడవును, బ్రహ్మ ఇంద్రుడు మొదలగు దేవతలను సృష్టించువాడవును, వైకుంఠధాముడవును, సమస్తప్రాణులయొక్క నివాసస్థలములందుండు వాడవును, సర్వదా ప్రకాశమానుడవై సచ్చిదానందరూపుడవై,సత్యవాక్య పరాయణుడవై వెలంగు నీకు నమస్కారము. సర్వలోకములను సృష్టించినపుడు బ్రహ్మదేవుడ వగుదువు. ఆ సృష్టిచేయుబడిన జగత్తును నాశనము చేయునపుడు యీశ్వరుడవును అగుచున్నావు. జలప్రళయముచే సర్వలోకములను నాశనము జెందినపుడు నీవొకడవే మిగిలియుందువు. అప్పుడు వేదవినుతుడవై

వటపత్రశాయివై నిలిచియుండి పూర్వపురీతిని తిరిగి భూతసృష్టి గావింతువు. గాన సమస్తమైన ప్రపంచమునకు సృష్టికర్తవు నీవే సుమా! ఈప్రపంచము పూర్వకాలమున బ్రహ్మదేవునిచేత సృష్టింపబడిన పిమ్మట సంహారము జెందుచుండెను. ఈ జగమందు ప్రజల సుఖదుఃఖములను పాలించు పరమాత్మవైన నీకుగాక వేరేసృష్టి స్థితిలయకారకు లగు బ్రహ్మ విష్ణు రుద్రులకు గాని యీజగత్తున గల మిక్కిలి పవిత్రమైన నీపదసరోజ యుగమును తెలియుట కష్టసాధ్యము. కర్మ పకృతి గుణభేదములచే సమస్తమైన ప్రాణికోటిని సృజించును. అఖిల నిషేధములను విడిచి నీయిష్టవిధిని స్వీకరించు నిరుపమాన ప్రజ్ఞగల నిన్ను సామాన్యమానవులు తెలియంగ జాలరు. ఈజగమంతయునీవే. నీయొక్క రోమకూపమునుండి అనేకమైన బ్రహ్మండములు అతిసూక్ష్మమైన పరమాణువులవలె ప్రకాశించుచున్నవి. త్రిగుణయుతమైనరజోగుణపరిబద్ధమైయున్న మూఢులు ఆ పరమాత్మస్వరూపము నెఱుంగజాలక అజ్ఞానమున బడుచున్నారు. ఓ శ్రీహరీ! నీవు మొకట మాయను పరికల్పించి, పిమ్మట సత్త్వ చిత్త గుణగణములను సృష్టించి, ఆపిమ్మట దేహములను సృజించి నీవే జీవాత్మయు, పరమాత్మయుకూడ నగుచు, ఆత్మలయందు ప్రవేశించి జగన్నాటక సూత్రధారివై నాట్య కళాకౌశలోత్సాహమును ప్రకటించుచుందువు.

బ్రహ్మదేవుడు నీయొక్క నాభికమలమందు పుట్టి సముద్రమందు తనపుట్టుక స్థలమును తెలియక, పద్మనాళమందు బ్రవేశించి దేవా! నా కాధారమేమి ? నేనెవ్వడను ? నేనెట్లు వచ్చితిని అని చింతనొందెను. అంతట ఆకాశమందు 'తప' అను శబ్దము వినబడెను. అందువలన తపస్సు శ్రేష్టమని గ్రహించెను. బ్రహ్మ ఆ నాభికమలమందే శ్రీహరినిగూర్చి వేయేండ్లు తపముచేసి, తన

కాధారభూతుడు శ్రీహరియని తెలిసికొని యావిష్ణుదేవుని స్తుతించి మీ ప్రభావప్రసాదమును గ్రహించి ఈ హస్తిమశకాంతర భూతమైన విశ్వమును సృజించెను. ఓ దేవా! నీవు వేయి కండ్లు గలవాడవు. వేయిముఖములు కలవాడవు. వేయి పాదములు కల వాడవు, వేయి చేతులు గలవాడవు. అన్ని గుణములచేతను సహస్ర సంఖ్యాకుడవు. వేయి రూపములచేత భూమ్యాది సమస్తలోకము లందును వ్యాపించియుండి పదియంగుళము లధికముగా నుందువు నీపొట్టయందు నొక భాగమందే పదునాలుగు లోకములును సమస్త ప్రాణికోటితో గూడియుండి పుట్టుచు చచ్చుచు నుండును. అందువలన తెలిసినవారుకూడా నిన్ను తెలియజాలరు. నీ బలశౌర్య ములు స్వేచ్ఛాధనములు, పరమపవిత్రులైన బ్రహ్మదేవుడు, గరు త్మంతుడు, అక్రూరుడు మొదలగు భక్తులు నీవలన వైకుంఠప్రాప్తి కనువగు మార్గములను తెలిసికొని నిన్నే సేవించి మాయ కతీతులై సత్యయుతులై, పరమపురుషుడవును. పరాత్పరుడవును, స్వయం ప్రకాశకుడవును, పరబ్రహ్మస్వరూపుడవును అగు నిన్ను పొంద కలుగుచున్నారు. ధ్రువుడు, నారదుడు, అర్జునుడు, ప్రహ్లాదుడు ఉద్ధవుడు, శౌనక, విభీషణ, వసిష్ఠ, పరాశర, గజేంద్రా వ్యాసాంబరీష శుక, భీష్మ, రుక్మాంగద, ఆంజనేయ, బలి, పుండరీకాదులు నీపాదభక్తి చేతనే దుఃఖములేక తేజస్సుతో కూడిన శాశ్వతమైన నీస్థానమును పొందిరి. గాన సుఖముల నిచ్చు నీపాదములకు నమస్కారము చేసెదము, ఓ! శ్రీహరీ! నీవే విష్ణుడవు, సూర్యుడవు. ఇంద్రుడవు బ్రహ్మవు, రుద్రుడవు చంద్రుడవు, యముడవు, అగ్నిదేవుడవు, యజ్ఞాధిదేవతవు, పక్షులు, పర్వతములు, వృక్షములు, దిక్కులు సముద్రములు, ఇవియవి యననేల సమస్తమైన జీవరాసులతోకూడిన చరాచరాత్మకమైన ప్రపంచమంతయు నీస్వరూపమేగాని వేఱుకాదు.

ఓ దేవా! మీ పాదసరోజములందు కట్టుబడిన మనస్సుగల మునీశ్వరులచేత, చేయబడిన దుస్సాధ్యమగు తపోబలిమిచే వశుడవై మునిహృదయములందు నివశించుచు బహిరంతర్గతవ్యాప్తి కలిగిన పరమపురుషుడవైన మహానుభావా! నీకు సదా నమస్కరింతును. శ్రీహరీ! పూర్వకాలమునుండికూడ మునులు, యోగులు, బ్రహ్మ శంకరుడు, ఇంద్రుడు లోనగు వారందరును సంసార సాగరమును దాటుటకై మిక్కిలి సుఖప్రదమగు నీ యొక్క భక్తియను పడవను ఆశ్రయించి యీజలనిధిని దాటి,నీ పాదకమలములను జేరుచుందురు. పూర్వము అజామీళుడనునతడు మిక్కిలి దురాచారములు గల వాడై ప్రతినిత్యము అనేక పాపములను చేయుచు, అంత్యకాల మున తన పుత్రునియందుగల ప్రేమచేత వణకుతోకూడిన వాక్య ములతో నారాయణ అనునీపేరును స్మరించిన శాశ్వతమైన మోక్ష మును పొందెను. భగవంతుడా! నీమహిమ నెఱుంగ నెవ్వరికి సాధ్య మగును? స్వతంత్రముగా పుట్టినట్టియు సర్వగుణాధారమైనట్టియు, సుగుణములు గల్గినట్టియు విధిజ్ఞురాలును వేదజ్ఞురాలును శాస్త్రార్థ విచారణయందసమాన ప్రజ్ఞావతియు అగుపార్వతీదేవి నీయొక్కనామ స్మరణచేత రెండక్షరములగు రామనామముచేత మహిమాన్విత మగు సుగతిని పొందెను. అనంతస్వరూపా! పూర్వకాలమున ఆది శేషువు అనేకవిధముల తన వేయిముఖములతో నిన్నుస్తోత్రము చేసి నీకు శయ్యగా నుండెను. అట్లే శేషువునకు శత్రువైన గరుత్మం తుడు నూరుయుగములు తపస్సుచేసి నిన్ను ప్రార్థించి నీకు వాహన ముగా నుండెను. దేవదేవా! పవిత్రమైన చరిత్రలచేత నిండిన అనేక మైన విచారములను పోగొట్టునట్టి నీపాదద్వయమునకు నమస్కరించు చున్నాను. మేము దేవతలము,యుద్ధమంకు రాక్షసులచేత పీడింప బడి విచారించుచున్నాము. మమ్ములను రక్షింపుము. ఇప్పుడు

ఇంద్రలోకమందుయింద్రుడులేడు.అతడెచ్చటనున్నాడో తెలియదు స్వర్గలోకమున రాక్షసులకును మాకును యుద్ధము జరిగిన మేము ఓడిపోయి రక్షణశూన్యులమై నిన్నాశ్రయింప వచ్చితిమి గాన ఇంద్రునిగానియితరులెవ్వరైన సమర్థులుండినవారినిగానిస్వర్గపరిపాలనమునకు పంపించి నీ శరణాగతులగు మమ్ములను రక్షింపుము.

యీ విధమున దేవస్తోత్రములను విని విష్ణుమూర్తి ప్రసన్నుడై వారి కార్యమును గ్రహించి దేవతలారా! ఇంద్రుడు గాడిద ముఖముగల్గి విప్రశాపమున పద్మావతీ పర్వతగుహాయందు పడియున్నాడు. ఆ శాపకారణము చెప్పెదను వినుడు మిత్రవిందుని భార్యతో యింద్రుడు రాత్రివేళ రమించియుండగా మిత్రవిందు డది చూచి గాడిదముఖముగల్గి స్వర్గమునకు పోజాలక యుందువని శపించెను. అందుచే ఇంద్రుడు గాడిదముఖముతో స్వర్గమునకు బోవ నసమర్థుడై లజ్జాదుఃఖములచేత బాధపడుచుండెను. ఆ పద్మావతీ పర్వతము పడమటగా గోకర్ణ క్షేత్రమునకు ఉత్తరదిశయందు యిరవై ఆరు ఆమడల దూరమందున్నది. ఆపర్వతమునగల దక్షిణపు గుహాయందు గాడిదముఖముతో గడ్డిగాదము తినుచు, తీవ్రమైన యెండలో మీ ఇంద్రుడు డున్నాడు. గాన మీరా ఇంద్రుని యొద్దకు జనుడు ఆ ఇంద్రుని దోషమునకు నివారణోపాయము దెల్పెదను. దానివలన ఇంద్రుడుశక్తిగలవాడై గాడిదముఖమును వదలి స్వర్గమునకు వచ్చిమిమ్ములను పాలించును.

దేవతలారా! మాఘమాసమున మకరరాశియందు సూర్యుడర్థోదితు డగుచుండగా మీరు ఆ యింద్రునిబట్టి తీసికొనిపోయి, తుంగభద్రా నదీతోయములందు మాఘస్నానమును చేయించిన యెడల ఆ యింద్రుడు శక్తివంతుడై ముఖము గాడిదరూపము వదలి యథారీతి నుండును. అనిపలికిన శ్రీహరి వాక్యములకు దేవతలు

ఆశ్చర్యవంతులై విష్ణుదేవుని గూర్చి యిట్లు పలికిరి. భగవంతుడా! గాడిద ముఖముగల ఇంద్రుడు స్వర్గమున పూర్వపురీతిని బోయి యెట్లుండగలడు? అని దేవత లడిగిన విష్ణుమూర్తి వారితో యిట్ల నెను. దేవతలారా! యీ మాసమున స్నానముచేసిన ఫలితముగా ఇంద్రుని గాడిదముఖము మాయమగుటలో వింతలేదు. ఇంతకంటె చిత్రమైన కథను చెప్పెదను వినుడు.

పూర్వమందు విశ్వామిత్రుడను మహర్షి భూలోకమునకు ప్రదక్షిణం చేయుచు క్రమముగా గంగాతీరమునకు వచ్చి యచ్చట లబ్ధమైన యొకానొక గంధర్వకాంతతో రమించెను. ఆ దోషము వలన వానరముఖము గలవాడై మాఘస్నానము చేసిన ఫలితముచే వెనుకటి రూపమునే పొందగలిగెను. ఆ సమాచారమును చెప్పెద వినుడు. ఆకాశమార్గమున గంధర్వులు తిరుగుచు, గంగాతటమునకు వచ్చి భార్యాపుత్రులతో గంగానదీజలమందు మాఘస్నానము చేసి, మాఘమాసాధిపతినగు నన్ను భక్తితో పూజించి ఆ మాసమహిమను విని పరస్పరము చెప్పుకొనుచు, సంతోషముతో భార్యాపుత్రులం గూడి ఆకాశమార్గమున బోయిరి. వారిలో నొకకాంత స్నానమునం దిష్టములేక భర్తయొక్క బలవంతాన వారితో వచ్చినదగుటచే చలికి భయపడి మాఘస్నానమును చేయక నిలిచిపోయెను. ఆ దోషమువలన నామె వారితో ఆకాశమార్గమునబోవ శక్తిలేకయుం డెను. ఈమె విషయము వారాలోచింపక గంధర్వులు తమదారిన తాముబోయిరి. గంధర్వులు వెళ్ళిన వెంటనే మాఘస్నానము లేని మానినీమణి ఆకాశగమనశక్తి అంతరింప గంగాతీరమందు గల అరణ్యమందు సంచరించుచు విచారించు చుండెను.

ఇంతలో విశ్వామిత్రుడు భూప్రదక్షిణము చేయుచుండగా తీరమునకు స్నానార్థము నరుదెంచెను ఆ దవనూ ్యమై ి మహా న్య

మందు నవలావణ్యవతి యగు నొక గంధర్వ కన్య వంటరిగా శాపజనితమై కాన్పించెను. తోడనే గాధిసూనుడు మన్మథపరవశుడై ఆ గంధర్వకాంతతో యిట్లనెను. కాంతా! నీవు ఎవతెవు? యీ జనశూన్యమగు కారడవియందేల యున్నావు? నిన్ను రక్షించు వారెవరు? అయ్యో! నేను నిన్ను కాపాడెదను. భయమందకుము. అని పలికి గాధినందనుడు మోహపరవశుడై నిలువలేక బుద్ధిహీనుడై వెంటనే తనచేతులతో నా గంధర్వకన్యను బలవంతముగా బిగియపట్టుకొని తనివితీర సంభోగించెను. విప్రాః పశ్చిమబుద్ధయః అను నార్యోక్తి ననుసరించి విశ్వామిత్రుడు గంధర్వ భార్యతో సంభోగించిన పిదప తాను చేసినది దోషమని పశ్చాత్తాపమును బొంది గంగా స్నానము చేయుటకు వచ్చెను. అంతలో గంధర్వులు వారిలోకమున కేగగా గంధర్వుడు తన భార్యను గానక, తిరిగివచ్చి, యిటునటు తాము స్నానమాడిన ప్రదేశమున జూడగా నాతనియెదుట విశ్వామిత్ర మహర్షియు, తన భార్యయు గాన్పించిరి. వెంటనేవారి దురాచారమును గ్రహించి విశ్వామిత్రు డాచరించిన దోషమునకు వానిని వానరముఖము కలవాడవగుమని శపించెను. తనభార్యను పాషాణముగా పడియుండుమని శపించెను.

అట్లు గంధర్వుడు విశ్వామిత్రునికి తన భార్యకుకూడ శాపముల నిచ్చి తనలోకమునకు పోయెను. గంధర్వశాపము వలన విశ్వామిత్రుడు వానరముఖుడయ్యెను. గంధర్వకాంతయు గంగాతీరమున కఠిన పాషాణమయ్యెను. ఇట్లు వారు మందబుద్ధులై శాపరూపములతో పన్నెండు సంవత్సరము లుండిరి. పిమ్మట ఒకనాడు నారద మహర్షి త్రిలోక సంచారి గాన పలులోకములు తిరుగుచు యీ గంగాతీరమునకు వచ్చెను. అచట వానరరూపముతో మందబుద్ధియై యున్న విశ్వామిత్రుని జూచి నారదు డమితాశ్చర్యమును బొంది

దివ్యదృష్టిచే జరిగినదంతయు దెలిసికొని మనస్సులో నిట్లనియోచించెను. అయ్యో! యీ విశ్వామిత్ర మునివల్లభుడు తన కామోద్రేకముచేత తపో భ్రష్టుడై మునిగణస్తూయమానుడయినను, గౌరవహీనుడైనాడు. పరస్త్రీ సంగమము బహుదోషవహము గదా! నారదమహర్షి యీరీతిగా తలచి విశ్వామిత్రుని పాప పరిహారము నకై వెంటనే మాఘమాసమున సూర్యోదయకాలమున సంకల్పయుక్తముగా స్నానము చేయించెను. ఆస్నాన ఫలము వలన మాఘమాసాధి దేవతనగు నేను మిక్కిలి సంతసించి విశ్వామిత్రునకు వానరముఖమును పోగొట్టి మిక్కిలి సుందరవదనమునుకల్పించితిని. అంతట నామునులిరువురును జేరి తపస్సు చేయుటకయి పోవుచు కమండలోదకముతో పూర్వము యీవిశ్వామిత్రునితో రమించి భర్త చేత శపింపబడి పడియున్న పాషాణముపై ప్రోక్షించిన, గంధర్వుని భార్య పాషాణరూపమును వదలి మిక్కిలి యందమైన వదనారవిందమును బొందియుండెను. నారదుడా స్త్రీని జూచి మిక్కిలి ఆశ్చర్యమును బొందెను. గంధర్వకాంతయు నానదీజలమందు స్నానముచేసి తన లోకమునకు చేరెను. నారదుడును విశ్వామిత్రుడును తమతమ ప్రదేశముల కరిగిరి.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు పదియవ అధ్యాయము

---

## పదునొకండవ అధ్యాయము

విష్ణుమూర్తి దేవతల నుద్దేశించి దేవతలారా విశ్వామిత్రాది మహామునులను పరిశుద్ధులను గావించిన మాఘ స్నానము

మీయింద్రుని మాత్రమెందులకు పరిశుద్ధుని జేయకుండును? కాన మీరు ఇంద్రు నితీసుకొని వెళ్ళిస్నానము చేయించిన ఆతడుపరిశుద్ధుడు కాగలడు. మరియు మాఘమాసప్రభావమును చెప్పెదను వినుడని యిట్లు పలికెను.

మాఘశుక్ల పూర్ణిమ రోజున మాఘస్నానము చేసి వృషోత్సర్జనము చేయువాడు సమస్తపాపములచేతను విడువబడును. మాఘమాసమున సూర్యుడుదయించు చుండగా స్నానము చేయువారు పాపమునుండి విడువబడి దేవత్వమును పొంది నాకు స్థానమైన స్వర్గము నలంకరింతురు. ఈ మాసమున ఉదయమున స్నానముచేసి శ్రీహరిని పూజించి యీ మాసమహిమను వినువారు మిక్కిలి యెక్కువైన పుణ్యమును పొందగల్గుదురు. మహా పాపము వలన భయమును బొందినవారు మాఘస్నానము చేసినయెడల పాతక ముక్తులై వైకుంఠ మందిరమం దుండగలరు. ఎచ్చట జహ్ను సూర్యులకు కన్యలైనట్టి తెల్లనిదినగు రెండు నదులు గంగ యమున తమ తరంగములచే చామరము వలె ప్రకాశించునో, యెచ్చట గొడుగువలె అక్షయ వటవృక్షము విరాజిల్లునో అట్టి ప్రయాగము తీర్థశ్రేష్ఠముగానున్నది. మాఘస్నానము ఆపదలనుండి కాపాడును. దుఃఖములను దూరముచేయును. ప్రకాశించువానిలో సూర్యుడును వృక్షములలో అశ్వత్థవృక్షమును, భోగములనుభవించు దేవతలలో శ్రీహరియు, శాస్త్రములన్నిటిలోను వేదమును సమస్తజాతులలోను బ్రాహ్మణుడును, రాజులలో రాఘవరాముడును, ఋతువులన్నిటిలో వసంతఋతువును, అన్నిమంత్రములలో రామతారకమను అక్షరముల మంత్రమును, స్త్రీలలో లక్ష్మీ దేవియు, సమస్తనదులలో గంగానదియు, శాశ్వతమగు దేవతలందు విరాట్బ్రహ్మయు, పర్వతములలో మేరుపర్వతమును, దానము లన్నిటిలో ధనము దాన

మిచ్చుటయు, పరమశ్రేష్ఠము లగునట్లు మాసము అన్నిటిలో యీ మాస మత్యుత్తమమైనది. సర్వతీర్థసేవలకంటె మాఘసేవ చాలా గొప్పది. అన్ని వ్రతములకంటె మాఘస్నాన వ్రతము మిక్కిలి శ్రేష్ఠము. అన్ని దానములకంటె, అన్ని క్రతువులకంటె, యీమాసము మిక్కిలి యెక్కువైనది.

కృష్ణవేణి, పుష్కరము, బ్రహ్మావర్తము, హిమాచలము, ప్రయాగ, గంగాసాగర సంగమము, గోకర్ణము, ప్రభావము, కావేరీ, పశ్చిమవాహినీ దర్శానదీ, యామ్యకూపము, తామ్రపర్ణి, నర్మదా, గౌతమీ సరస్వతీ, యమునా, సహ్యప్రోద్భవ, రేవానదీ చాపము, పుష్కరవాహినీ, భద్ర, శోణభద్ర, వేగవతీ, సరయూ, దక్షిణకైలాసగంగ. స్వర్ణముఖి మొదలైన చతుర్వింశతికోటి తీర్థములగు నదుల యందు నిత్యము స్నానమును చేయువారు యెట్టి ఫలితమును పొందుదురో అట్టిఫలితమును, యీమాసమున మూడు రోజులు భక్తియుక్తులై స్నానమాచరించువారు పొందగల్గుదురు. సాలగ్రామమను నివాసముగాగల నన్ను యెవరు నిత్యము యీమాస మున స్నానముచేసి యభిషేకింతురో, నీటి సమీపమందు పద్మముల తోను, రంగురంగుల గన్నేరు పుష్పములతోను, మల్లెపువ్వుల తోను, తులసీనవపల్లవములతోను, మందార, పారిజాత, చంపక వకుళ పుష్పములతోను, భక్తితో పూజింతురో, అట్టివారు మరల జన్మలేని శాశ్వత విష్ణులోక ప్రాప్తిపొందుదురు. ఈ మాసమున ఉదయమందు ఉసిరికాయలతో స్నానమును చేయువాడు అన్ని పాపములచేతను విడువబడి వైకుంఠమును పొందుచున్నాడు. ఈ మాసమున శరీరమంతయు ఉదయమున తులసిమట్టిని పూసుకొని స్నానము చేయువాడు నాకు పరమప్రీతుడుకాగలడు. శరీరమంతయు గోమయము రాచుకొని స్నానమాడువాడు పాప వినిర్ముక్తుడగును.

దేవతలారా! ఈమాసమున నుదయమున స్నానము చేసి అందమగు మందిరమున మాఘాదిదేవతనగు నన్ను పూజించువారు నాస్థానమును పొందగల్గుదురు. విప్రుఁడుగాని, శూద్రుడుగాని ఈ స్నానముచేయనియెడల అతడు యమదండనకు పాత్రుఁడగును. ఈనెలయందు ఉదయమున స్నానము చేయని స్త్రీ యమబాధకు లోనగును. అనేక కారణములచేత సంభవించిన పాపములు గల స్త్రీయైనను నన్నుదలంచి ఈ స్నానము చేయనియెడల ఆ స్త్రీకుంభీపాక నరకబాధలనుండి విడివడును. భర్తలేని స్త్రీ భోజనాసక్తిచే రెండుసారులు దినమందు భుజించి ఈమాసమున స్నానముచేయక యున్న నామె కుంభీపాక నరకమందు వండబడుచున్నది. విప్రుఁడు ఈ స్నానము ఆచరించిన నాలోకమును బొంది నాతో సుఖించును. ఈ నెలయందు స్నానదానములను చేయువాడు భయంకర యమ లోకము దరికి బోనేరడు, ఈ స్నాన విముఖుడగువాడు మలభోజను డగును. ఈ స్నానము గావించి నన్ను పూజించి పిమ్మట భుజించు వాఁడు నాకు భృత్యుడు కాగలడు. మాఘస్నానముచేసి దేవముని, పితృతర్పణములను జేసి నా కథను విని యానందించువాడు పాప వినిర్ముక్తుఁడగును.

ఈమాసమున ఉదయమున స్నానముచేసి శుద్ధమైన తెల్లని బట్టలు కట్టుకొని నన్ను స్మరింపుచు శ్రీహరిని గూర్చి అర్ఘ్యమును యిచ్చునట్టి విప్రుడు పాప వినిర్ముక్తుడగును. ఆ బ్రాహ్మణుడు నాచేత పూజింపబడును. గాన మీరును అట్టివానిని పూజింప వలెను. ఈ మాసమున మకరరాశి యందు సూర్యుడుండగా అర్ఘ్యపాద్యాది నమస్కార విధులచేత సూర్యుని పూజచేయువారు నాలోకమును చేరుదురు. ఈ మాసమున నన్ను గూర్చి జపము చేయుచు స్నానము ఆచరించి నన్ను పూజించి అష్టోత్తరశతము

గాయత్రీ జపము చేయునరుడు నాకు పూజ్యుడగును. పుణ్యోదక మందు స్నానముచేసి గాయత్రీజపము చేయువానికి ముక్తికరస్థిత మగును. గాయత్రీమహామంత్రముతో సరిపోవు మంత్రము లేదు. గాయత్రిపాతకములను నాశనము చేయును. మోక్షము నిచ్చును, గాయత్రి నాలోకమునకు అట్టివారిని చేర్చును. గాయత్రి బ్రహ్మ లోకమును యిచ్చును. గాయత్రి వలన శివలోకమును సూర్యలోక మును, చంద్రలోకమును పొంద గల్గుదురు. ఎవడీ మాసమున స్నానము చేసి గాయత్రీజపము ఆచరించునో, వాడు సమస్త తీర్థము లందు స్నానము జేసిన ఫలితమును సమస్త యజ్ఞములకు కర్తయగు దీక్షితుని ఫలితమును పొందగలడు. అట్టి నరుడు మీయందరి చేతను, మునులచేతను కొనియాడబడుచు నాపురమును చేరగలడు. మాఘస్నానముచేసి బ్రహ్మయజ్ఞముచేయువాడుబ్రహ్మలోకమందు చాలాకాలము నివసించిపిమ్మటనన్నుచేరగలడు. బ్రహ్మ యజ్ఞమున గాయత్రిని, ఉచ్చరించు విధిచెప్పబడినది. మాఘ స్నానమును చేసి సంధ్యావందనమును చేసి తూర్పుదిక్కుగా ఎడమతొడయందు కుడి పాదముంచి కుడితొడయందు ఎడమపాదము నుంచి అంజలిబట్టి ఓంకార ప్రవణముచేసి, వ్యాహృతిత్రయముచేసి గాయత్రి మంత్ర మునుఉచ్ఛరించి మూడుసారులు అర్థహితముగా పూర్తిగా ఉచ్ఛ రించి జపము చేయువాడు మహాపాతకములచేత విముక్తుడగును. ఈమాసమున సుస్నాతుడై బ్రహ్మ యజ్ఞమునుచేసి నాకథను విని అన్నదానమును చేయువాడు నాభక్తుడై యమలోకమును జూత నేరడు. ఈమాసమున సాలగ్రామ సన్నిధియందు దీపమును బెట్టు వాడు కష్టసాధ్యమగు పూర్వజ్ఞానమును బొంది అంతమందు నా యందు చేరును. మాఘస్నానాంతరము నన్ను ఆ నదీ తీరముననే పూజించువాడు కోటిమంది బంధువులతో కూడి నాపురమున చిర

కాలముండును. తులసిగుచ్ఛములతో జలసన్నిధానమందు నన్ను పూజించినవాడు నాలోకమును జేరును. మాఘస్నానముచేసి తులసీ పూసల పేర్లను కంఠమందు వేసుకొని గాయత్రీజపమును చేయుచు నన్ను పూజచేయువాడు యమబాధ నుండి తొలగును. సర్వదా తులసీ మణిదండను ధరించువానిని పాపములుగాని తాపబాధలు గాని యేమియు చేయనేరవు. మాఘ స్నానమును చేసి కృష్ణ సన్నిధానమున ఈపురాణమును చెప్పు నరుడు నాకు గౌరవనీయుడు. వాని ఇంటియందు నేను నివసింతును నదీతీరమున స్నానము చేసి నన్ను పూజించి పురాణమును పఠించు వాడు పరమ శ్రోత్రియు డనబడును. అర్థములేనట్టియు శ్రీరాగము లేనట్టియు పురాణమును ఎన్నడును వినకూడదు. పురాణమును స్పష్టముగాను, విష్ణుకథా యుక్తముగను గంభీరముగాను, శాస్త్రసందర్భసమముగాను, అందమై శ్రావ్యమైన సంగీతరాగముతో చెప్పవలెను. ఇట్టి పురాణమునే వినవలెను. అట్టివాడు పుణ్యమూర్తి యగును.

దేవతలారా! ఈమాసమున భక్తిగలవాడై సదా భక్తితో పురాణశ్లోకములచేత నన్నుస్తుతించునో అట్టివాడు నాయంశయే యగును. ఆతడు నన్నేచేరగలడు. ఈ నెల యందు జలసన్నిధిని నన్నుగూర్చిన కథాశ్రవణమును చేయ కుతూహలుడై యుండునో అతడు నా సారూప్యమును పొందగల్గును. ముక్తికొసంగు ఈ పురాణము నెవ్వడు వినడో వాడు నాయాజ్ఞను పొంది యమలోక మందు సూర్యచంద్రులున్నంతవరకు నరక బాధలను పొందును. మాఘవ్రతాచరణుడై భక్తితో సాలగ్రామమందువసించు నన్ను పూజించి నాపాదోదకములు పానము చేయునో అతడు పరమ పవిత్రుడగును. అజ్ఞానముచేత నట్లు చేయక యుండువాడు నరక కూపమును బడును. నాపూజాప్రసాదము నెవడు శిరసావహించునో

వానికి నరక బాధ లేదు, మునివరుడగును. అందువలన ఈ వ్రతము మిక్కిలి మహిమగలది. మీమీదగల దయచేత నేనింతవరకు యీ మాఘ మహిమను మీకు చెప్పితిని. గాన మీరు పద్మపర్వత గుహా యందున్న గాడిద ముఖము గల ఇంద్రుని యొద్దకు బొండు, నాచే మీకు చెప్పబడిన యీ వ్రతమహిమను ఇంద్రునకు చెప్పుడు. అతడు తుంగభద్రా నదీజలమందు స్నానము చేసి, మంచి ముఖము గలవాడై, పుణ్యవంతుడు కాగలడు అని విష్ణుమూర్తి చెప్పి అంత ర్థాన మందెను. దేవతలు ఇంద్రుని వెదకుచు, పద్మపర్వతమునకు బోయి యింద్రుని నచ్చట వెదకుచుండిరి.

ఆ పద్మపర్వత గుహాలందు దేవతలు యింద్రుని కొరకై వెదకుచు ఆ యొద్దున పెద్దశరీరమును, చిన్నతోకను, చిన్నపాదములును, చిన్న కండ్లును గల తొండను జూచిరి. తొండకూడ మంద బుద్ధిగలదై పాషాణమువలె కొంచెమైనను, చలింపక యుండెను. దేవతలాతొండ సమీపమునకు వెళ్ళునప్పటికి ఆ తొండ అమితమైన గంభీరధ్వని మేఘనిస్వనమువలె ప్రసారించెను. దేవత లాశబ్దమునకు తొండను రాక్షసునిగా భావించి భయపడిరి. కాని కొందరు కొంత సేపటి కిది తొండ యగును గాని రాక్షసుడు కాడనిరి. దేవత లా ఘన శరీరము గల భయంకరమగు తొండను పర్వతలోయలో పల్ల మునం దుండుట చూచి యాశ్చర్యమొందిరి. దానికి పుణ్యకాలము ఆసన్నమగుటవలన దేవతలు తీగెలతో తొండను కట్టసాగిరి. బల వంతముగా దానిని కట్టిరిగాని ఘనమైన యా తొండను వారు కదల్చ జాలకపోయిరి. పిమ్మట దేవతలు ఆ తొండను యెన్ని విధములుగ నైనను కదల్చ లేక ఒకరి కొకరు ఆలోచించుకొని శ్రీహరి చెప్పిన రీతిని తుంగభద్రా నదీతోయములతో మహాసంతోషముతో నా తొండ కభిషేకము చేసిరి.

అంతట నా తొండ దేహము మాఘస్నానమువలన మాయమై దివ్యమైన భూషణములచేత అలంకరింపబడిన స్త్రీ రూపమును పొందెను. పిమ్మట ఆ సౌందర్యవతి దేవతల సన్నిధికి వచ్చెను. దేవతలా సౌందర్యవతిని చూచి ఆశ్చర్యమును పొంది నీ వెవతెవు అని యడిగిరి."

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు పదునొకండవ అధ్యాయము.

—0—

## పండ్రెండవ అధ్యాయము

గృత్స్నమదముని జహ్నుమహర్షితో చెప్పుచున్నాడు. దేవత లీవిధముగా ఆ సుందరవనితను అడుగగా నామె పరమానందముతో దేవతలారా! నా చరిత్రమును శాంతముగా వినుడు. చెప్పెదనని యీ రీతిగా చెప్పనారంభించెను.

నేను కాశ్మీరదేశమున సుశీలుడను బ్రాహ్మణుని కూతురను. నా తండ్రి నన్నొక విప్రునికి పెండ్లిచేసెను. ఆ పెండ్లి నాల్గవ దినమందె నా భర్త పిడుగుపడి చనిపోయెను. నన్ను జూచి నా తలిదండ్రులు విచారించిరి. పిమ్మట పండితుడైన నా తండ్రి విచారమానసుడై మనుష్యజన్మమే కష్టము అందున ఆడుజన్మ మిక్కిలి కష్టము, అందును బాల్యమందు వైధవ్యమును పొందుట మిక్కిలి కష్టము. భర్తలేని పుత్రికను చూచుచుండుట బహు దుఃఖభాజకమై యున్నది. గాన నేనీమెను నా బంధువులయొద్ద నుంచి, నేను అరణ్యములందు ఉండగలను. అని తలచి, కుమార్తెను బంధు

వులయింట విడచి తానును భార్యయు అరణ్యమునకు పోయిరి. అట్లు కొంతకాలము గడిపి పిమ్మట యోగముచేత తన శరీరమును విడిచి మోక్షమును పొందెను.

నేను బంధువుల యింటనుండి సదా కష్టజీవినై కుమారులుగాని, స్నేహితులుగాని, బంధువులుగాని, సహాయులుగాని, లేక నిత్యము భిక్షాటనము చేసి జీవితమును గడుపుచుంటిని. అందువలన శుచియగు యన్నమును తినజాలకుంటిని. ఎప్పుడును చల్దియన్నమును తినుచుంటిని. చిల్లరగా వస్తువులను కొని అమ్ముటవల్ల కొద్దిగా సొమ్ము సంపాదించితిని. ఎప్పుడు నౌకరు తినగా మిగిలిన దానినే తిని సంతుష్టిపడుచుండెను. నే నెప్పుడును ప్రాతఃకాలమున స్నానముచేయలేదు. చల్దియన్నము తప్పక తినుచుంటిని. శ్రీహరిని యెన్నడును స్మరించలేదు హరికథ వినుటయనగా నేమో తెలియనే తెలియదు. కలలోనైనను పుణ్యతీర్థసేవ చేయలేదు. జిహ్వాచాపల్యము గలదాన నగుటచే నేకాదశీతిథియందైనను నుపవాసముగాని, ఏకభుక్తముగాని చేయలేదు. హరిభక్తు లేకాదశీవ్రతమాచరించి జాగరణము చేయుచున్నంత నేను వారిని జూచి పరిహసించి నిందించుదానను. నాకిష్టులగువారు నన్నుధర్మమును పుణ్యమును చేయమని చెప్పిన అట్లు చేయకపోవుటయేగాక మాయోపాయముచే వారిని తప్పించి కోపముతో తిట్టుచుండెడిదానను. తిరిగి వారు నన్ను దిట్టెడివారు. ఇట్లు రాత్రింబవళ్ళు అనేకరీతిగాధనమును సంపాదించితిని గాని యితరులకు కొంచెమును ఉపకారమును చేయలేదు. దానధర్మములు చేయలేదు. ఈవిధముగా క్షాన్నమును తిని ధనమార్జించి, ఆ ధనమును పెంపొందించి సంతోషముగానుంటిని. విధవనైనను తలవెంట్రుకలను పెంచుకొని నాయిచ్చవచ్చినట్లు స్వేచ్ఛానువర్తినై తిరుగుచుంటిని. తెల్లని వస్త్రమును కట్టుకొని

ప్రతియింటికి తిరుగుచు సంతోషముతో సరసములాడుచు, మన్మథ బాధాపీడితురాలనై కామకేళీలాలసనై జారిణి నయితిని.

నేను కామోద్రేకముచే యౌవనవంతుడగు నొక వైశ్యుని జూచి కామించి వానితో రహస్యముగా అందగాడా! నాతో రమింప గోరితివేని యీ రాత్రి నాయింటికి రమ్ము అందుకు అభ్యంతరము లేదు. అని చెప్పగా నాకోమటియు రాత్రి నాయింటికి వచ్చెను. ఆ రాత్రియంతయు మన్మథోద్రేక జనితములగు పలుకులచేత సరససల్లాపములాడుచు తనివిదీర నాతనితో సంభోగించితిని. విధవనయినను కామోద్రేకముచే నట్లాచరించి రాత్రి యంతయు క్షణముగాగడిపితిని. రహస్యముగా సంచరించు నాకోమటి సూర్యోదయము కాగానే తనయింటికి వెడలిపోయెను. ఉదయమందు యథారీతిగా గృహకృత్యములందు జనులచేత నియోగింపబడి కాలము గడుపుచు సంతృప్తిని పొందుచుంటిని. ఈరీతిగా ప్రతి దినమందును అనేకులగు పురుషులతో రమించి వారివలన ధనమును గ్రహించి సంతుష్టిని జెందుచు కాలము గడుపుచుంటిని, సుఖమునిచ్చు మంచిపని చేయక ఆచార కర్మలను చేయక, స్నానదాన ధర్మము లాచరింపక తాత్కాలిక సుఖప్రదమగు నిందిత కార్యములను చేసితిని. నిత్యము హరికథా సక్తుల నిందించుదానను ఇట్లుండగా కాలక్రమమున నేను చనిపోతిని. నేను యమలోకమునకుపోయి అచ్చట చెప్పరాని క్రూరమైన బాధలను అనుభవించి ఆ దోషమువలన మూడు సారులు పులిగా జన్మించితిని.

క్రమముగా మూడుసార్లు కోతిగాను, అయిదు సార్లు యెద్దుగను. నూరుసార్లు ఆడుదాననై భర్తలేని దాననైతిని. పిమ్మట యెనిమిదిసార్లు కుక్కనై నాలుగువందలసార్లు పిశాచమునయి, మరి నాలుగువందలసార్లు కాకి, గుడ్లగూబ, కీటకము, పక్షి, పిమ్మట నూరు

సార్లు పాముగాను, రెండువందలసార్లు నక్కగాను పుట్టితిని. మూడు వందలసార్లు పూరపందిగను, నాల్గువందలసార్లు ముంగిసగను, ఐదు వందలసార్లు పిల్లిగను, ఆరువందలసార్లు ఎలుకగాను పుట్టితిని. దేవతలారా! ఇప్పుడు మీరు చూచుచున్న యీ తొండరూప మిదివరలో వెయ్యిసార్లు యనుభవించితిని. ఇట్టి నీచజన్మల నన్నిటిని యెత్తి మునిగియున్న నాకీ పుణ్యశరీరము వచ్చుటకు కారణమును చెప్పెదను వినుము.

ఇట్లు నేను బాలవితంతువయి బాధపడు స్త్రీ జన్మల నెత్తి, మహావైశాఖ మాసమునందు పగలు పన్నెండు గంటలకు ఒకానొక పర్వదినమందు మార్గాయాసమున బడలివచ్చిన ఒక బ్రాహ్మణునకు నాయింట గల చల్దియన్నమును భోజనము పెట్టితిని. ఆ కారణము చేతనే మీరిట్లు అనుగ్రహించి, నాకు కలిగిన దుర్యోని దోషముల నుండి తప్పించి ముక్తి నికలుగ జేసిరి, జహ్నుమహర్షీ! దేవత లిట్లామె పలుకులు విని యాశ్చర్యమును పొందిరి. పిమ్మట నామెను వారిలో నొకరు పెండ్లాడిరి. పాపపరిపూర్ణయగు శరీరముకల నాతొండ మాఘ మాసమున నీటిబిందువులచేత ఉదయమందు తడుపబడుటచే, ఆశరీరమును విడిచి దివ్యమైన సుందర స్త్రీరూపము దాల్చి దేవతాప్రియురాలాయెను. ఇంతయు గూడ మాఘస్నాన మహిమయని తెలియవలెను. పిమ్మట దేవతలు తిరిగి దేవేంద్రుని వెదకసాగిరి. ఇంద్రుడు పద్మపర్వత మందుగల గుహనుండి గాడిదవలె కూయుచుండెను. ఆ యార్పు విని దేవతలు ఇంద్రుడచ్చట నుండెనని వెళ్ళిరి. గుహలో నుండి బయటకు వచ్చి, గాడిద ముఖముతో నిలబెట్టిన చెవులతో ముఖము నెత్తి యార్చుచున్న యింద్రుని జూచిరి.

కొందరు విచారించిరి. కొందరు నవ్విరి. గొందరు దేవతలకు అధిపతియయ్యు, తమకు ప్రభువగు యింద్రుని జూచి యేమియు ననలేక

యుండిరి. గాడిద ముఖముతో నున్న ఇంద్రుడును దేవతలనుజూచి సిగ్గుతో మరల గుహలోనికిపోయెను. సిగ్గుచేత ఇంద్రుడు తన పాపమును తలంచుకొనుచు, విచారముతో వారిని చూడలేక గుహలో నుండగా దేవతలు ఇంద్రుని వెంబడించి పరుగెత్తిరి. ఇంద్రుడు వారికి కనిపించక యా గుహాంధకారమున అదృశ్యుడయ్యెను. కాని దేవతలు వెదకి ఇంద్రుని గుర్తించి. ఇంద్రా! మేము దేవతలము. నీకు భయములేదు. నీపాపకారణమును శ్రీహరివలన తెలిసికొని నీ గాడిదముఖమును పోగొట్టి నీకు సుఖమును కలిగించుటకు సంకల్పించి నిన్ను వెదకుచు నిచ్చటకి వచ్చితిమి. అని చెప్పి, దగ్గరకుపోయి ఇంద్రుని బట్టి వారందరును కలిసి గుహబయటకు వచ్చిరి.ఇంద్రుడు శక్తిలేక బహుకష్టముతో గాడిదముఖముతో సిగ్గుచే తలవంచుకొని నెమ్మదిగా తుంగభద్రా నదీసమీపమున జేరెను. మకరరాశియందు సూర్యుడుండగా మాఘమాసమున శుద్ధపాడ్యమి మొదలుకొని పాపములను పోగొట్టు ముప్పది దినములును, పాప నివారణముకై, ఇంద్రుడు దేవతలతో గూడుకొని తుంగభద్రా నదీతోయములందు స్నానము జేసెను.

దేవేంద్రుడు ఈ స్నాన ప్రభావము వలన బ్రాహ్మణుని శాపమునుండి విముక్తుడై, పాపమునుండి విడివడి, గాడిదముఖమును విడిచి సుముఖము గలవాడై యుండగా దేవతలందరు ఆతనిని జూచి మిగుల సంతోషముతో నాతనిని పొగడిరి. అప్పుడు ఇంద్రునకు స్వర్గమునకు పోగల్గిన శక్తి కలిగినది. అందువలన ఇంద్రుడు తన దేవతాసమూహముతో స్వర్గలోకమునకు వెడలెను. జహ్నువింటివా ఈస్నాన మహిమవలన వికారవదనుడైన దేవేంద్రుడు పాపవిముక్తుడై వికారవదనమును వదలెను గాన నీ మాసమహిమను

నీకు చెప్పితిని. ఈ మాసమునందు స్నానముచేసిన పుణ్యాత్ములు యీ లోకమందు అనేక సుఖములను అనుభవించి అంతమందు శ్రీహరి సాన్నిధ్యమును జేరుదురు. ఈ కథ వినువారికి చదువువారికి గూడ అమితమైన ఫలము గలదు. పూర్వకాలమున పంపానదీతీరమున భయంకరాకారుడైన ఒక పిశాచము యీ మాసముయొక్క మహిమను దెల్పు పురాణమును విని పాపవిముక్తుడాయెను.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున పన్నెండవ అధ్యాయము.

---

## పదమూఁడవ అధ్యాయము

"జహ్నుమహర్షి, గృత్సమదమహాత్మా! నీవలన శ్రీహరి కథామృతమును విని తనివితీర తృప్తిజెందితిని. ఇంకను వినవలెనను, యాశకల్గుచున్నది. గాన ఆ మాఘమహిమను దెల్పుము. ఆ పిశాచ మెవరు? అతడెట్లు యీ మహిమను వినెను? ఎట్లు పంపానదీ తీరమున అతడా పిశాచ జన్మమునుండి విముక్తుడయ్యెను? అని యడుగగా గృత్సమదు డిట్లు చెప్పసాగెను.

పూర్వకాలమున పంపానదీ తీరమున సమస్తమైన రాజులకును ఆశ్రయమైన పంపానగరమున మక్కాలి ధనవంతుడైన వైశ్యుడొక డుండెను. అతడు కాలక్రమాగతుడై మరణించి యమపురికి జేరెను. ఆ వైశ్యుడు జీవించి యున్నంతవరకు యెన్నడును యెవరికి తన స్వార్జిత ద్రవ్యమునుండి సత్పాత్రదానము చేయలేదు. ఆ దోషము చేతనరకమునకుపోయి, తరువాతభూలోకమునగర్భదరిద్రుడై పుట్టెను.

దరిద్రుడగుటచేత తిరిగి అనేక పాపములు చేసెను. అందువలన అతడు మిక్కిలి పాపాత్ముడై యుండెను. ఆ దోషముచేత వాడు పిడుగుపడి చచ్చెను. చచ్చిన పిమ్మట అతడు ఆ పంపానదీతీరమున ఒక మఱ్ఱి చెట్టుమీద పిశాచమై ప్రజలకు భయమును కల్గించుచుండెను. భూలోకమున తిరుగునట్టియు, ఆకాశమున తిరుగునట్టియు భూతము లను తినుచు, కొంతకాలము ఆ పిశాచ రూపముతో తిరుగాడు చుండెను. ఇంతలో బ్రహ్మమానసపుత్రుడైన వసిష్ఠమహర్షి తన శిష్యులతో సహా పంపానదీజలములందు మాఘమాసములను చేయ సంకల్పించి వచ్చెను. మాఘమాసమున ప్రాతఃకాలమున వసిష్ఠుడు స్నానముచేసి నిత్యకర్మల నాచరించి శుచియై కల్పోక్తరీతిని విశ్వ దేవుడైన విష్ణువును ప్రార్థించి ఆ సమీపమున శిష్యులను గూర్చుండబెట్టి మాధవకథాసంవిధానమగు మాఘపురాణమును చెప్పదలంచి వారి కెదురుగా గూర్చుండి పురాణమును చెప్పనారంభించెను.

ఏ నరుడు ఈ మాఘమాసమున సూర్యుడు మకరరాశియందుండగా సూర్యుడుదయించుచుండగా ప్రాతఃకాలమున స్నానము చేయునో వాని పాపములన్నియు సూర్యోదయమున చీకటు లంతరించునట్లు నాశనమగును. పూర్వసంచితములు, యిప్పుడు సంక్రమించినవి కూడ నశించును. ఎవడట్లు మాఘస్నానమును చేయడో వాడు నరక లోకమునకు అతిథిగా వెడలుచున్నాడు. యజ్ఞయాగాదిసమస్తకర్మలను విడిచిపెట్టినను, మాఘస్నానము చేసినమాత్రమున నే మాధవలోక మును చేరును. ఈరీతిగా వసిష్ఠుడు శిష్యులకు మాఘపురాణమును చెప్పుచుండెను. మఱ్ఱిచెట్టు క్రింద వసిష్ఠుడు చెప్పుచున్న పురాణమును చెట్టుపైనున్న పిశాచము విని పుణ్యపరిపాకముచేత మఱ్ఱిచెట్టునుండి దిగి వసిష్ఠునిముందర నిలిచెను. మరియు తనపూర్వజన్మవృత్తాంతము

నంతయు సవిస్తరముగా జెప్పెను. వశిష్ఠుడతనిం జూచి యాశ్చర్య మందెను. ఆ రాక్షసుని పాపపరిహారార్థము వసిష్ఠుడా పంపానదీ జలమందు వానిని రెండుగడియలకాలము దర్భలచేత స్నానము చేయించెను. ఆమాఘస్నాన ఫలితమువలనను హరికథా శ్రవణము చేతను ఆపిశాచము పూర్వజన్మార్జితమైన సమస్త పాపములచేత విముక్తుడై, శ్రీహరి అనుగ్రహముచేత దివ్య శరీరమును దాల్చికోటి భాను సందీప్తమైన వైకుంఠమును జేరును. ఈలోకమున నెవరు హరికథలను విందురో, తెలియుదురో, చెప్పెదరో, అభ్యసింతురో హరిపాద పూజానిరతు లగుదురో, హరిపూజలను చేయుదురో, సత్కర్మల నాచరింతురో, సాధుకార్య చరణులో నట్టివారందరును హరి పదమును పొందుదురు. శ్రీహరియు వారికి తనఅంశనొసంగును.

యోగములోనగు అనేక మంచికర్మల ఫలితమును బ్రహ్మ హత్య మొదలగు పాపములను, నశింపజేయునదియు, తీర్థస్నానాది సర్వపుణ్యఫల తుల్యమును, పుణ్యప్రదాయినియు, పుణ్యప్రాప్తి నిచ్చునదియు సచ్ఛీలము నొసంగునదియు, నిత్యానందదాయియు, దేహాభిమానములను త్యజించి ఆనందించువారికి సుఖము నిచ్చు విష్ణు కథలను విననిమూర్ఖుడు నరకలోకమున శాశ్వతముగా నుండును. మాట, వర్ణము, ఛందము లేకపోయినను సల్లక్షణ శూన్యమైనను కథ అందముగా లేకపోయినను, విభేదముగానున్నను, సందేహాస్పద మైనను, శ్రీహరి నుద్దేశించిన శ్లోకముగాని గద్యముగానిపుణ్యమును గోరువారిచేత సదా వినదగినదై యున్నది. జననమరణ రూపకమైన సంసారాంబుధియందు తరంగపరంపరలచే మునిగితేలుచు, ఆధార మేది? తరించుట యెట్లు! ఉపాయమేది? కష్టమెంతటిది? అని విచార క్రాంతులగు వారికి అతి సుఖప్రదమును, వినుటకింపగునదియు, నగు హరిసత్కథా కాలక్షేపము ముఖ్యము, హరికథను విననివాడు బ్రహ్మ

హత్యాపాతకునివలె క్రూరనరకమునుపొందును. కాబట్టి సుఖమును గోరు నరుడును, పాపనివారణమును, కోరు నరుడును, పుణ్యప్రదమగు పురాణపురుషుని కథను పఠించు చుండవలెను. శ్రీహరి కథలను తిరస్కరించువాడును ఆకథయందు సుముఖత లేనివాడును, అగు నరుని ముఖమును చూడగూడదు. అట్లు చూచుట సంభవించెనేని వెంటనే సూర్యునిముఖము చూడవలెను. ఏనరుడు సంతోషముతో శ్రీహరికథలను వ్రాయునో వ్యాఖ్యానము చేయునో. ఉపన్యసించునో చదువునో, వినునో వాడు సాక్షాత్ శ్రీమన్నారాయణదేవుడనియే తలంచవలెను. నిమిషముగాని అర్థనిమిషముగాని శ్రీహరి కథను విని యానందించువాడు సౌఖ్యవంతుడగును. విశేషించి చెప్పిన ఫలము లేదు. ఇదే మాఘ రహస్యము.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు పదమూడవ అధ్యాయము.

—0—

## పదునాల్గవ అధ్యాయము

గృత్సమదుడు చెప్పుచున్నాడు. "విప్రోత్తమా! పూర్వ కాలమున మార్కండేయ మహర్షి చెప్పిన క్రమము నీకుచెప్పెదను వినుము. తొల్లి సమస్తమైన మునీశ్వరుల చేతను సేవింపబడు చున్న గోమతీ తీరమున గల నైమిశారణ్యమందు మునులు తమతమ గొప్పతనమును చర్చించుకొనుటలో వాదోపవాదములు పెరిగి కలహము కలిగెను. ఆనైమిశారణ్యము యెట్టిదనగా చెప్పెదను వినుము. కదంబములతోడను, కడప ఇప్పమూకుల తోడను, హరీతక

హింతాళ భూజములతోడను, మద్ది, పనస, చంపక, అగరు తరువుల తోడను, గుగ్గిలపుచెట్లతోడను, తాటిచెట్లతోడను, ఆమ్రాతక శిరీష గిరిమల్లిక తమాల పిప్పలవృక్షములతోడను,లికుచ పాదపములతోడను చంద్రచెట్లతోడను విరాజిల్లుచుండెను. మరియు నా వనము నానా విధతరులతాగుల్మ నికుంజ సంతాన విలసితమై సమస్త ప్రాణులకు సుఖాశ్రయ జీవనాధారమై యుండును. అట్టిప్రశాంతమగు వనమందు మునిబృంద మంతయు జేరి పరస్పరము నాధిక్యతనుగూర్చికలహించిరి. మొదట భృగుమహర్షి నేను తపోనిష్ఠుడను యోగీశ్వరులలో నేను మొదటివాడను. గాన నే నధికుడ ననెను. అంత గౌతముడు లేచి నేను వయస్సుచేత పెద్దవాడను గాన నే నధికుడనని పలికెను.మరియు నేను బ్రహ్మకల్పమును జూచితి ననెను. రోమసుడు నేను మునులంద రికి గురువును, నాతో సమానుడీలోకమున లేడనెను.

అంతలో వృద్ధుడైన గార్గ్యుడులేచి నీరసధ్వనితో నేను పూజ నీయుడను చాలాకాలము శాస్త్రములను చెప్పుటవలన నాతో సమానుడు లేడు. మాండవ్యుడా వెంటనే లేచి, నేను కాలక్రమాను గతమగు కర్మలను ప్రవర్తింపజేయువాడను. సత్కర్మలను చేయుట యందాశక్తి గలవాడను సర్వశాస్త్రముల యందును పండితుడను గాన నే నధికుడనని పలికెను. అంత శంతనుడు కండ్లెఱ్ఱజేసి, నేను యోగాభ్యాసమునందు పరిపాటి కలవాడను. సమాధియందున్న వాడను. ఆత్మజ్ఞానము కలవాడను, గాన నాతో సమానుడీ ముని సంఘమున లేడు. పౌలస్త్యుడు లోలోపల మండుచున్న క్రోధాగ్ని ప్రజ్వలింపగా నేను వేదశాస్త్రముల అభ్యాసము గలిగి, పెద్దలచే పూజింపబడువాడను గాన నే నధికుడనని బలికెను. శౌనకుడు తొందరగా లేచి నేను ఆత్మజ్ఞానము కలవాడను, మునులచేత పూజింప దగినవాడను, గాన నాతో సమానమైనవాడు లేడని పలికెను. ఇట్లు

మునులందరును, ఒకరినొకరు వాదించుకొనుచు, కలహమును కలిగించుకొని, కోపముతో యుద్ధసన్నద్ధులైరి.

మునిశ్రేష్ఠా! వినుము. అందులో కొందరు మునులు వెంటనే ఆ భృగుమహర్షిని సమీపించి జటలను పీకి, ముష్టితో పొడిచిరి. కొందరు గౌతముని గడ్డమును పీకిరి. గౌతముడతి తొందరతో వారిని వడివడిగా పిడికిటచేత పొడిచెను. ఆ పిడికిటి పోటుచేత బాధనొంది కళ్ళనుండి నీళ్ళుకార్చుచుండిరి మిగిలిన వృద్ధులైన గార్గ్యమాండవ్య. మునులు తమ ప్రతిపక్షుల కౌలువలు మొదలగువాటిని చింపివేసిరి. కృష్ణాజినము, ఛత్రమును, కౌపీనమును, కమండలమును, కోపము చేత పిండిగుండగా చేసిరి. ఒకరిదండము నొకరు విరిచిరి. విప్రులు గాన దండము, అజినము, పిడకళ్ళు, ధోవతలు, దర్భ త్రాళ్ళు, మొదలగు యుద్ధపరికరములతో నొకరినొకరు బాధింపుచు యుద్ధము సలిపిరి. ఆ మునులు రజోగుణ స్వభావము గలిగి శ్రీహరి మాయా వశులై దేహాభిమానము గలవారయి, అజ్ఞానులవలె ప్రచండమైన యుద్ధమాడిరి. ఇట్లుండగా కలహాశనుడయిన నారదమునీంద్రుడచ్చటికి వచ్చి మిక్కిలి యెక్కువగా వారిని యుద్ధమునకు పురిగొల్పి యీ విషయమును విష్ణువునకు తెలియజేయుటకై వైకుంఠపురమునకు వెడలెను. అచ్చట నారదుడు శ్రీహరికీవృత్తాంత మంతయు తేట తెల్లముగ తెలియబలికెను.

శ్రీమహావిష్ణువు నారదుని మాటలను విని, నాయనా! నా మాయచేత యజ్ఞానమున మునిగి, కలహమున దగుల్కొని పరస్పరము యీర్ష్యాలంపటులై చరించు మునులకు ఆ వనమందు ఉపాయముచేతనే ఆ కలహమును పోగొట్టవలయును. కాని వేరురీతిని నివారణ కాజాలదు. కాబట్టి వారికి జ్ఞానముకలుగుటకు నాకు ప్రేమాస్ప

దులగు సనకసనందన సనత్సుజాతులను వారిని అచ్చటకు పంపెదను. వారు సదా పంచవర్షవయస్కులుగా నుందురు. వారు బాలురు గానే యుందురు. వారిబాల్యమందే నాల్గుయుగములును ప్రభవించి యంత మొందుచుండును. వీరితో బాటు గొప్ప మేథావియు వృద్ధుడును అగు మార్కండేయమునిని గూడ బంపెదను అతడు సమస్త మహాకల్పాంతరజీవి. వృద్ధుడు, సజ్జన ప్రియుడు, నారదా! ఆముని బృందముండు సభయందు మార్కండేయునకును సనకనందనాదులకును వివాదము జరుగగలదు. నీవుకూడ నచ్చటికిపోయికొంతము చూచుచు నుండుము అని బలికెను. శ్రీహరియాజ్ఞ యాగుట వలన నారదుడతి తొందరగా నావాదమును వినగోరి నైమిశారణ్యము నకు జనెను.

మార్కండేయుడు శ్రీహరిచేత పురికొల్పబడినవాడై ముని సంఘము కడకువచ్చి మంచిశాంతవాక్యములచేతవారి నోదార్చెను. ఆ కలహాకర్ములగు మునులు మార్కండేయుని యాశీర్వాద ప్రభావముచే పాములవానిచే సర్పము చతికిల బడినట్లు యూరకుండిరి. కొంతసేపటికి బ్రహ్మజ్ఞాన సంపన్నులును భగవంతుని ధ్యానమందు ఆసక్తిగలవారును, అగు సనకసనందనాది మునులు గంభీరస్వరముతో శ్రీహరి నామమును కీర్తించుచు, సూర్యసమాన తేజస్సుతో నటకు వచ్చిరి. దూరమందేవారినిచూచి మేథావంతుడై నమార్కండేయుడు తొందరగా తన యాసనమునుండి లేచివారి నెదుర్కొని అర్ఘ్యపాద్యాది విధులచేత పూజించివారి పాదములకునమస్కరించి, పాదములను కడిగి ఆపాదోదకమును శిరస్సున జల్లుకొనెను. ఈ రీతిగా జేయుచున్న మార్కండేయుని జూచి సనకాదులాసభలో మార్కండేయునితో నిట్లు బలికిరి. నీవు వయసుచేతవృద్ధుడవు. మునీశ్వరులలో ప్రముఖుడవు. ముని శ్రేష్ఠుడవు. సప్తమహాకల్పముల

వరకు జీవించియుందువు. బ్రహ్మాది దేవతలందరికిని స్తుతిపాత్రుడవు. అట్టినీవు యీసభలో మాకు అర్ఘ్య పాద్యముల నేల నొసంగితివి? వయోవృద్ధుడవయిన నీవు బాలురమైన మాకు అర్ఘ్యపాద్యాది విధియుత నమస్కారము లొనర్పగూడదని శ్రుతులందు చెప్పబడి యున్నది. మేము అయిదు సంవత్సరముల వయసుగల బాలురము. మీరు వయోవృద్ధులు సప్తకల్పజీవులు. అట్టిమీరు మాకు నమస్కరింపవచ్చునా? అనుచు సనకసనందనాదులు మార్కండేయునితో బలికిరి. (కృతత్రేతా ద్వాపర కలియుగములు మహాయుగమగును. బ్రహ్మకు అట్టి మహాయుగములు వేయి ఒక పగలును, వేయి ఒక రాత్రియును యగును. అట్టిదివ్యదినములు మూడువందలఅరువది ఒక బ్రహ్మవత్సరమగును. బ్రహ్మకు ఆవిధమైన నూరు వత్సరములు ఆయుష్కాలమగును. పిమ్మట బ్రహ్మాదులు నశింతురు. అదియే మహాకల్పము. ఇట్టివి ఏడు మహాకల్పములు మార్కండేయుని ఆయుష్కాలమని తెలియందగును.)

ఆనైమిశారణ్యమున ఆమునీశ్వరుల సభలో ఆసనకసనందన సనత్సుజాతులతో మార్కండేయుడు నిజమగు పలుకులతో నిట్లు వచించెను. శ్రీహరికీర్తనపరాయణులైన మునివల్లభులారా! మీరు సదా యితరవృత్తులను త్యజించి భగవంతుని నామకీర్తనము గావించుచుందురు. గాన వినుడు చెప్పెదను. సర్వప్రాణికోటికిని ప్రతిదినమందును చిన్నదయిన తూటుగల మృణ్మయపాత్రనుండిజారు నీటి బిందువులవలె ఆయుష్కాలము తగ్గుచునేయుండును. ఇరువదిరొక్క మహాకల్పము జీవించినను మరణము నిశ్చయము. ఇందసత్యము లేదు. ముదుసలియైనను వేదశాస్త్రాభ్యసనము గావించినను కర్మనిరతుడైనను, సమాధియుక్తుడైనను, తపోధనుడైనను, మాత్ర మేమిఫలము! జ్ఞానము లేకయుండిన చిరంజీవియైనను లాభము లేదు. వ్యర్థముగా జీవితకాలము గడపుటవలన దుర్మతుల జీవితము దుర్లభ్

యోజనము జ్ఞానము కలుగుట దుర్లభము. జ్ఞానమును సంపాదించువాడు శ్రేష్ఠుడుగాని, వృధాగా కాలము గడుపు వృద్ధుడు అధికుడు కానేరడు. ప్రాణికి నాశనకాలము సంభవించినపుడు లోకభయమును పొంది పై లోకమందు మంచి చెడ్డలకు ఫల మనుభవించి తిరిగి దేహధారియై యీ లోకమునకు రాగలడు. గాన నిత్యము కాని యీ శరీరము ధరించి శ్రీహరి కథలను వినక కోటికల్పములు జీవించినను లాభము లేదు. అట్టిజీవితము వ్యర్థము. శ్రీహరి కథాసల్లాపములచేత జీవించువాని జీవితము ఫలప్రదమైనది. నిమిషమైనను, సగము నిమిషమైనను, కాలము వ్యర్థపుచ్చక విష్ణుకథల నాకర్ణించువారు, మునులకంటె మిన్నగా పూజింపదగినవారు. మీరందరును రాత్రియు బవలును కూడ శ్రీహరి ధ్యానమందును, పూజలందును కథలను వినుటయందును, చెప్పుకొనుట యందును, పాదధ్యానమందును, హరినామ సంకీర్తనమందును. కాలమును గడుపుచుందురు. అందువలన పుండరీకాక్షుడు మీహృత్పుండరీకములందు నిండార నిత్యనివాసము చేయును. మే మొక క్షణమైనను శ్రీహరి కథలను వినలేదు. విష్ణుకథ విననివాడు వయోవృద్ధుడైనను జ్ఞానము లేని బాలునితో సమానము. శ్రీహరి కథాసక్తుడైన బాలుడు, వయస్సుచేత చిన్నవాడైనను వృద్ధునివలె దేవతాపూజనీయు డగును గాన మీరు పంచవర్ష ప్రాయులైనను శ్రీహరి కథాలాలసు లగుటచే మాకు గురువులగుదురు. మేము పెద్దవారమైనను విష్ణుకథలను వినని కారణమున మీకు శిష్యులగుదుము. అనగా మాకన్న తక్కువవారము, అయిదుగురు గురువులు కలరని శ్రుతివాక్యము పలుకుచున్నది. జ్ఞానముచేత వృద్ధుడు, తపస్సుచేత వృద్ధుడు, వయస్సుచేత వృద్ధుడు, ఆత్మజ్ఞానముకలవాడు, శ్రీహరి కథలను వినుటయం దాసక్తుడు - యీ అయిదుగురు గురువులగు

దురు. మధువైరి కథామాధుర్యము మీకే తెలియును. శరీరమును ధరించినవారికి గురుత్వము, లఘుత్వము, యిదియే నిర్ణయింపదగినది కాబట్టి బహ్మమహర్షి ! యీరీతిగా మార్కండేయుడు సభలో చెప్పగా కలహామున బడియున్న మునులు తమలో తాము సణుగు కొనుచుండిరి. మార్కండేయుని పలుకులు సత్యమని సనకసనంద నాదులు పలుకుచు శ్రీహరి కథామహిమను వర్ణింపడొడగిరి.

ఏమహానుభావుడు దివ్యావతారముల నెత్తెనో అట్టి దాన వాంతకుని దివ్యచరితామృతమును ఏనరుడు పానము చేయునో, ఎవడు గంగానదీ తోయములందనగా శ్రీహరియొక్క పాదపద్మముల నుండి వెడలిన పాదోదకమందుస్నానము చేయునో, ఏనరుడు, శ్రీహరీ, దయాసింధో, కృష్ణా, విష్ణో ! వాసుదేవా ! దామోదరా ! అని సదా నామసంకీర్తనము గావించునో వాఱందరును అందఱికిని పూజనీయులు. విష్ణుపాదోదకము పావనము. అట్టిస్నానముచేత శరీరముకూడ పవిత్రము కాగలదు. శ్రీహరి సంకీర్తనవలన జిహ్వా పవిత్రము కాగలదు. స్థిరమైన శ్రీహరియొక్క ధ్యానయోగము చేత మనస్సు పవిత్ర మగును. శ్రీహరిని పూజించిన చేతులు పరమపావన మగును గాన శ్రీహరి కథలను వినువారు. సన్యాసులుగాని మునులుగాని, యోగీశ్వరులుగాని, వందనీయులు. విష్ణు భక్తిలేనినరుడు యెంత తపస్సు చేసినను వృధాయగును. భక్తిలేక చిరంజీవియైనను ఫలితము శూన్యము. విష్ణుకథలు వినని చెవులు సౌరంగములవంటివి విష్ణుదర్శనము చేయనికళ్ళు నెమలియీకలకుగల కళ్ళతో సమానము. శ్రీహరిని పూజింపని చేతులు కొయ్యాగరిటెలతో సమానము. శరీరము బూడిదతో తులయగును. శౌనకాది మహర్షులీమాటలను విని సిగ్గుజెంది విచారమును సూచించుచు మన స్సులో ఆనందమును మాత్రము వెలిబుచ్చుచు నమస్కారము

ంచిరి. మార్కండేయ సనకాది పాదారవింద వందనాదికములైన
మ్మట వారు యిట్లనిరి మేము మీచేత ఉపదేశింపబడితిమి. జ్ఞానము
సంగు విష్ణుకథను వినుటకు కుతూహలులమై యుంటిమి. గాన
ర్కండేయా! మాకు చెప్పుమని యడిగిరి. మునుల పలుకులు విని
మునుడు మొదలయిన శ్రీ హరి భక్తులెల్లరు వారిసెలవును పొంది
కుంఠము జేరిరి. అచ్చట శ్రీ మహావిష్ణువునకీ వృత్తాంతమంతయు
ప్పిరి. శ్రీహరియు; వ్యాసమహర్షియంశతో, వేదాంతము నంతను
తునకు జెప్పెను. సూతునివలన అందరును హరికథామృతమును
లిరి. పిమ్మట శౌనకాది మునులందరును పరమశాంతు లయిరి.
న గురువు ఉపదేశము లేనిదే యెట్టివాడును సుజ్ఞాని కాజాలడు.
ణులు కర్మవలన కలుగుగుణములచేత లబ్ధసంగులై అనేకరీతుల
చరించి తిరిగి జన్మస్థానమందే నాశనమగుదురు. ఈమాత్రమునకు
మువలన లాభము లేదు. బంగారమునందు కటకమకుటాదులుత్ప
మై లయించునట్లు జంతువులుకూడా ఉత్పత్తినొంది తిరిగి
యించును. అందమైన మంచి గుణశీలములు గల, వేదవేదాంగ
త్రమైన గురుపుణ్యోక్త కృపావిశేషము చే పాపములను పోగొట్టు
ండరీకాక్షుని దివ్యకథలను, విని, తేజోవంతమగు బుద్ధికలవాడై
స్తు ము క్తిని పొందుచున్నాడు.

గాన ఓ జహ్నుమహర్షీ! యీరీతిగా విష్ణుకథలనువిని పిశాచ
పమును పోగొట్టిన కథావిశేషము సుఖప్రదముగాన వేడుకతో విష్ణు
ను నీకు చెప్పితిని. ఈ కథను వినినవాడు తప్పక ముక్తిని పొందు
టకు సందియములేదు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు పదునాల్గవ అధ్యాయము

—♦—

# పదునైదవ అధ్యాయము

"ఓ జహ్నుమహర్షీ ! వినుము. శ్రీహరి కథామృతమును గ్రోలిన పిశాచి ముక్తిని పొందెనని చెప్పుటవలన శ్రీహరి కథలను వినుటయందు ఆసక్తి కలిగి మాఘమహిమను విడిచి, మాధవ మహిమను దెల్పుటకయి మునుల కలహగాధలను చెప్పితిని; శ్రీవిష్ణుదేవుని కథాలాపముల నింకను వినిపించుకథ నొకటి చెప్పెదను వినుము.

పూర్వము బ్రహ్మదేవుడు, మహేశ్వరుడు, రజోగుణము చేతను, తమోగుణము చేతను, చలించి ఒకరికంటె ఒకరు అధికుల మను అహంభావముతో కలహము పెంచుకొనుచుండిరి. నేను అన్ని లోకములకు కర్తను, దేవతలకు యీశ్వరుడను, ఈ పదునాల్గులోక ములందును నాకంటె కర్త లేడు. అని శివుడు బ్రహ్మతో పలికెను. బ్రహ్మ శివునితో అట్లనేపలికెను. ఈ రీతిగా వారిరువురును గొప్పగా కలహించిరి. ఇట్లు వేయిసంవత్సరములు గడచెను. కలహము తగ్గ లేదు. వారి గర్వమును మాపుచేయుటకు విరాడ్రూపుడును స్వయం ప్రభువును అగు విష్ణుమూర్తి ప్రత్యక్షమయ్యెను. శ్రీమహావిష్ణువు అనేకములైన సూర్యుల కాంతితో సమానమైన కాంతి గలవాడును, అనేకమైన ముఖములు గలవాడును, అనేక చేతలు గలవాడును; అనేక పాదములు గలవాడును, అనేక నేత్రములు గలవాడును, స్వయంప్రభువును, అయి అన్నిలోకములందును వ్యాపించి బ్రహ్మాండ మునకు లోపల వెలుపల యంతటను వ్యాపించియున్నాడు. తన సర్వ వ్యాపకత్వమును జూపించుటకు ప్రత్యక్షమయ్యెను. బ్రహ్మ, శివుడు విరాడ్రూపుడును, దివ్యగంధముచేత పూయబడిన శరీరము గలవా డును, దివ్యమైన అలంకారములచేతవిరాజిల్లు వాడునుఅగుశ్రీమహా విష్ణువును జూచిరి.

అనేక రీతుల విభిన్నమైన యీ సర్వ ప్రపంచమును విష్ణువు యొక్క ఏక దేహమందు యున్నది. బ్రహ్మ మహేశ్వరులు అతని చెవులయందు గలరు అట్టి మహాపురుషుని దివ్యనేత్రముతో చూచి ఒకరికంటె ఒకరు అధికులమని ప్రతిజ్ఞను చేసుకొనుచుండిరి. ఎవరు యీ మహాపురుషుని ఆది అంతమును తెలిసికొనునో వాడే గొప్ప వాడు. వాడే లోకములన్నిటికి కర్త, అధిపతి కాగలడు. ఈరీతిగా బ్రహ్మయు, శివుడును ప్రతిజ్ఞలు చేసుకొని అంతములేని అనంతుని ఆద్యంతములు చూచుటకయి బయలుదేరిరి.

సమస్త దిక్కులయందును విదిక్కులయందును, భూమండల మందును, ఆకాశమందును, సమస్త ప్రదేశములందును, వేయి సంవత్సరములు వెదకి శ్రీహరి ఆద్యంతములు గానక అలసిపోయి తిరిగి తిరిగి యథాస్థానమునకు వచ్చి ఆ బ్రహ్మయు, శివుడును యిట్లు అనిరి. వెయ్యి దివ్యసంవత్సరములు వెదకితిమి మన మిరువురము గొప్పవారము కాము, కర్తలము కాము. భగవంతులము కాము, ఈ మహాపురుషుడే ప్రపంచమునకు సృష్టికర్త. ఇతడే పోషించు వాడు. ఇతడే లయించువాడు, గుణాతీతుడును, గురువును, రక్షించు వాడును, స్వయంభువుడును, స్వప్రకాశము గలవాడును, సమస్త లోకములకు అధిపతియు, అందరు దేవతలకు అధిపతియు, అన్ని భూత ములయందును ఆవేశుడై యున్నవాడును అగు మహాపురుషుడు యితడే అని నిశ్చయపరచుకొని, వ్యక్తమైన ప్రకాశముతో, శుభ వీక్షణములు కలిగి, దయగల మనస్సుతో, విష్ణుమూర్తి యొక్క ప్రసాదముచే పొందబడిన జ్ఞానముగలవారై బ్రహ్మయు శివుడును యీరీతిగా విష్ణుమూర్తిని స్తుతిచేసిరి. విష్ణుమూర్తీ! అనంత స్వరూపా! నీయొక్క ఘనమైన, సమస్తమునకు ఆధారమైన ఆది స్వరూపమును, కోటిసూర్య ప్రభాభాసమాన తేజోవిరాజమాన

స్వరూపమును గలిగి దేవతలకు ప్రభువై, సకలముని మనోనివాసమై పద్మపత్రములవంటి కండ్లుగలవాడవై ప్రకాశించు నీ దివ్యస్వరూపమును మాకు ప్రత్యక్షముగా ప్రసాదింపుము. ప్రపంచమునకు ఆత్మరూపివై, బ్రహ్మ, శివ సురవర శ్రేణికి పూజనీయుడవై, నాల్గు వేదములచేతను కొనియాడబడుచు; పండిత ప్రకాండులచే స్తుతింపబడుచుండు నీకు వందనములు. శ్రేష్ఠమైన మంత్ర, తంత్ర, యంత్ర బీజ స్వరూపమై ప్రకాశించు నీ పాదసరోజములను సేవించువాడు నీ సన్నిధానమును చేరగలడు. శ్రీహరి! నీవు త్రిలోక సంరక్షకుడవు. అంతములేని తేజముగలవాడవు. అనంతరూపుడవు. గురువునకు. పరమగురువువు ఎవరు ఏమి యడిగిన దానినియివ్వగలవాడవు. ఘనమైన సముద్రమునం దుద్భవించిన తులలేని రత్నమువంటివాడవు. త్రిమూర్తి స్వరూపా! దేవతలచేతను రాక్షసులచేతగూడ పూజింపబడువాడవు, సన్మార్గుల యొక్క మనోవాంఛలను దీర్చువాడవు, స్వర్గలోక నివాసము గలవాడవు, మృష్టాన్నయమృతమయ భోక్తవు. సురాసుర ప్రభువువు. పద్మనేత్రములుంగల మహాదేవా! లక్ష్మీదేవికి భర్తవై, రహస్యరక్షకుడవై, స[illegible]స్త ప్రాణికోటియొక్క మనోగమనుడవై. పంచముఖరూపుడవై నాల్గు ముఖములు గలవాడవై, స్థావర జంగమముల కధిపతివై వెలుగుచుందువు. నీవే అగ్నిదేవుడవు, సూర్యుడవు వాయుదేవుడవు. యముడవు, కుబేరుడవు, దేవతలకు అధిపతియగు దేవేంద్రుడవు. ఆది పురుషుడవు. నీవే ఈ విధములగు సృష్టిని చేయుచున్నావు. నీవే మహదైశ్వర్యవంతుడవు. అన్నివిధములైన సద్గుణములు గలవాడవు. అన్నిటికి నిలయమైన భూలోకమునకు ఆధారము నీవే. జరిగినది, జరుగుచున్నది, జరుగబోవునది యగు కాలములందు భూతసృష్టిని గావించు ప్రభువునీవే! అట్టి నీకు నమస్కారము.

మంచిబుద్ధితో కవీశ్వరులు యోచించి ఉత్తములలో ఉత్తముడనియు పవిత్రులలో పవిత్రుడనియు, పురాణపురుషుడనియు అనంతుడ వనియు, ఆశ్రితుల కాదిదేవుడ వనియు, నిన్ను తెలుసుకొనుచున్నారు. వేదస్వరూపము నీదే. తెలుసుకొన తగినవాడవు నీవే. నీవే సర్వదిక్కులయందును గలవాడవు. నీవే ప్రభుడవు. నీవే వైకుంఠము. నీవే ఋక్కులు వేదవాక్కులు సర్వవేదములు. నదులయందు గంగానదియు, పర్వతములందు హిమవత్పర్వతము, జంతువులందు సింహము, పాములం దాది శేషువు, రత్నములందు వజ్రము, సముద్రజనితములగు వానియందు చంద్రుడవు, సముద్రములందు పాల సముద్రముకూడ నీవే! అట్టి నీకు వందనములు, లోకాధిపత్యము మాదే అయియున్నదని అనేక వేల సంవత్సరములనుండి కలహించు చుంటిమి. నీవే స్వయంప్రభుడవై దయాస్వరూపుడవై ఈ కలహమును దీర్చుటకై సంకల్పించితివి దయాసింధూ! నీ దివ్యదర్శనము చేత మాకు పరిశుద్ధమైన బుద్ధిగలిగినది. ప్రభూ! నీకు నమస్కారము. జగన్నాయకా! నీయొక్క యీ గొప్పరూపమును వదలి సామాన్యమైన రూపమును దాల్చుము. మమ్ములను దయతో జూడుము. అని పలికిన బ్రహ్మ యీశ్వరుల వాక్కులు విని విశ్వ జనకుడైన విష్ణుమూర్తి వారితో నిట్లనెను.

మహేశా! బ్రహ్మదేవా! మీ రిరువురును యింత కాలము నుండి కలహించు విషయమును విచారించి నిర్ధారణచేయుటకై నేనీ మహారూపము దాల్చవలసివచ్చెను. నాయొక్క ఆది యంతములేని దివ్యరూపమును చూచుటకు సమర్థత లేక నిశ్చేష్టులై మీ కలహమును కట్టిపెట్టి ప్రసన్నవదనులై నన్ను స్తుతించిరి. మీకు యెందుల కట్టి కలహము కలిగెనో చెప్పెదను వినుడు. దానిని తప్పించుటకు దేవేంద్రాది దేవతలకును రాక్షసులకును గూడ శక్యముకాదు.

ప్రకృతివలన సత్త్వము, రజము, తమము అను మూడుగుణములు కలుగును. ఆ గుణత్రయముచేత, పట్టబడినవారికి యేదియు కలుగ నేరదు. ఈ మూడుగుణములవల్లను కలుగు కర్మవిశేషములను చెప్పెదను వినుడు. సత్వగుణము నిర్మలమైన దైనందున శాశ్వతమైన ప్రకాశమును గలిగియుండును. ఆత్మకు సౌఖ్యకరమైన సద్గుణజాలమును కలిగించి జ్ఞానసంపాదన చేయించి పరలోకసుఖము నిచ్చును. పరమేశ్వర పరధ్యానాశక్తి కలిగించును. రజోగుణము రాగము వలనను ఆశవలనను కలుగుచున్నది. గాన ఆత్మకు యత్నముచేత కర్మసంగమము కలుగును. స్వకీయమైన రూపసంపదను మట్టుపరచి, కేవలము యిహపరార్థ కర్మలయందు ఆశక్తినికలిగించును. తమోగుణము కేవలము అజ్ఞానము వలన కలుగుచున్నది. సమస్త ప్రాణులను అజ్ఞానమున ముంచి మంచిచెడ్డ వివేకమును నశింపజేయును. తమోగుణము జడజన్యమగుటవలన ఆత్మను ప్రమాదము, బద్ధకము. నిద్ర యను దుశ్చేష్టలయందు ప్రసరింపజేయును. ప్రయత్నముచేసి చేయువలసిన కృత్యమును మరచిపోవుట ప్రమాద మనబడును. చేయవలసిన కార్యమును అశ్రద్ధచేసి యటేపోవుట బద్ధకము. బుద్ధి నశించి చేయవలసినదానిని విడిచిపెట్టియుండుట నిద్రయందురు. ఈ మూడుగుణములయొక్క కట్టుబాటు యింద్రియ సుఖములయందాసక్తిచేతను రాగోదయము చేతను, బుద్ధిమాంద్యము చేతను ప్రమాదము, బద్ధకము, నిద్రలచేతను. ఆత్మకు కలుగుచున్నది. బ్రహ్మవేత్తలు యీ మూడు గుణములయొక్క మార్పులకు లోనుగాక గుణావలంబనమువలన గుణదోషములను త్యజించి ఆత్మానుభూతి యందే యుందురు.

నేనిప్పుడు నాకోరికను దీర్చుకొనగలను. నావద్ద ధనమున్నది. నాకు తృప్తి కలుగగలదు. ఇంకను ధనము రాగలదు. శత్రువును

యాస్వాను చంపితిని, ఇంకను కొందరు శత్రువులను చంపగల్గుదును విద్యచేతను. సంపదలచేతను కూడ నేను దేవుడను, భోగసుఖములను పొందువాడను, పుత్రపౌత్రాది సంతానవంతుడను ధనవంతుడను, బలవంతుడను, సుఖవంతుడను, గొప్పవంశమందు పుట్టితిని, నాతో సరిసమానుడు లేడు. అని తననుగురించి చెప్పుకొని యానందించు మాటలన్నియు రజోగుణ తమోగుణముల యొక్క మహిమ యని తెలిసికొనుడు. గాన మీరీ రజోగుణతమోగుణములచేత కట్టుబడిరి. ఆ ప్రభావమువలన మీరు కలహమునంబడిరి. ఆగుణమహిమవలన మీ కలహము బలమైవృద్ధిగాంచినది. మొట్టమొదట గొప్పదైన చీకటినిండియుండి, పంచభూతములు లేయున్నంత నేను సృష్టిచేయుటకై నా శక్తిచేత బంగారు గోళములవలె నుండి, కొంతకాలమునకు అవయవస్ఫుటము కలిగి కార్యకర్మయిని యెత్తైన మూడు రూపములుగా నేర్పడితిని. ఆ రూపములే మీ రిరువురును నేనును అయి యున్నాము. సృష్టిస్థితి లయమునకు కారణభూతుల మైతిమి. సృష్టి చేయువాడు బ్రహ్మ, పోషించువాడు విష్ణువు నాశము చేయువాడు శివుడు. గాన ఒకే గోళమునుండి బయలు వెడలిన మీ రిరువురకు భేదములేదు. ఆదియందులేని భేదము యిపుడెచ్చటనుండి వచ్చును.

బ్రహ్మదేవా! నీవు ప్రభువువు, అన్ని ప్రాణులకు సృష్టికర్తవు సురారాధ్యుడవు. వేదములకు స్థానభూతుడవు, యజ్ఞములకు అధిపతివి, అందరిని రక్షించువాడవు సర్వలోకములకు సంపదల నిచ్చువాడవు, నీవు స్వకీయమైన శక్తిచేత యోగమును పొంది నాగర్భమందుండి యాచనచేసి బాలారుణభాస్కర సమానుడవై నాభికమలమందు పుట్టితివి. ఇట్లుమీకు భేదము కలదనువాదము వ్యర్థము. నీకును నాకును భేదములేదు. నేనొకడుగా కనిపించినను బహుధాయున్నాను నీవు అందరిని, సురలను, మునులనుకూడ రక్షించి వారిచేత వందన

ముల గొనువాడవు. పురుషోత్తముడ వని అంశశక్తి రూపుడైన శ్రీహరి బ్రహ్మదేవునితో యిట్లు చెప్పి మరల శివునితో యిట్లు పలికెను.

ఇది స్కాందపురాణాంతర్గమగు
మాఘపురాణమునందు పదియయిదవ అధ్యాయము



## ప దు నా ఱ వ అ ధ్యా య ము

శంకరా! నీవు సూర్యుడు, చంద్రుడు, నేత్రములుగా గల వాడవు, అగ్ని నేత్రము గలవాడవు, అన్ని లోకములకు కర్తవు అందరి దేవతలచేతను కొనియాడబడువాడవు. యోగీశ్వరులందరిచేత వందనీయుడవు, సంసేవ్యుడవు నీకును; నాకును, భేదమేమియు లేదు నీవే నేను, నేనే నీవు వేదాంతజ్ఞాన పరిపూర్ణులైన యోగులు నిన్ను ముక్తికి ఆధారభూతునిగా భావించి సేవించుచుందురు మరియు ముక్తినందుదురు. నీవు సమస్తమైన భేదములను తొలగించువాడవు. అన్ని భేదములకు ఆధారభూతుడవు. లోకములకు ఆధారకర్తవు. దేవతలకు దేవుడవు ఈశ్వరులకు ఈశ్వరుడవు దేవులలో గొప్ప వాడవు. ప్రభువులలో ప్రభుడవు, నీవు పమానంద స్వరూపుడవు. శరణాగత రక్షణుడవు. శాశ్వత పరబ్రహ్మస్వరూపుడవు నిరంజనుడవు శివుడవు, మంగళకరుడవు, అంతటను వ్యాపించి యుండువాడవు, సూక్ష్మరూపివి, పరబ్రహ్మవు, శాశ్వతుడవు. నీవు దేవతలలో ఇంద్రుడవై యున్నావు బ్రహ్మజ్ఞానవేత్తలలో బ్రహ్మజ్ఞానివి, మును లలో వశిష్ఠుడవు, దేవాంశసంభూతులలో వ్యాసుడవు, సాంఖ్యులలో

కపిలాచార్యుడవు. పదకొండు రుద్రులలో శంకరుడవు, ఆదిత్యులలో వామనుడవు. అష్టవసువులలో పావనుడవు. వేదములందు సామవేదము ఛందస్సులందు గాయత్రివి నీవే. విద్యలయందు అధ్యాత్మవిద్యయు, గతులలో నుత్తమ పరమగతియు, శక్తులలో మాయాశక్తివి, మంచి చెడ్డ, వృద్ధి, నాశనము మొదలగువాటిని కనిపెట్టువారిలో యముడవు నీవే అయియున్నావు. రహస్యముల ఓంకారమును, వర్ణముల బ్రాహ్మణుడవు, ఆశ్రమమున గృహస్థాశ్రమము, ప్రభువులలో మహేశుడవు. పురుషులలో నందటి ముందుసంచరించు పురుషోత్తముడవు. ఉపనిషత్తులలో గుహ్యోపనిషత్తు కల్పములలో మహాకల్పము యుగములలో కృతయుగము, నవగ్రహములలో సూర్యగ్రహము, వాక్కులలో సరస్వతియు అందకత్తెలలో లక్ష్మిదేవి, మాయారూపులలో శ్రీమహావిష్ణువు, పతివ్రతలలో అరుంధతివి. పక్షులలో గరుత్మంతుడవు, సూక్తములలో పురుష సూక్తము, బ్రహ్మతత్వవాదనలందు పరబ్రహ్మము మంత్రములందు గాయత్రీ మంత్రము, యజ్ఞములందు శతక్రతువు పర్వతములందు మేరువువు. యోగీశ్వరులలో అనంతుడవు అయియున్నావు. నీవే పరబ్రహ్మవు. ఈ చరాచరాత్మకమైన ప్రపంచమంతయు నీరూపమే. నావలెనే నీవును అంతటను ప్రధానుడవు.

నీకును నాకును భేదమేమియు లేదు. వేదాంతవేత్తలకిది తెలియును. నారదుడు పూర్వకాలమందు నాచేత నీగొప్పతనమును వినగోరి నిన్ను చూచుటకయి నిర్మలమైన గొప్ప తపస్సుచేసెను. నీవు నారదునకు ప్రత్యక్షమయితివి. ప్రపంచాధిపతివగు నిన్నుగాంచి ముదితస్వాంతుడై నారదుడు స్తుతిచేసెను. కథలకు అతీతమైకన్నులకుగోచరము కాక, కడునిర్మలమై, ఒకడవై, మొదలు, మధ్య తుదిలేనివాడవై ఆదిదేవుడవై, స్వయంప్రకాశము గలవాడవై, అంతము లేని

వాడవై అజ్ఞానమునకు పైనుండి ప్రకాశించు నీస్వరూపమునకు నమస్కారము, వేదాంతవిజ్ఞానులు నిన్ను సమస్త జగత్తునకు నిర్మాణ కర్తగా దలంతురు. ఆనందరూపమును, ఓంకారమును నీవే యని యోగులు శరణుపొందుచున్నారు. అన్నిప్రాణులయందునుండి యోగ వియోగములకు కారణ భూతుడవై, తేజోవంతుడవై, పుట్టుక చావులులేనివాడవై, ప్రాణాధారభూతుడవును అగువానికి నీకు నమస్కారము. ఆద్యంత రహితుడవును, జగదాకారుడవును, స్థితి లయ కారకుడవును, ప్రకృతికి అతీతుడవును, కూటస్థుడవును, తెలియరాని తనుభావము కలవాడవును పురుషోత్తముడవును అగు నీ స్వరూపమునకు నమస్కారము. సర్వాధారమును సమస్త జగత్కర్తవును, అన్ని శరీరములందు ప్రవేశించి, స్థూలసూక్ష్మవికారాదులను పొంది త్రిగుణాత్మక చిత్రములును గల నీస్వరూపములకు నమస్కారము. పదునాల్గు భువనములందు ఆత్మరూపివై నీటియందును,విచిత్రగతుల పురుషోత్తముడవై బ్రహ్మాండమును పూర్ణరూపముగల నీకు నమస్కారము సమస్త దేవతాకారుడవు. ఆదిదేవుడవు స్వయంప్రకాశుడవు, లోకకారణుడవు, త్రికాలవేదివి, పరమార్థరూపుడవు. సూర్య మండల మధ్యస్థుడవుఅగు నీకు నమస్కారము. వేయిముఖములు, వేయి బాహువులు, అంతములేని శక్తి గలపురాణ పురుషుడవు, నీటి యందు [illegible] దించు నారాయణాంశాసంభూతుడవు దంష్ట్రికశరాయమును ప్రళయకాల స్వరూపుడవును, సర్వప్రపంచ నాశ హేతువును అగు నీయొక్క కాలరూపమునకు నమస్కరించుచున్నాను. వేయిపడగలు గలిగియున్న సర్పముచేత సేవింపబడుచున్న నారాయణుని కిష్టుడగు శేషుడను రూపమునకు నా నమస్కారము. అఖిలైశ్వర్య సంపన్నుడవును, ప్రళయనేత్రము గలవాడవును, పరబ్రహ్మానంద రసమును

గ్రోలువాడవు, ప్రళయకాలమునమిగిలియుండువాడవు. ఆకాశసంచారుడవు అగు నీకు నమస్కారము, విచారము లేనట్టియు, నిశ్చయుడవైనట్టియు, పవిత్రుడవు, సురలచేతను, అసురులచేతనుకూడ పొగడబడువాడును, సుకుమార శరీరుడవు. పరిశుద్ధదేహము కలవాడవును, అఖిలాండనాథుడవు. చతుర్బాహుడవు. త్రిశూలమును చేతినిధరించిన వాడవును, భక్తలోకమునకు వశంకరుడవును, ఎద్దువాహనముగా గలవాడవును, దయాస్వరూపుడవును, పార్వతీదేవినిసగముశరీరముగా దాల్చినవాడవు నగు పరమేశ్వరా! నీకు నమస్కారము అని నారదుడు ప్రార్థించెను.

ఆ స్తోత్రమును విని నీవు మిగుల సంతసించితివి. నారదస్తుతి అమోఘము. యీ స్తోత్రమును మునులందరు విని వారుగూడ నీ స్తుతినే అవలంబించి సేవించుచుందురు. గాన నెవరు నిన్ను, నన్ను, బ్రహ్మను అను భేదము తెలుసుకొనక భేదబుద్ధితో జూతురో వారు ఆచంద్రార్కము నరకమునబడి యుందురు. రజోగుణ ప్రభావముచే మీ యిద్దరకు యిట్టికలహము వాటిల్లినది. గాన మీకలహమును కట్టిపెట్టి సుఖముగా నుండును. భగవంతుడీ రీతిగా వారి కలహమును మాన్పి అంతర్ధానమును పొందెను. తరువాత బ్రహ్మశివుడు తమస్థానములకు వెడలిరి. యీ విధముగా రజోగుణ తమోగుణబద్ధులై బ్రహ్మయు, శివుడును అనేక వేలేండ్లు కలహించిరి. ఆకలహమతీతమై, పెరుగగా మాయారూపుడయిన మాధవుడు ఉపాయము చేసి ఆ కలహమును వారించి వారిరువురకు సఖ్యమును కలిగించెను. కాబట్టి ఆత్మజ్ఞానులు ప్రపంచ రక్షకుడని విష్ణుదేవునే సేవించుచున్నారు, విష్ణుదేవుని సేవించువారు శ్రీహరి యనుగ్రహముచేత సౌఖ్యమును పొందుదురు, జహ్నుమహర్షీ! వాంఛలు గలవారును, సాధుసజ్జనులును, పూజలచేతను, కథలచేతను, వందనముల చేతను

మాధవుని పూజించువారు అంతమందు విష్ణుసన్నిధానమును చేరుదురు. మానవుడు అహంకారము, సిగ్గువిడచి ధ్యానము అర్చనము, కథాసంకీర్తనములచే శ్రీహరిని పూజింపవలెను. అహంకారమువలన విచారము కలుగును. జ్ఞానము నశించును, గాన దానిని విడువవలెను. నేను గొప్పవాడనను గర్వమును వదలి, కార్యకారణమువలన గలుగు పరిహాసము, లజ్జను వదలి జ్ఞానవంతులై యీ మాఘవ్రతములు చేయవలెను. శ్రీహరియొక్క సత్కథా శ్రవణమే పరమ ముక్తికి సాధనము.

ఇతి స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున పదునాఱవ అధ్యాయము.

---

## పదునేడవ అధ్యాయము

జహ్నుమహర్షి కృత్స్నమదుని తత్వోపదేశము చేయుమని ప్రార్థించుచున్నాడు. కర్మగ్రంధులనువిడదీయునదియు, మోక్షమార్గమును, సుజ్ఞానమును కలగించునదియు నగు మాఘమాస ధర్మమును విధివిధానముగా నాకు తెలియ చెప్పుమని యడుగగా కృత్స్నమదుడు చెప్పసాగెను. జహ్నుమహర్షీ! నీ బుద్ధి చాల మంచిది. శ్రీహరియొక్క గుణగణములను వినగోరుటచేత, నీవు యోగీశ్వరులలో నుత్తముడవై యున్నావు. మాఘవ్రతము మొదలుగాగల అనేకమైన వ్రతములయొక్క పుణ్యములు అనేక జన్మలయందు చేసిననే గాని శ్రీహరియొక్క కథలను వినుటయందు ఆసక్తి గలుగ నేరదు. కోటిజన్మలయందు చేసిన తపస్సు, దానము, సత్కారము విధికృత

యజ్ఞము. మాధవునికి ప్రీతిని కలిగించు మాఘవ్రతము చేయుట మాధవుని కథలను వినుటయందు బుద్ధికలిగియుండుట మాఘమాస వ్రతమహిమయేగాని వేరుకాదు. గాన జహ్నుమహర్షీ! మాఘవ్రత పుణ్యమువలన కలుగు తత్త్వమును నీ యందుగల ప్రేమచేత చెప్పుచున్నాను వినుము.

పూర్వమందు గంగాతీరమున నొక బ్రాహ్మణుడు నివసించుచుండెను. అతడు వేద వేదాంగవిదుడు, సత్యవ్రతశీలుడు, పరమ శాంతుడు. దాంతుడు, సదాచార సంపన్నుడు, సమస్తభూతముల యందు దయగలవాడు, నీతిమంతుడు, పరమజ్ఞాని, తపోధనుడు జితేంద్రియుడు అయియుండెను. ఆ బ్రాహ్మణుడు సంతానము లేక మిక్కిలి విచారించుచు, పతివ్రతామణియు ప్రాణప్రియయునగు భార్యతో నిట్లు పలికెను. కాంతా! నాకు గుణవంతుడగు పుత్రుడు కలుగలేదు. పుత్రులు లేని నాకు శాశ్వతమైన సద్గతి కలుగ నేరదు కదా! అని పలికిన భర్తపలుకులను విని భార్య యిట్లు చెప్పెను. పూర్వజన్మమందు పుత్రులను యిచ్చు దానమును పాత్రగల వారికి చేయనందున మనకు సంతానము కలుగ లేదు, అని చెప్పిన సతి పలుకులు విని విప్రుడు భార్యతో కాంతా! తీవ్రమైన తపము చేసి శ్రీహరిని సంతోషపరచి అతని దయచేత పుత్రుని బొంద వలెను. గొప్పదైన కర్మగాని, యోగముగాని, సమాధినిగాని చేసి మృకండ మహర్షివలె సత్పుత్రుని నీయందు పొందగలను అని సతీ పతు లిద్దరు ఆలోచించి గంగానదీతీరమునగల చెట్లవద్ద తపస్సు చేయుటకు వెళ్ళిరి. విప్రుడు ఎడమపాదము వేలు భూమియందు మోపి ఊర్ధ్వదర్శనము చేయుచు సూర్యునియందు దృష్టిని నిల్పి యేమాత్ర మును చలింపక ఊర్ధ్వబాహుడై చేతుల జోడించి మనఃపద్మ మందు బ్రహ్మనుగన్న నారాయణుని అష్టాక్షరీ మంత్రముచేత

జాగ్రత్తగా జపము చేయుచుండెను. పుత్రునికొరకై తపముఆచరించు చున్న విప్రునకు రెండు నెలలు గడిచిన పిమ్మట నారాయణుడు ప్రత్యక్షమయ్యెను.

శ్రీమహావిష్ణువు నాలుగు చేతుల యందును శంఖమును, చక్రమును, పద్మమును, గదను ధరించి వక్షమునందు వనమాలను, పీతాంబరమును ధరించి, కౌస్తుభమణి విరాజితుడై, కోటిసూర్య కాంతితో ప్రకాశించు కిరీటమును కలిగియుండి శ్వేతపద్మమువంటి ముఖమును, కర్ణకుండల భాసనాన్వర్ణుడును, శాంతుడను అతీత మైన కాంతిచేత ప్రకాశించుచు. కోటిచంద్ర సమానకాంతుడును, నారదాది దివ్యమానిజనస్తూయమానుడును అప్సరస్త్రీల గాన వినోదములు అనుభవించువాడునై, మునిగణముచేత మ్రొక్కబడిన పాదసరోజములు గలిగి, అడిగినదాని నిచ్చు దయాస్వభావుడును, లక్ష్మీదేవితో కూడినవాడును, గరుడవాహనారూఢుడును అయి విప్రుని ముందట ప్రత్యక్షమయ్యెను. ఓ జహ్నుమహర్షీ! బ్రహ్మాది దేవతలకు కానరానట్టి శ్రీమహావిష్ణువుయొక్క దివ్యస్వరూపము విప్రునకు గానవచ్చెను. బ్రాహ్మణుని భాగ్యము వర్ణనాతీతము. భక్త పరాధీనుడైన భగవంతుడు బ్రాహ్మణుని భక్తికి, దుస్తర తపోనిరతికి మెచ్చి వానితో విప్రుడా! నీ భక్తికి మెచ్చితిని. నీకు నేను వరముల నిచ్చెదను కోరుకోమని పలికెను. కాని బ్రాహ్మణుడు నిశ్చల తపస్సమాధియందు మగ్నుడై యున్నందున భగ వంతుని పలుకులు అతనికి వినబడక యుండెను. బాహ్య ప్రపంచ మును విడిచి యీరీతిగా తపము ఆచరించుచున్న విప్రునకు విష్ణువు వరములను ఇువ్వదలచి, అతని మనస్సును చలింపజేసెను.

ఆవిప్రుడు విష్ణుమూర్తిచేత ఆకర్షింపబడి కండ్లు తెరచిచూచి ధ్యాననిష్ఠయందున్ననతకు గోచరించిన మనస్థితిలోని శ్రీహరిని బహి

ర్దృష్టితో గూడ చూచి, దర్శించి, ఆనంద సముద్రమున మునింగి, దేహమును మఱచి, కొంతసేపటికి ప్రపంచ విజ్ఞానము కలిగి, తన యెదుట నున్న పుండరీకాక్షుని, సర్వాలంకార శోభితుని, భక్తుల కభీష్టదాయకుడును, పదునాల్గు భువనములకు అధీశుడును, చక్ర ధరుడును అగు హరిని మనసార ప్రార్థింపసాగెను. దేవేశా! భక్తప్రసన్నా! కరుణాసముద్రా! అనంతపరాక్రమా! నీకు నమస్కారము అని అష్టోత్తరశతనామములచేతను స్తుతించెను. పరాత్పరుడీస్తోత్రమును విని మిగుల సంతసించి వరంబును గోరుకొను మనెను. అంతట నావిప్రుడా పలుకులు విని దేవా! నాకు చలనము లేని నీ పాదభక్తియే కావలెను ఈలోకమున పుత్రుని ప్రసాదింపుము. పరమందు మోక్షము నొసంగుము అని పలికెను. భగవంతుడా పలుకులు విని విప్రుడా! నీవు కోరినట్లగుగాక! మరియు నీవు స్తుతించిన రీతిని నన్ను అష్టోత్తర శతనామములచేత స్తోత్రము చేయువారికి తప్పక ప్రసన్నుడను కాగలను అని చెప్పి యచ్చటనే యంతర్థానమొందెను.

విప్రుడీ విషయమును దలంచుచు పెన్నిధిగన్న పేదవలె సంతసించుచు తన పూర్వ స్థానమును జేరెను. కొంతకాలమునకు విప్రునకు స్వభార్యయందె పుత్రుడు కలిగెను. ఇట్లు కొంతకాలము గడువగా నారదమహర్షి వారింటికి వచ్చి, విప్రోత్తమా! నీ పుత్రునకు పండ్రెండు వత్సరములు మాత్రమే ఆయుర్దాయము గలదు. తరువాత తప్పక మరణించునని చెప్పెను. నారదుడు వెడలిపోయిన పిమ్మట విప్రదంపతులు కడుంగడు దుఃఖమును పొందిరి. విప్రుడా శోకసాగరమున మగ్నుడై యాలోచించుచు యుండెను. బాల సూర్యునివలె భాసమానుడైన బాలుని కాంతామణి తనతొడలపై కూర్చుండబెట్టుకొని విచారించుచు, కన్నీళ్లు కాలువలై కారు చుండ, చేతులతో పుత్రుని లాలించుచు పరిపరివిధముల నేడ్చుచు

నిట్టూర్పులు పుచ్చుకొండెను ఆమెయు వాడిపోయిన ముఖముతో తిండితినక, పిల్లవానిని చూచుచు నిట్లు విచారింప జొచ్చెను. అయ్యో! నా భర్త యిక్కడనే తపమాచరించి సహస్రసేవచే యీ పుత్రుని పొందగల్గెను. బాలుడు బాలభాస్కరుని పగిది దినదినము భాసమానుడై యుండెను. బాల్యక్రీడలుచేసి విధ్యుక్తముగా ఉపనయనమును పొంది, విద్యల నభ్యసించి బ్రహ్మచర్య విధి సల్పుటచేతను, పన్నెండు సంవత్సరములు సమీపించుటగాంచి విప్రుడు, మాపిల్లవాడు మరణించు ననియు. పుత్రశోకము భరింతు మనియు విచారింపసాగెను భార్యయు, నాథా! పుత్రశోకము సహింప శక్యము కాదు. కాన నాకు నీయనుజ్ఞనొసంగుము, జలములంబడి ప్రాణములను త్యజింతును. నీవు సుఖపడగలవు అని పలికెను భార్యపలుకులు విని, భర్త విచారించుచు, తలచుకొని యేడ్చుచున్న భార్యను చూచి జ్ఞానమును బోధింపదలచి యిట్లు పలికెను. పుత్రుని మరణ శోకము భార్యాభర్తల కిరువురకు సమమే కాని పుత్రులు లేక పరితపించి పొందినందున మనకు దుఃఖము అధికము కాగలదు. అయినను పురుషుడు కొంత దుఃఖమును తగ్గింపగలడు. ఆమడ కని పెంచిన మమకారముచే దుఃఖమును తగ్గించుకొనలేదు. అందువలన యిట్టి విచార సాగరమును తరించుటకు జ్ఞానోదయమే నావ, గాన మనము ఉభయకారకమైన జ్ఞానబోధ చేయుట కారంభింతము.''

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు పదునేడవ అధ్యాయము.

---

## పదునెనిమిదవ అధ్యాయము.

“విప్రుండు భార్యతో నిట్లనెను. శరీరమును కృశింపజేయు శోకమును అంతములేక వృథాగా మొదుల కవలంబించితివి. నీవు

విచారించుటకు కారణ మగుపడదు. అట్టి హేతుశూన్యమైనవిచారము కలిగినది కొందరు నూరేండ్లుజీవింతురు. మఱికొంద రల్పాయుర్దాయు వంతులగుదురు. కుమారునకు పదమూడవ సంవత్సరమున మృతి యని విచారింతువా? ఎంతటి గొప్పవానికైనను మృత్యువు రాకుం డునా? కుమారునిచావునకు విచారింతువు. నీకును మరణము తప్పదు గదా! శోక మెందులకు? పుట్టిన ప్రతిజంతువు నాశనమును పొందక తప్పదుగదా! చచ్చినవాడు మరల పుట్టును. ఇక శోక మెందుకు? పండితుడైనవాడు విధివశముచేత సంభవించు సుఖదుఃఖములకువిచా రింపడు. సంతసింపడు, గాన నీవు యీ విషయమై విచారమును పొందకుము. రానున్నది రాకమానదు. పోనున్నది పోకమానదు. ఇట్టి విషయమున వృథాగా శోకించుటయేల? నీ విచారము జరుగ బోవుదానిని యాటంక పరచదు. గాన శోకమును విడువుము. జంతువుకర్మవల్ల పుట్టును. కర్మవల్ల వుండును, కర్మవల్ల చచ్చును. మాయాయుక్తమైయున్న యీ ప్రపంచము నశించును. లోకము నంతు కనిపించు యీ శోకము కూడదు. పరమార్థ విచారణ చేయుము. విచారము శరీరమునకా? లేక ఆత్మకా? శరీరము నశించు నదిగాన విచారము అనవసరము. శరీరము స్త్రీపురుష సంగమ జనితము. రేతస్సుయొక్క రూపము పంచభూతస్వరూపము. శుక్ల శోణితసంయోగ జనితము. ఇట్టి శరీరము గురించి శోకించుటతగదు. పంచభూత సంభూతమును, శోక హేతువును, మలమూత్ర పురీష మాంసాస్థినిలయమునగు శరీరమునందు ప్రేమ వహించుట తగదు. అనిత్యమగు దేహమునకు ఆశచేత అనేకదుఃఖములు కలుగును.గాన నీవు సుఖమును గోరితివేని శరీరమందాశను వదలుకొనుము.

నీకు దేహమందుగల ప్రేమయే విచారమునకు కారణము. గాన ఆ ప్రేమను వదలి వేయుము. ఆత్మకాని శరీరమందు కలిగిన

ఆత్మబుద్ధియే శోకకారణమగును. ఆత్మజ్ఞానము లేకపోవుటయే నాశన హేతువు. ఆత్మకనుపించదు. ఘటాదు లెట్లు కనుపించునో, అట్లే ఆత్మ ప్రమాణముచేత లభ్యమగును. ఆత్మజ్ఞానము, విచారము లేకయుండును. విద్వాంసులు విచారముచేత కర్తవ్యమును నిశ్చయముచేయుచున్నారు. దేహము ఆత్మకానేరదు. నేత్రము ఆత్మకానేరదు. దీపము చూడదగినవస్తువును చూచుటకు సాధనమగునో అదేరీతిగా నేత్రము చూచుటకు సాధనము గనుక ఆత్మకాదు. ఈ విధముగనే సమస్త యింద్రియములును కూడ ఆత్మకానేరవు. మనస్సును ఆత్మకాదు. ప్రాణమును ఆత్మకాదు. సుషుప్తియందు చేతనములేక యుండుటవలన ప్రాణము ఆత్మకానేరదు. అహంకారము ఆత్మకాదు. ఘటాదులవలె సంకరమగుటవలన, శరీరధర్మ మవలంబించి, సుఖదుఃఖభాజకమై, ఈర్ష్యాదిగుణసంసర్గమై యున్నందున అహంకారము ఆత్మకానేరదు. ఆత్మ ప్రకృతికి అతీతమును, నిత్యతృప్తియు, సదా ఆనందమును, పరిశుద్ధమైన బుద్ధియు కలిగి శాశ్వతమై యుండును. గాన ఆత్మకు శరీరముతో యెన్నడును సంబంధముండదు. నీవు మమకారము వహించి యే శరీరమును గురించి విచారించుచున్నావో ఆ శరీరము ఆత్మకంటె వేరుగానున్నది. నీకు దేహధర్మములు గుణధర్మములు లేవు. నీకు మరణమెట్లు వచ్చును? మరణము దేహధర్మము. దేహమునకు ఆత్మధర్మము కలిగిన యెడల ఆత్మకు శరీరధర్మము కలుగును. ఆత్మకుయితర ధర్మ సంబంధము యేమాత్రములేదు. గాన ఆత్మ ధర్మసంబంధము శరీరమునకు లేదు. కాబట్టి దేహము మరణమునకు పాల్పడును. ఆత్మకు భయములేదు. గాన నీవు విచారమును విడిచి నిశ్చలమగు మనస్సుతో నుండుము. క్షణములో నశించు యీ దేహముతో ప్రయోజనము లేదు. ఆత్మయే శాశ్వతమని తెలిసికొని సుఖింపుము.

పండితులీ సంసారమును నిత్యముగాదని యెఱింగి పెండ్లి చేసి కొనికూడ, వైరాగ్యమును పొంది సన్యసింతురు. గృహస్థవిధులు సంతానప్రాప్తిని పొంది క్రమముగా సన్యాసమును స్వీకరింతురు. గ్రుడ్డివానిని వెంబడించు గ్రుడ్డివారు దారిగానక చింతింపపగిది అజ్ఞానులు రాగవిశేషముచేత దారిగానక సంసారమునబడి మ్రగ్గుచుందురు. అట్టి సంసారలంపటులకు నూరుకోట్ల జన్మలుయెత్తినను ముక్తి లేదు. రాగాంధులై సంసార తమోవృత్తులై యున్నవారు, తన్నాశన హేతువైన జ్ఞానమును పొందజాలరు. అజ్ఞానమున ముంచి మాయను వెదజల్లి యెంతకాలముండునో అంతకాలము సంసారముండును. మాయ నశించిన ముక్తిగలుగును. అనిత్యమును అపవిత్రమును అగు ఈ కళేబరమున నీకు నిశ్చలమగు జ్ఞానము గలిగినది. ముదిమి కలిగి అవస్థాభేదములు పొంది చంచలమైన యీశరీరము నశించునదిగా తెలియుము. మోక్షమునకు అనుకూలమైన దేహమును పొంది, అజ్ఞానము చేత వృథాగా యెందుకు విచారించెదవు? నామాట వినుట కంగీకరించితి వేని చెప్పెద వినుము.

పరమ పవిత్రచరితా! కాంతా! ఆత్మకాని దేహమందాత్మభావమును వదలుము, శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధములను పంచవిషయములను తలచుటవలన విషయవాంఛ కలుగును. దానివలన కామము జనించును. కామము ఆవేశించి క్రోధము వచ్చును. మంచి చెడ్డలు తెలియక ఆ కోపమువలన నాశనకరమైన మోహము కలుగును. మోహమువలన స్మృతినాశనమును, స్మృతి నాశనమువలన బ్రహ్మజ్ఞాన విషయమైన బుద్ధినశించును. ఆత్మబుద్ధి నశించుటవలన తానుకూడ నశించును. అనగా సంసారమందుందువు. అది తప్పనేరదు. అందువల్ల విషయవాంఛ వదలవలెను. విషయములను జయింపవలెను. అట్లు కానిచో దేశమును వదలిపోవుట

మంచిది. ఇంద్రియములను నడిపించి యోగవృత్తి నవలంబింపవలెను. సంసర్గమును వదలి నిశ్చలమగు బుద్ధితో మనస్సునగల ఆత్మను తెలిసికొనుము. అష్టాంగయోగము చేత పరమాత్మను యెఱింగి యీ దేహమును వదలి యిచ్చటనే నశించవలెను. నాయందు నన్ని భూతములు గలవు, అన్ని భూతములందు నేనున్నాను. నేనే గొప్పవాడను. నాకంటె యితరమేమియు లేదు. గాన యీ శరీరమునగల మమకారములు విడువుము సుఖింపుము. పుత్రుని మరణమునకు శోకించుచున్నావు. భయము లేదు. శ్రీహరిని పూజించి పుత్రమరణమును తప్పింతును. నీవు సుఖముగా నుండుము. అని యిట్లు విప్రుడు తన భార్యకు తత్వోపదేశము చేసి గంగాతీరమునకు వెంటనే పోయి సూర్యమండల మధ్యవర్తియగు మాధవునావాహనము చేసి పాద్యము అర్ఘ్యము, స్నానము, వస్త్రము, చందనము, పుష్పములు, ధూప దీపనైవేద్య తాంబూలాదులను సమర్పించి పూజింపసాగెను. హరి సాన్నిధ్యమున నారాయణమంత్రమును జపించుచుండెను. భక్తవశుడగు రమాకాంతుడు సంతోషముతో విప్రునికి ప్రత్యక్షమయ్యెను. విప్రుడా విష్ణువునకు నమస్కరించెను. పిమ్మట వానితో నారాయణు డిట్లని పలికెను.''

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణము నందు పదునైదవ అధ్యాయము.

—0—

## ప దు నా ఱ వ అ ధ్యా య ము

''భగవంతుడా విప్రునిజూచి మునిచంద్రమా! నన్నుగురించి తపస్సు చేయుటకు కారణమేమి! అని యడిగెను. విప్రుడా దేవ

దేవునిజూచి "దేవా! నీ దయవలన నాకు సుపుత్రప్రాప్తి కలిగినది. అంతట నారదు డొకనాడు నాకడకు వచ్చి నీకుమారుడు పన్నెం డేండ్ల వయసున మరణించునని చెప్పెను. అందువలన నిన్నుగురించి తపస్సు చేయుచుంటిని. అందుల కాదేవదేవుడు విప్రునితో నిట్లు చెప్పెను. ఓయీ! నీ కుమారునకు పండ్రెండు సంవత్సరములకు గండము గలదు. అది నీ భార్యచేసిన పాపమువల్ల కలిగినది. ఆ పాప మును వివరించెదను వినుము. నీభార్యపూర్వజన్మమున గొప్పతపస్సు చేసిన తపోనిష్ఠుని కూతురు జ్ఞానశర్మయను నీకామె భార్య. మంచి రూపవతియు, మంచి గుణవతియు, పతిసేవానిరతియు, సదాచార సంపన్నయు, సర్వభూతహితమతియు, పాతివ్రత్య పరాయణయునగు నామెతో జ్ఞానశర్మ డిట్లనెను. కాంతా! మాఘమాసమున మకర రాశియందు రవి యుండగా శ్రీహరి ప్రీతికై స్నానము చేయుము. మాఘమాసమున ఉదయస్నానము బహుపవిత్రము. అనిపలుకగా నట్లనేయని మాఘస్నానము చేసెను. కాని పూర్ణిమదినమున పాయ సాన్నమును దానమిమ్మని యనగా నామె యట్లొనర్పలేదు. ఆ జన్మ గతించినది. తిరిగి యిచ్చట జన్మించినది. ఆమె భర్తగా నీవు పుట్టితివి. మీరిరువురును దంపతులైరి. భర్తమాట వ్యతిరేకించినం దున నీ భార్యకు సంతానము కలుగలేదు. నీవు మాఘమాసమున ధర్మము నిర్వహించినందున నాయందు నీకు నిశ్చలమైన భక్తి కలిగి నది, భక్తివలన తపశ్శక్తి కలిగినది. తపస్సుకు మెచ్చి యిహపరసుఖ మిచ్చు పుత్రుని వరమొసంగితిని. పూర్వజన్మమున నీవు చెప్పినను వినక పాయసదాన మొనరింపని కారణమున నీ భార్య పుత్రవతి యైనను నీ వాక్యోల్లంఘన దోషముచేత నీకుమారుడు పన్నెండు వత్సరములకు మృత్యువాత బడవలసి వచ్చెను. నారదుడీ విషయము తెలిసికొని నీకు చెప్పెను.

కావున నీ కుమారుని మాఘమాసమునందు ఉదయకాలమున గంగానది తోయములందు మునుగ జేయుము. దానివలన బాలునికి ఆయుర్వృద్ధి కలుగును. మాఘస్నానము మానవులకుఆరోగ్యప్రదము సంపదల నిచ్చును. పుత్రపౌత్రుల నొసంగును. స్త్రీలుగానిపురుషులు గాని, మాఘవ్రతము చేయజాలనివారు పుత్రులను చంపినవా రగుదురు. మాఘవ్రతమును విడచువారు, బ్రహ్మహత్యా పాతకులు భ్రూణహంతకులు, పశువులను-మిత్రులను చంపినవారు కృతఘ్నులు దారుణహత్యలు చేసినవారు గురుద్రోహులు, అంతకంటె పాపాత్ము లుండనేరరు. అనేక జన్మములయందు చేసిన పుణ్యముండిన గాని, మాఘవ్రతమును అవలంబించుట కాశక్తికలుగ నేరదు. మకర రాశి యందు మార్తాండు డుండగా మాఘమాసమున, రోగరహితుడై దృఢముగా స్నానమును చేయువాడు తిరిగి జన్మలేని శాశ్వత పదవిని పొందును. మాఘస్నానము మహాపాతకనాశము. నేను యీ మాసమున ప్రీతికలవాడను. గాన మాఘవ్రతానిష్టునకు సుఖము నిత్తును. వ్రతవిముఖునకు దుఃఖము గలుగును. స్నానదానములు లేక సదాచారములు లేకుండువాడు నరకలోకమున కతిథి కాగలడు. మాఘమాసము ప్రాతఃకాలమున రమాధవుని ధ్యానించుచు, బాలుడును పాపియు, రోగియు, ముదుసలియు, స్నానము చేసినయెడల బాలుడు దీర్ఘాయుర్దాయవంతు డగును. మంచిబుద్ధిగలవాడు తేజస్సు గలిగియుండును. రోగముగలవాడు ఆరోగ్యవంతు డగును. ముదుసలి యగువాడు వైకుంఠమును జేరును. ఎవడే కోరిక కోరునో వాని కది సిద్ధించును, మాఘస్నాన ప్రభావము బ్రహ్మదేవునకు, శివునకు, లక్ష్మిదేవికి, పార్వతీదేవికి, సరస్వతీదేవికి, ఇంద్రునకు, వసిష్ఠునకు, జనకమహారాజునకు, దిలీపరాజునకు, నారదమహర్షికి తెలియును. ఇతరులకు తెలియదు.

నాయొక్క భక్తులు నన్ను తెలిసికొనుచున్నారు. మాఘవ్రత మహిమను కొందరుమాత్రమే తెలిసికొనుచున్నారు. ఇతరులందరికీ తెలియదు. అనేక వేలజన్మలయందు యీ మాసమున స్నానము పూజ, కథాశ్రవణము, మొదలగువానిచేత నన్ను పూజించువారికి మాఘస్నానమందు బుద్ధికలుగును. కాన అనిత్యమైన శరీరమును నమ్మికొని యెవడు స్నానము చేయడో వారికి త్వరగా నరకమే కలుగును. ఈ మాసమున నీకుమారుని గంగాతోయములచే తడుపుము. దానివలన నీపుత్రుడు దీర్ఘాయుర్దాయవంతుడగును. పుణ్యాత్ము డగును. భగవంతుడిట్లు చెప్పి అంతర్ధానముకు పొందెను. మునియు సంతోషముతో గంగాజలమును తెచ్చి కుమారునిమీద నుంచెను. వాడును గంగోదక స్నానముచేత కాలక్రమమున వృద్ధిగాంచెను. ముని బాలునికి మూడవసంవత్సరమున చౌలకర్మ చేసెను. కుమారు నికి జననము మొదలు జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము చౌలము మొదలగు కర్మలను, కాలానుసారముగా చేసి యెనిమిదవ వత్సరమందు ఉపనయనము చేసి వేద శాస్త్రములను చెప్పించెను. పన్నెండు సంవత్సరములకు రాదగు మరణము నశించెను. కుమారుడు చిరంజీవు డాయెను.

జహ్నుమహర్షీ! మునియు, మునిభార్యయు పుత్రునిగూడి సుఖించిరి. ముని యోగభ్యాసముచేత శరీరమును విడచి, విష్ణులోక మును పొందెను. గాన మాఘవ్రతముతో సమానమగు వ్రతము లోకమున వేరొకటిలేదు. ఈ మాసము మాధవునికి ప్రీతికరము, పుణ్యమునిచ్చునది. సర్వపాపములను నాశనము చేయునది. యజ్ఞాది కర్మలు చేసిన ఫలమునిచ్చునది. మోక్షప్రదము, సుజ్ఞానమును యిచ్చునది, సంపదలను కలుగజేయునది. మోక్షమును గోరువాడీ వ్రతమును ఆచరించిన ముక్తిని పొందును. కర్మలచేత మోక్షమును

పొందనేరడు. నీవు నన్నడిగినందున, జ్ఞానస్వరూపమును, మాఘ ధర్మమును, జ్ఞానసిద్ధిని, మోక్షోపాయమును చెప్పితిని. ఈ కథను వినిన ప్రతి మాఘవ్రతాచరణుడును జ్ఞానసిద్ధిని పొంది తనూ్మలమున నిత్యానందమును చేకూర్చు మోక్షమును పొందును. బ్రాహ్మణుడు గాని, క్షత్రియుడుగాని, వైశ్యుడుగాని, శూద్రుడుగాని, స్త్రీగాని, యీ మాఘపురాణమును, ఆది అంతముకూడ పూర్తిగా వినిన వారు పాపమునుండి విడువబడి పరమపదమును పొందుదురు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున పందొమ్మిదవ అధ్యాయము.

---

## ఇరువదవ అధ్యాయము.

"గృత్స్నమదుడు జహ్నుమహర్షితో యిట్లు చెప్పసాగెను. జహ్నుమహాముని ! అశ్వమేధ యాగమును చేసినవాడును, మాఘ వ్రతమును చేయుటందాశక్తిగలవాడును, ఏకాదశీవ్రతమునందు నిష్ట గలవాడును, కూడ సమానమగు ఫలితమునే పొందగలరు. మాఘమాసమున ఏకాదశీనా డుపవసించినవాడుఅశ్వమేధయాగము చేసిన ఫలితమును పొంది తుదకు వైకుంఠమును పొందును. మాఘశుద్ధ ద్వాదశినాడు బ్రాహ్మణులతో కూడి పారణ చేయు వాడును, అన్నదానము చేయువాడును, గొప్పదగు పుణ్యమును పొందుదురు.

జహ్నుమహర్షి గృత్సమదుని యడిగెను. మునీశ్వరా! అనేకమాలైన దినములుండగా యీ మాఘశుద్ధ ఏకాదశి యెట్లు అశ్వమేధయాగములు వేయింటికి గలఫలితము నిచ్చును? ఈవ్రత మెట్లు పూర్వమందు చేయబడినది? ఎవరు దీనిని ప్రకాశింప జేసిరి? ఈ మొదలగు విషయములకు సంపూర్ణముగ నాకు దెలియజెప్పుము. గృత్సమదుడు జహ్నుమహర్షితో పలికెను. జహ్నూ! వినుము. పాపపరిహారమును ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగునదియు పుత్ర పౌత్ర సంతాన ప్రదమునగు కథను చెప్పెదను. పూర్వకాలమున దేవతలు, రాక్షసులు; భాగ్యమును కాంక్షించుచు పాల సముద్రమును మధించిరి. మేరుపర్వతము కవ్వముగను, వాసుకియను సర్పరాజమును కవ్వపు త్రాడుగను చేసిరి. మేరుపర్వతమునకు వాసుకిని మూడుమారులు చుట్టి రాక్షసులు దేవతలు రెండుకక్షలుగా ఏర్పడి దేవతలు వాసుకి తోకను, రాక్షసులు వాసుకి శిరస్సును పుచ్చుకొని సముద్రమును మధించిరి. దేవదానవులు యీ రీతిగా క్షీరసాగరమును మధించగా పాలసముద్రమునందు పద్మమునందు లక్ష్మీదేవి పుట్టెను. ఆలక్ష్మీదేవియే విష్ణుమూర్తి భార్యగానాయెను. పిమ్మట ఉచ్ఛైశ్రవమను గుఱ్ఱమును, కామధేనువు, కల్పవృక్షమును అమృతకలశమును మొదలగునవి అనేకములు పుట్టినవి. విష్ణుమూర్తి ఆ క్షీరసాగర జనితమైన పదార్థములన్నియు దేవేంద్రున కిచ్చెను.

పిమ్మట దేవతలు దానవులు పాలసముద్రమును యింకను మధించుచుండగా అగ్నిహోత్రముతో సమానమయిన తేజస్సుగల విషము పుట్టెను. ఆ విషజ్వాలలు భూలోకమును, ఊర్ధ్వలోకమును అన్ని దిక్కులను వ్యాపించి సర్వవిధముల దహింపసాగెను. ఆ విషమునుజూచి దేవతలు, రాక్షసులుకూడ భయమునుపొందిరి. అంతట వారు సర్వరక్షకుడైన శివుని శరణువేడిరి. మరియు వానిని స్తుతి

జేసిరి. జగత్తులకు కారణభూతు డవుడు. సుఖము నిచ్చువాడవును, అగు మహాదేవా! నమస్కారము, వాక్కులకు అందనివాడవును, మేరుపర్వతము ధనస్సుగా గలవాడవును అగు ఈశ్వరునకు వందనము. పరమ శాంతస్వరూపా! ఈశ్వరా! వృషభధ్వజా! నీకు నమస్కారము. నిత్యమునిర్మలస్వరూపుడవు, గుణాకారుడవు మూడు లోకములకు అధిపతివి, జగత్తులకు పరిపాలకుడవు, త్రిపురాంతకా! త్ర్యంబకా! త్రిగుణస్వరూపా! నీకు ఆనందమగు నమస్కారములు వేదములుమూడింటియొక్క కర్మములచేతను సాధింపదగియున్నావు. ఆకార శూన్యుడవు, స్వరూప సహితుడవు. వేదవేద్యుడవు అగునీకు వందనములు. శ్రీహరికి ప్రేమాస్పదుడవును. పరమహంసస్వరూపుడవును, భయమును బాపువాడవును, మృత్యువును జయించినవాడవును, పరమ మిత్రుడవును అగు భక్తప్రసన్నా! నీకు నమస్సులు శంభో! శంకరా! మహాదేవా! నందివాహనా! మమ్ములను రక్షింపుము. ఇట్లు దేవతలందరు బాధపడుచు శంకరుని స్తోత్రము చేయుగా ఆర్తత్రాణపరాయణుడైన శంకరుడు తన నోరు తెరచి క్షీరసాగరము నుండి జనించిన కాలకూటవిషమును మింగి కంఠమందు నిలిపెను. విషము నల్లనైనదిగాన, ఆ విషమును శంకరుడు కంఠమందు నిలిపినందున శంకరునికి నీలకంఠుడని, నీలకంధరుడని పేరువచ్చెను.

అమృతము పుట్టగ అంతట దేవతలు, రాక్షసులు పాలముదమును మధించుటమానిరి. అమృతకలశమును దేవతలు హరింతమని వారును, రాక్షసులు హరింతెమని వారును వాంఛతో చూచుచుండిరి. అప్పుడు మాయావిద్యలందతినిపుణుడైన మాధవుడు స్త్రీరూపమును ధరించెను. ఆ స్త్రీరూపము సమస్తజంతువులకు ఆకర్షణీయమై, నయనానంద హేతువై, బలమగు తొడలు, అందమగు పిక్కలుగల

దియు, నట్టువగలిగిన ఘనమగు కుచకుంభములు గలదియు. చంపక పుష్పసమానమగు ముక్కుతోడను, కోమలమగు చేతులు, తీగతో సమమగు అవయవములు గలదియు, దళసరిగా నుండి దీర్ఘములగు తలవెంట్రుకలు గలదియు అనేకములైన అలంకారములతో ప్రకాశించునదియు, పట్టువస్త్రము ధరించినదియు, నవరత్నములతో కూడిన మకర కుండలములు గలదియు, అందమగు నడక గలదియు, మంగళప్రదమగు అలంకారములతో ప్రకాశించు ముక్కు గలదియు, శోభించు నేత్రయుగము గలదియునై సర్వప్రపంచములను మోహింపజేయుచు దేవదానవుల నడుమనుండి వారందరిని గూర్చి యిట్లు పలికెను.

దేవతలారా! రాక్షసులారా! నాపలుకులు వినుడు. ఈ అమృతకుంభమందు గల అమృతమును నేను మీకు సమభాగములుగా పంచి పెట్టగలను. దేవతలొక ప్రక్కను, దానవులొక ప్రక్కను చక్కగా కూర్చుండుడు! అని యీరీతిగా ఆ జగన్మోహిని పలుకగా దేవతలు, రాక్షసులుఅట్లేఅగుగాక యని అంగీకరించి అమృత ప్రాశనమునకు పంక్తులు దీర్చి కూర్చుండిరి. జగన్మోహిని ఆయమృత కలశమును తన చేతులతో దానిని రెండు భాగములు చేసి ఒక భాగమందు అమృతమును, రెండవభాగమందు కల్లును నిండబెట్టి, దేవదానవులకు నడుమనుండి మోసముచేసి దేవతలకు అమృతమును, రాక్షసులకు కల్లును యిచ్చెను. ఇరువురను రెండు ప్రక్కలను గూర్చుండబెట్టి తాను మధ్యగానుండి రాక్షసులవైపు కల్లును, దేవతలున్నవైపు అమృతమును నిండించి పంక్తి మొదటినుండి రాక్షసులకు కల్లును, దేవతలకు అమృతమును ఒక్కసారిగా నిటునటు దిరుగుచు పంచియిచ్చెను. రాక్షసులు కల్లు అమృతకలశమునుండి వచ్చుటచే అమృతమేనని భ్రమించిరి. బరువైన కాలి అందెల చప్పుడు చేతను, కంకణముల చప్పుళ్ళచేతను, ఆజగన్మోహిని రాక్షసులను

మోహింపజేసి యీరీతిగా సురాపానముచేత మరించిన వారినిగా చేసెను. విష్ణుమూర్తి అమృతమును వారి కిచ్చునపుడు దేవతలు. రాక్షసులు అంజలులు బట్టిపానము జేసిరి. ఇంద్రాదిదేవత లీయమృత మును త్రాగునపుడు శ్రీహరి కపటము నిద్దరు రాక్షసులు తెలిసు కొని, దేవతలపంక్తిలో జేరి వారితోపాటు దేవ రూపములు ధరించి, అమృతమును త్రావబోయిరి. వెంటనే జగన్మోహినిగాయున్న శ్రీహరి చక్రమును దలంచిన మాత్రమున ఆయిరువురు రాక్షసుల శిరస్సు లను ఖండితమయ్యెను. రాక్షసులు త్రాగిన అమృతము వారి కంఠ మునుండి క్రిందకు దిగునంతలోనే శ్రీహరి చక్రముచేత వారి శిరస్సు లను ఖండించెను. త్వరగా ఇంద్రాదిదేవతలును అమృత పానమును గావించిరి. పిమ్మట దేవతలును, రాక్షసులును, హాహా కారములు చేయ మొదలిడిరి. రాక్షసులు తమకు అమృతములేక పోయెననియు, దేవతలు తమతో జేరి యిరువురు రాక్షసులు అమృతమును గోలి రనియు హాహా కారము లొనర్చిరి.

రాక్షసులంత చింతాభరితులయి ప్రాణములను రక్షించుకొను నాసగలవారయి, ఒకరిచేత జీవితమునకు భయము లేదని విషయ మందు నిరాశులయి తమతమ నివాసములకు జనిరి. భగవంతుడైన శ్రీహరి జగన్మోహినీ రూపమును వదలి విష్ణుమూర్తి స్వరూపమును ధరించెను. పిమ్మట విష్ణుచక్రముచే శిరస్సు ఖండింపబడిన యిరు వురు రాక్షసులూ విష్ణుదేవునిలో నిట్లనిరి. కేశవా! మాకు చావును, బ్రతుకునుగూడా లేకుండా చేసితివి. మాకు గతి యేమి? ఆహారమేమి చెప్పుమని యడిగిరి. వారికి భగవంతుడుయిట్లు బదులు చెప్పెను. మీకువంతుల ప్రకార మాయా కాలములందు, పర్వ ములయందు పూర్ణిమామావాస్యా ప్రతిపత్తుల సంధుల యందును

సూర్యుని, చంద్రుని ఆహారముగా భక్షించుచు జీవింపగలరనిచెప్పగా రాక్షసు లిద్దరును ఆకాశమండలమును చేరిరి. పిమ్మట బ్రహ్మ, విష్ణువు, యీశ్వరుడు, ఇంద్రుడు మొదలగువారు అమృతకలశమును పుచ్చుకొని తమతమ నివాసములకు జనిరి. విప్రోత్తమా! వినుము. ఆ పాలసముద్రమందు అమృతకలశము నుంచిన స్థలమందు విధివశమున కొన్ని యమృతబిందువులు భూమియందు పడినవి. ఆస్థలమందు మృదువైన రెండు వృక్షములు పుట్టినవి. వానిలో ఒకటి పారిజాతము, రెండవది తులసీవృక్షము.

ఇట్లుండగా కొంతకాలమునకు సత్యజిత్తను శూద్రుడు ఆ రెండు వృక్షములకు నీటిని పోయుచుండెను. ఆ స్థలమందు పువ్వులతోటను నిర్మాణము చేసెను. అదృష్టవశముచేత శూద్రుడు తాను పరిసర గ్రామమందుండుటచే వాటిని పెంచి ఆవరణము కలిగించి బహు చక్కగా రక్షించుచుండెను. ఆ పువ్వులతోటను నీటినిబోసిచక్కగా పెంచి ఆ శూద్రుడు ప్రతిదినమందును ఆ పువ్వులవలన జీవనము చేయుచుండెను. తులసీవృక్షము కోమలపల్లవములతో మనస్సున కానందము కలిగించుచుండెను. పారిజాతవృక్షముకూడ పుష్పపల్లవములచే నిండి కన్నుల కానందమును గూర్చుచుండెను. పారిజాత పుష్పము అందరికి ఆనందదాయకము. పుష్పమందలి కేసరములు వివిధ రత్నములు పొదిగినట్లు ప్రకాశమానము లగుచున్నవి. ఆ వృక్షముయొక్క శాఖలయందు ప్రభవించినపువ్వులు మంచిగంధపరిమళము కలిగి, సుఖమునిచ్చు సువాసన గలిగి ప్రకాశించుచుండెను, ఇట్టి పారిజాతమును దేవేంద్రుడు పరివారసహితముగా చూచెను. ఒకనాడు దేవేంద్రుడు రాక్షసులను బరిమార్చుటకై మత్తగజంబగు ఐరావతంబు నెక్కి వెడలుచు మార్గమునగల పారిజాతమును జూచి క్రిందకుదిగి పువ్వులతోటనుజేరి, పువ్వులను గోసి

కొని మిగుల యానందముతో దేవలోకమునగల స్త్రీల కిచ్చుటకు తన స్వర్గమును జేరెను అచ్చట పుష్పములను శచీదేవి మొదలైన దేవతా స్త్రీలకిచ్చెను. వారందరు నా పారిజాతపుష్పములను చూచి మిక్కిలి యానందించిరి. మరియు నాపువ్వులయొక్క వృత్తాంతము నంతయు సాంతముగా దేవేంద్రునివలన విని వానితో యిట్లు చెప్పిరి. దేవా! యీ పుష్పములు మాకు చాల ఆనందకరముగా నున్నవి. గాన నిత్యమును మాకు పుష్పములను తెప్పించి యిమ్మని ప్రార్థించిరి.

ఆ స్త్రీలమాటలను విని ఇంద్రుడు తక్షణమే యంగీకరించి ఒక రహస్య దూతనుపంపి ప్రతిదినము దొంగతనముగా ఆ పువ్వులదోట నుండి పారిజాత పుష్పములను తెప్పించుకొని స్త్రీలను సంతుష్టిపరచి తానుకూడ యానందించుచుండెను. ప్రతిదిన మిట్లు జరుగుచుండగా సత్యజిత్తు నిత్యము పువ్వులు లేకుండుట గ్రహించి కారణమును తెలియక ఒకనాడు ఆ పూదోట యందు ఒక పొదలో దాగి చూచుటకై రాత్రి యచ్చటనే యుండిపోయెను. అర్ధరాత్రి సమయ మున దేవలోకపు రహస్యపుదూత వచ్చి పారిజాత పుష్పములను గోయుచుండెను. సత్యజిత్తది చూచి వెంటనే వానిని పట్టుకొనెను. ఆ రహస్యదూత వాని చేయి వదలించి వెంటనే ఆకాశమున కేగెను. ఇంద్రునకు జరిగిన వృత్తాంతము చెప్పెను. దేవేంద్రుడది విని వానితో నిట్లనెను. గుహ్యకా! నీవు ఆకాశమందు సంచరింపగలవు. నీకు భయములేదు. గాన నిత్యమును నీవుపోయి పూదోటనుండి పారి జాతమును దెచ్చి మా కిచ్చుచుండుము. అని బల్కిన గుహ్యకు డందుల కంగీకరించి తన యింటికి వెళ్ళెను. సత్యజిత్తు మిగుల విచా రించుచు, పుష్పములిక దొరుకుట దుర్లభమనియు, ఆకాశగమనులు అగు అమరులు పుష్పములను హరించుచున్నారనియు. భూలోకమున

నివసించు తాను వారిని బట్టుకొన జాలననియు నందులకై యొక యుపాయమును బన్నుదునని తలంచెను.

విష్ణుమూర్తి యొక్క పూజా నిర్మాల్యమును, పుష్పవాటికకు బయటయంతయును పారిజాత శాఖలయందునుచల్లినయెడల యీపని జరగనేరదని నిశ్చయించి అట్లే విష్ణుపూజా నిర్మాల్యమును దెచ్చి పూదోట యంతయు జల్లెను. గుహ్యకుడు యథారీతిని పువ్వులు కోయుటకు వచ్చి పారిజాతపుచెట్టు నెక్కి పువ్వులను గోయనారంభించెను. అంతట నిర్మాల్యమునకు పాదములతాకిడి కలిగెను. కొమ్మనుంచి మరియొక కొమ్మకు బోవునపుడు తాకిడియేగాక ఉల్లంఘన కూడ కలిగెను. ఆదోషమువలన వానికి నాకాశగమనశక్తి నశించి భూమిపై నడచుటకు కూడ నశక్తుడై కుంటివాడయ్యెను. మరియు పిచ్చివాడయ్యెను. అాదువలన వలలోబడిన లేడివలె పారిజాత వృక్షమునుండి క్రిందబడెను. సత్యజిత్తు ఆ పూదోటలో నాగుహ్యక చోరుని సమీపించి గట్టిగా వానిం బట్టుకొని యిట్లనెను. ఓయీ! నీవెవడవు ? ఎవరివాడవు? ఎందులకీ పుష్పములను ప్రతిదినము దొంగిలించుచుంటివి? యీపువ్వుల నెవ్వరికిచ్చుచుంటివి? చెప్పుమని యడుగగా గుహ్యకుడు నిజస్థితి నిట్లు చెప్పసాగెను. నేను ఆకాశమందు సంచరించువాడను, గుహ్యకుడను, దేవేంద్రుని సేవకుడను మా ప్రభువగు దేవేంద్రుని యాజ్ఞవలన పువ్వుల నపహరించి ఇంద్రున కిచ్చుచుంటిని. అట్టి నన్ను కుంటివానిగా నీ ప్రజ్ఞ వలన చేసితివిగాన నీవు మహాబుద్ధిమంతుడ వగుదువు అని పల్కెను. సత్యజిత్తు ఆ మాటలువిని వాని నచ్చటనేవిడిచిపెట్టి తన యింటికి వెడలెను. గుహ్యకుడు కుంటివాడై మూడుదినములిట్లేయుండిపోయెను

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు నిరువదవ అధ్యాయము

—o—

# ఇరువది యొకటవ అధ్యాయము

"గృత్స్నమదుడు జహ్నూ మహర్షితో యీరీతిగా పలుకు చున్నాడు. జహ్నూ ! వినుము యీరీతిగా గుహ్యకుడు పారిజాత వనమందు కుంటివాడయి పడియుండుటచే దేవేంద్రునకు పుష్పములు చేరలేదు. దేవేంద్రుడు అందులకు కారణమేమై యుండునని తలంచి గుహ్యకుని బిలువపంపెను. కాని వానింగానక విచారించిన వాడయి సమీపమందుగల దేవతలతో నిట్లు పలికెను దేవతలారా ! పుష్ప లను దెచ్చు గుహ్యకుడు రాలేదు. కారణము తెలియదు కారణ మును తెలిసికొనవలెను. నేను పిల్చుచున్నను మీరును నాతో వెంట రండు అని చెప్పి ఇంద్రుడైరావతము నెక్కి దేవగణ సహితుడై తొందరగా పారిజాతవృక్షముగల పుష్పవాటికకు వచ్చెను. అచ్చట గల పుష్పముల నన్నిటిని గూడ దేవేంద్రాది సమస్త దేవతలును కోసిరి దేవేంద్రాది సమస్త దేవతలును పుష్పములను గోయునపుడు విష్ణు నిర్మాల్యమును దాటవలసి వచ్చెను. ఆ దోషముగలన వారికి ఆకాశ యాన మడుగంటినది. కుంటివారైరి. వాహనములతో గూడ యెంత మాత్రము కదలలేక అచ్చటనే విచారించుచు నుండిరి. సత్యజిత్తు యిట్లు దురవస్థపాలై యున్న దేవేంద్రుడు మొదలగు దేవతలను చూచి ఆశ్చర్యముతో విచారించి, వారికి నమస్కరించి బద్ధాం జలుడయి వారితో యిట్లు చెప్పెను ఇంద్రాది దేవతలారా! మీరు చిన్నదైన ప్రయోజనమునకు యిట్లు బద్ధులై విచారమును పొందు చుంటిరి. కాబట్టి మీరు స్మృతింపలు అగుచున్నారు. అనుట విని దేవ తలు తలలువంచుకొని వైనతేయుడు మొదలై పక్షులు తనమమాంసా హారముకొఱకు భూమి యందుండి యెంతవిచారమును పొందుచుం దునో అట్లే పుష్పములయందుండు ఆశచేత! మేముయిచ్చట బలములేక పడియుంటిమి గాన మాకు ముందుగతి యేమి చెప్పుమని యడిగిరి,

సత్యజిత్తు వారిమాటలకు బదులుపలుకక తన కుటీరమునకు జనెను. ఆపూదోటయందువిచారగ్రస్తులై ఇంద్రాదులు పదకొండు దినము లుండిరి. వారికి అమృతాహారములేదు. ఏకోరికకోరిన నాకోరికనిచ్చు స్వర్గలోకము లేదు. గాన నిరాహారులై విచారముతో భూలోకమున పడియుండిరి. అందువలన యింద్రియములందు శక్తిలేక క్రమముగా నచ్చుటనే మూర్ఛను పొందిరి. సత్యజిత్తు మరల వారిని చూచి అంతటను విష్ణుపూజా నిర్మాల్యమునుతుడిచివేసి దయగలవాడై తాను గూడ భార్యాసహితుడై దేవతలతోబాటు నుపవాసము చేసెను.

స్వర్గలోకమున మిగిలి యున్న దేవతలు తమ ప్రభువగు దేవేంద్రుడింతకాలమురాకపోయెననువిచారించివారందరునుబయలు దేరి యీ పారిజాత పుష్పవాటికకు వచ్చిరి. అచట భూమియందు మూర్ఛాగతులై పడియున్న దేవతలను, దేవేంద్రునిజూచి మిగుల కోపము వహించి బలముగలదను గర్వముచేత పారిజాత వృక్షమును మొదలుతో గూడపీకివేయుటకుప్రయత్నము చేసిరి. కాని వారెంతగా పెనగులాడినను పారిజాతము కొంచెము కూడ కదలలేదు. కొంత సేపు అట్లుపెనుగులాడి, లాగి చేతులుపీకుటయేగాని చెట్టు కదలుట లేక ఆప్రయత్నమును మానిరి. నారదుడు ఆకాశము నుండి యీ విషయమంతయు చూచి, దేవతలందరును మూర్ఛాగతులై విచారిం చుటచూచి అత్యాశ్చర్యమునుపొంది తద్దోషనివారణార్థము మిగి లిన దేవతలను తీసికొని విష్ణులోకమునకుజనెను. నారదుడు అచ్చట దయాసముద్రుడైన నారాయణునికి నమస్కారముగావించి శిరస్సున చేతులు జోడించి స్తోత్రము చేయనారంభించెను. ఆర్తులను రక్షింప కంకణము కట్టుకొనినవాడా! నీటియందు పడక నేర్పరచుకొనిన నారాయణా! గోవులను పాలించువాడా! దేవతలకు అధిపతివైన వాడా! శ్రీహరీ! రమావల్లభా సర్వప్రపంచమునకు భర్తవు అయిన

వాడా! ముఖముల నిచ్చువాడా! పద్మములవంటి కండ్లు గలవాడా! సూర్యుడు, చంద్రుడు, అగ్నిహోత్రుడు ననేకులయొక్క కాంతిపుంజములచేత ప్రకాశించువాడా! నీకు నమస్కారము. కృష్ణా నాశనము లేనివాడవు. ఆదిదేవుడవు. పురాణపురుషుడవు. అన్ని లోకములకు అధిపతివి. గరుత్మంతుడు పతాకమందు గలవాడవు. అట్టి నీకు వందనము శ్రీహరీ! అనంతుడవు విష్ణుమూర్తివి. పాలసముద్రమందు శయనించువాడవు. శేషపాన్పుపై లక్ష్మీదేవిని కౌగలించుకొని నిద్రించు నీకు నమస్కారము.

నారాయణా! నీవు స్వర్గలోకములకు పాలకుడవు. విశ్వమంతయు నడుపువాడవు. సర్వేశ్వరుడవు. సర్వగతుడవు, సర్వమునకు ఆధారభూతుడవు, సురలకు నాయకుడవు. అట్టినీకు వందనము పరమేశా! యీ ప్రపంచమంతయు నీవే సృష్టి చేయుచున్నావు. నీవే సత్యమైన స్వరూపము కలవాడవు. నీవే పురుషుడనదగిన వాడవు, నీవే గుణముల కతీతుడవు, గుణాధ్యక్షుడవు, శాశ్వతమైన వాడవు, పరబ్రహ్మ స్వరూపుడవు. బ్రహ్మయు, విష్ణువును, శివుడును నీవే పురుషోత్తమా! నీవే సృష్టి స్థితిలయములకు మూలకారకుడవు. త్రిగుణాత్మకుడవు. త్రిగుణాధారుడవు, త్రిమూర్తి స్వరూపుడవు, త్రయీశ్వరుడవు నీమాయల వల్లనే స్థావరజంగమ రూపమైన యీ ప్రపంచము ఉద్భవిల్లినది. శేషపన్నగమందు శయనించిననీవు యీ విశ్వమంతయు ఏకసముద్రముగా నగునప్పుడు జగమంతయు లయమొనరించి నీవు మాత్రము మిగిలి యుందువు. ఈజగత్తున నీవే ముఖ్యుడవు శాశ్వతుడవు స్వయం ప్రకాశుడవు జగత్తుకు కారణభూతుడవునీవే. ఈజగత్తుకు లోపల, బయట కూడ వ్యాపించి యుండువాడవు నీవే.

కృష్ణా! నీవు సర్వ వ్యాప్తివై జగత్తునఉండుట, లేకపోవుట అను భావములందు ప్రకాశించుచున్నావు. నీవు సమస్తలోకములకును తల్లివి, తండ్రివి. లోకములందు దోషులను శిక్షించి సుఖముల నిచ్చువాడవు. గురుడవు ఈ స్థావర జంగమాత్మకమైన సర్వ ప్రపంచము నీయందే అణగియున్నది. ప్రభో! నన్ను రక్షింపుము. నీకు నమస్కారము. దేవతల కధిపతియగువాడా! వందనము. ఈ విధమైన నారదుని స్తోత్రమును నారాయణుడు విన్నవాడై యేమియు తెలియనివానివలె నారదునితో నిట్లనెను.

నారదా! కుశలమేకదా! నీవిప్పు డెందుల కిచ్చుటికి వచ్చితివో చెప్పుము. నీవు వాంఛించు కార్యము దేవతలకు, రాక్షసులకునుగూడ కష్టసాధ్యమైనను తప్పక వెంటనే చేయుదును. అని శ్రీకృష్ణుడు పలుకగా విని నారదుడు తాను వచ్చిన కార్యమును గురించి చెప్పుటకు మిక్కిలి సిగ్గుజెంది కృష్ణా! యేమని చెప్పవలయును? ఇంద్రుడు మొదలగు దేవతలందరును గొప్పయాపదను కలిగించు కార్యమును చేసిరి. భూలోకమును పాలసముద్రతీరమున పారిజాతమను నొకవృక్షము గలదు. ఆ పారిజాత పుష్పములు చాలా అందమైనవి మనస్సున కానందకరములుగా నుండెను. అని చూచి ఆశ్చర్యమును పొంది దేవేంద్రుడు సపరివారముగా దొంగతనముగా ప్రతినిత్యము పువ్వులను దెప్పించి అనుభవించుచుండెను. అంతతో తృప్తిజెందక రంభాదుల మాటలను విని భూలోకమునకు దేవతలను వెంటబెట్టుకొని వెళ్ళి ఆ పారిజాత వృక్షము మొదట అగ్నిహోత్రమందుబడిన మిడుతలవలె పడియుండిరి. అమృతాహారులైన దేవేంద్రునకు, దేవతలకును గూడ పదకొండు దినముల నుండి కొంచమైనను భోజనము లేదు. అందువలన వారు బాధజెంది మరణ సమానమైన మూర్ఛలో బడియుండిరి. గనుక నీ సేవకులైన

ఇంద్రాది దేవతలను రక్షింపుము అని విన్నవించిన నారదుని పలుకులను విని, భక్తులయందు కరుణ గలవాడును, సర్వదేవతలకు ప్రభువును, భగవంతుడునగు శ్రీమహావిష్ణువు నారదునితో నిట్లు చెప్పెను.

నారదా! అమృత కలశమునుండి క్షీరసముద్రతీరమున, అమృతబిందువులు పడుటవలన, ఆస్థలమందు తులసీ, పారిజాతములను రెండు వృక్షములు పుట్టినవి. అని రెండు అమృతోత్పాదితములు గనుక పవిత్రవృక్షములు అయినవి. సత్యజిత్తను శూద్రుడు దరిద్రుడగుటచే అదృష్టవశమున యిట్లు లభించిన చెట్లకు నీళ్ళుపోసి పెంచి పూదోట నేర్పరచి ఆ పుష్పములవలన జీవించుచుండెను. ఇంద్రుడా పుష్పములను ఆశించి దొంగతనముగా హరించెను. సత్యజిత్తు ప్రతినిత్యమును పువ్వులనుగానక విచారించి, శ్రీవిష్ణుదేవుని పూజించు పత్రపుష్పాది నిర్మాల్యమును యీ పూదోటయందు జల్లెను. మఱునాడు వారు వచ్చి పుష్పములను గోయుచు దేవేంద్రాది దేవతలందఱును ఆ విష్ణు నిర్మాల్యమును దాటిరి. అందువలన పాదస్పర్శము సంభవించినది! గాన వారి ఆకాశగమనము నశించి కుంటివారై అచ్చటనే పడియుండిరి. ఈ దోషమంతయు, నాయొక్క ఫలపుష్ప పత్రతోయాది పూజానిర్మాల్యమును పాదములతో త్రొక్కుటచేతను, దాటుట చేతను సంభవించినది. తెలిసిగాని తెలియకగాని నాకు సమర్పించిన పత్రపుష్ప ఫలగంధ నైవేద్యాది నిర్మాల్యమును, నాకభిషేకించిననీటిని, పాదములతో దాటినవాడు త్రొక్కినవాడు, పాదస్పర్శ గావించినవాడు, యీ లోకమందును, పరలోకమందును, కుంటివాడై యుండును. సత్యజిత్తు ఇంద్రాది దేవతలను జూచి యింకను యెవ్వరి కేమి దోషము కలుగునో యను భయముకలవాడై ఆ నిర్మాల్యమును

తుడిచివేసెను. ఇంద్రుడు మొదలగు మురా దోషములను పరిహారమును యెఱుంగలేక తిండిలేక అచ్చటనేపడి విచారించుచుండిరి. ఆషాఢశుద్ధ పాడ్యమి మొదలుకొని పదకొండు దినములు అమృతాశనులగు దేవతలకు భూమియందు తిండిలేకపోయెను. ఇంద్రుడు దేవతలతో గూడ తిండిలేక చావుతో సమానమైన మూర్ఛను పొందెను. సత్యజిత్తును, దేవతలకు తిండి లేనందున, తానును భార్యతో గూడ ఉపవాసవ్రతమును చేయుచు, దేవతల జీవనార్థమై నన్ను ప్రతినిత్యము పూజచేయుచుండెను. ఇంద్రుడు మొదలగువారు మూర్ఛను పొందినది మొదలు నేటితిథి ఏకాదశి ఈఏకాదశీతిథి యందు సత్యజిత్తు భక్తిగలవాడై సర్వవిధోపచారముల చేతను నన్ను పూజించి, నాసన్నిధిని నారాయణ మంత్రమును జపము ఆచరించి రాత్రియంతయు జాగరణము చేసిన నే నతనికి ప్రసన్నుడను కాగలను. పిమ్మట సకలమును సమకూడును. అని నారదునకు శ్రీమహావిష్ణువు ఆజ్ఞను యివ్వగా హరిభక్తియందు అసక్తికల నారదుడు హరిని పూజించి ఆకాశమార్గమున నటనుండి కదలి వెళ్ళెను.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు నిరువదియొకటవ అధ్యాయము.

—0—

## ఇరువది రెండవ అధ్యాయము

గృత్సమదమహాముని జహ్నుమహర్షితో మరల చెప్పుచున్నాడు. జహ్నుమహర్షీ! సావధానుడవై వినుము. చెప్పెదను. సత్యజిత్తు దేవేంద్రాది దేవతలయొక్క దోష నివారణమునకై

ఆషాఢశుద్ధ ఏకాదశినాడు తన యింటియందు భార్యతో గూడిన వాడై గోవిందుని పత్రపుష్పఫల చందన, ధూప, నైవేద్యములచేత భక్తితో పూజచేసి ఆ విష్ణుదేవుని సాన్నిధ్యమందు నారాయణ మంత్రమును. జపించుచు ఆ రాత్రియంతయు జాగరణమును చేసెను. శ్రీహరి, సత్యజిత్తువలన యీవిధముగా పూజింపబడి, అతని గృహమందు ఆ ఏకాదశినాడు మొదటిజామున సత్యజిత్తున కభీష్టముల నిచ్చుటకై, ప్రత్యక్షమయ్యెను. ఆ ప్రసన్నుడైన విధమును వర్ణించిచెప్పెదను వినుము. నీలమేఘమువంటి శరీరకాంతి గలవాడును నీలపు ముంగురులచేత కూడియుండువాడును, పద్మపత్ర విశాలనయనుడును, లలాటమందు తిలకముచేత ప్రకాశించువాడును విచిత్రములైన కుండలములచేత ప్రకాశించుచున్న గండభాగములు గలవాడును, కోటిభాస్కరుల కాంతితో సమానమైన కిరీటముచేత శోభించువాడును, ముత్యాలహారములు రత్నాలహారములు కంఠభూషణములు, కంకణములు లోనగు వివిధములగు మణిభూషణాలంకార విరాజమాన దేహుడును, మెఱపునుబోలి ప్రకాశమానమగు పట్టుపీతాంబరమును కట్టుకొనినవాడును, పిక్కలు, తొడలు పిఱుదులు, చీలమండలు గలిగి, పద్మములవంటి పాదములు గలవాడును లక్ష్మీదేవితోగూడ గరుడవాహనరూఢుడైనవాడును, మునీశ్వర గణముచే సేవింపబడిన పాదరాజీవములుగలవాడును, అగు శ్రీమహావిష్ణువు, భక్తప్రియుండగుటచే, తనభక్తుడైన సత్యజిత్తునకుసాక్షాత్కరించెను. స్వయంప్రకాశుడును, మందస్మితుడును అగు ఆపరమపురుషుని జూచి సత్యజిత్తు యితడు సాక్షాత్ శ్రీమహావిష్ణువని గ్రహించి సంభ్రమాశ్చర్యములతో సంతోషమును పొందెను.

భక్తవల్లభుడైన భగవంతుడు భార్యాసహితముగా నున్న సత్యజిత్తును వరముకోరుము యిచ్చెదనని పలుకగా, భక్తియే పరమార్థముగాగల సత్యజిత్తు తన మనస్సున పూర్వమునుండి తలంచి యుంచిన విషయము నిట్లుచెప్పెను. భగవంతుడా ! దేవేంద్రునకు, ఆతని పరిచరులగు దేవతలకు ఆకాశమున తిరుగుశక్తిని ప్రసాదింపుము. అమృతాహారముచేతవారి మనస్సులకు శాంతిని చేకూర్పుము. నాకును, నా భార్యకును నీ సన్నిధానమున నుండునట్లు వరమిమ్మని యడుగగా విష్ణుమూర్తి యందుల కంగీకరించి భక్తశేఖరా ! యీ ఆషాడశుద్ధ ఏకాదశీతిథి యన్ని పుణ్యఫలములను యిచ్చును. ఈతిథి యందు నేను నీకు ప్రత్యక్షమైతిని గాన యీఏకాదశీతిథి నాకు పరమ సంతోషదాయకమై యుండును. గాన నీవు నీ భార్యతో గూడికొని పరమానందముతో యీ పారిజాత వృక్షమును దీసి స్వయముగా దేవేంద్రునకు యిమ్ము, పరమపవిత్రమై, పూదోటయందున్నదియు, నాకు భార్యయు అగు యీ తులసీ వృక్షమును నాకొసంగుము. నీకు అందువలన మేలు చేకూరగలదు అని చెప్పినంత సత్యజిత్తు తన భార్యతో సహా ఆరాత్రి జాగరము పూర్తిచేసి సూర్యోదయ సమయమునకు పూదోటకు వెళ్ళెను. పారిజాతమును పెకిలించి, ఇంద్రాదులను మేల్కొలిపి వారికిని, తులసిని శ్రీమహావిష్ణువునకు యిచ్చెను. ఇంద్రాది సమస్త దేవతలును తమ తమ వాహనములనెక్కి యెదురుగా నున్న విష్ణువునుగాంచి నమస్కరించిరి. అందరును సర్వేంద్రియములచేత సంతృప్తులైరి.

శ్రీహరి ఇంద్రాది దేవతలందరు వినుచుండగా చిరునవ్వుగల ముఖముతో భార్యతో గూడియున్న సత్యజిత్తునకిట్లు చెప్పెను. పుణ్యమును యిచ్చునదియు, వ్రతములలోకెల్ల అత్యుత్తమమైనదియు, నీచేత బహుశ్రద్ధతో చేయబడినదియు నగు యీ ఏకాదశీ వ్రతము

మానవులకు మిక్కిలి పాపనాశనకరమై యుండును అజ్ఞానులై నరకమును పొందిన నరులు పాడ్యమి మొదలు, దశమివరకు భోజనము క్రమరీతిని చేయుటచే ఏకాదశినాడు భోజనము మాని ఉపవసించుట మరచుచున్నారు. ఎవరు ఏకాదశియందు ఉపవాసముచేయుదురో, ఆ రాత్రి జాగరముండి నన్ను బూజింతురో వారు నాదయవలన సుఖవంతమగు నాస్థానమగు వైకుంఠము జేరి సుఖింపగలరు. ఈ ఏకాదశి నాకు పరమసంతోషకరము, పవిత్రవంతము శుభప్రదము, మరియు, వేయి అశ్వమేధ యాగములు చేసిన ఫలమును యివ్వగలదు. పుణ్యాత్ములగు మునీశ్వరు లీ పవిత్రమైన ఏకాదశితిథిని హరివాసర మందురు. అలాగుననే దేవేంద్రాది దేవతలకు ప్రాణములను తిరిగి యిచ్చినందున యీ ద్వాదశీతిథి విధి ప్రీతికరమైనది. ఎవరయినను తెలియక ఏకాదశియందు అన్నమును తిందురో వారు బ్రహ్మహత్యాది మహాఘోరపాపములను పొందుదురు.

దశమి తిథియందు మధ్యాహ్న కాలమున ఒకమారు భోజనము చేయవలయును. రాత్రి కాలమున భోజనము మానవలెను, ఏకాదశినాడు రెండుపూటలయందును భోజనమునువదలివేయవలెను. ద్వాదశియందును మధ్యాహ్నమున ఒకమారుమాత్రమే భుజింపవలెను. రాత్రి భోజనము చేయగూడదు. ఇది పూర్తియైన ఏకాదశీ వ్రతము అనబడును. ఇట్లు చేసిన నేకాదశీవ్రతము సంపూర్ణమైనఫలితము నిచ్చును. తెలియక నజ్ఞానము చేత నేకాదశీ తిథియందు అన్నమును భుజంచినయెడల ఆయన్నము అన్నము గానేరదు. క్రిములచేత నిండియున్నదని తెలియవలెను, పుణ్యములను యిచ్చునట్టి హరివాసరమైన ఏకాదశియందు ఉపవాసముచేసి, ఆరాత్రి జాగరము చేసి నన్ను విధ్యుక్తముగా పూజచేసినవాడు నాకు పరమ ప్రియుడయి

అంతమందు నాస్వరూపమునే పొందును. ఈ ఏకాదశి బహుపుణ్య ఫలదము కోటికులములను ఉద్ధరింపగల శక్తి కలది. మహాపాతక కోటులను నశింపజేయును. అనేకవేల యజ్ఞములు చేసిన ఫలిత మొసంగును. బ్రాహ్మణుడుగాని, క్షత్రియుడుగాని, వైశ్యుడుగాని, శూద్రుడుగాని, ఆడుదిగాని, యోగీశ్వరుడుగాని, యతీశ్వరుడుగాని, సన్న్యాసిగాని, సాధువుగాని, బాలుడుగాని, ముసలిగాని, గృహస్థు గాని, వానప్రస్థుడుగాని, మరియెవ్వరయిననుగాని, దేహధారులైన వారందఱు నామాట ప్రకారము ఒకమూరైనను, అజ్ఞానముచేత నయినను ఆశచేతనయినను, తెలియకనయినను, ఏకాదశియందు భోజనము చేయకూడదు. అట్లు భోజనము చేసిన వారిని యమ ధర్మరాజు నాయాజ్ఞ ననుసరించి మిక్కిలికోపముతో దండించును. అట్లు నరకమందు చాలా కాలముండి తిరిగి యీ భూలోకమున కష్టపడు జీవులుగా పుట్టగలరు. ఏకాదశి తిథినాడు స్త్రీని స్పృశింప గూడదు. ఆలింగనము చేయరాదు. నిద్రించరాదు. అన్నము తిన రాదు. నన్ను పూజించి నాపాద తీర్థమును స్వీకరించినవాడు సుఖ వంతుడై పరబ్రహ్మమును పొందగలడు.

కాబట్టి సమస్తమైన మనుష్యులును అన్ని నెలల యందును ఏకాదశి ఉపవాసమును చేయవలయును. దానివలన అన్ని పాప ములు నశించును. కృచ్ఛ్రచాంద్రాయణ వ్రతములచేతను తదితర మైన వ్రతములచేతను, మానవులేఫలితమును పొంద కలుగుదురో అట్టి ఫలము యీ ఏకాదశి తిథియందుపవాసము చేసినందు వలన గలుగును. ఏకాదశి మిక్కిలి పుణ్యమును యివ్వగలదని లోకమందు ప్రఖ్యాతి గలదు. అని శ్రీ మహావిష్ణువు చేతులనుపైకి యెత్తి వక్కాణించెను. మనుష్యులు, మునీశ్వరులు, యోగీశ్వరులు నాభక్తులైనవారు మఱి యెవరు ఏకాదశియందు భోజనము చేయ

గూడదు. అన్నికాలములందును, రెండు పక్షములందును, ఏకాదశినాడుపవసించవలెను. అట్లు భోజనము చేసినవాడు పరమపాతకుడనబడును. ఉపవాసము చేసిన వాడు నా సాన్నిధ్యమును చేరగలడు. నామాట యథార్థము నమ్ముడని చేతులెత్తి గట్టిగా పలికెను.”

ఇదిస్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున నిరువది రెండవ అధ్యాయము.



## ఇరువదిమూడవ అధ్యాయము

“గృత్సమదుడుజహ్నుమహర్షితో చెప్పుచున్నాడు: జహ్ను మహర్షీ! వినుము దేవాదిదేవుడైన శ్రీమహావిష్ణువు దేవేంద్రుని జూచి మిక్కిలి దయగలవాడై దేవేంద్రా! నీవు యిప్పుడు అతి వేగముగా పారిజాతవృక్షమును తీసికొని నీస్వర్గమునకు పొమ్మని పలికెను. దేవేంద్రుడు వల్లెయని శ్రీహరికి నమస్కారము చేసి స్వర్గలోకమునకు పోయెను. ఇంద్రుడు స్వర్గమునకు వెళ్ళగానే తులసీదేవి మానవుల మాటలతో విష్ణుదేవునితో యిట్లుపలికెను. విష్ణుమూర్తీ నేను నీపాద సరోజములను ఆశ్రయించి యున్నదానను. నన్ను రక్షింపుము. నీవుతప్ప వేరే గతిలేదు. ఎవరున్నను ఎవరిని మాత్రము కోరుదానను గాను అని తులసీదేవి పలుకగా శ్రీహరి విని యిట్లు పలికెను. భూలోకమున అమృతబిందువుచే పుట్టిన తులసీదేవీ! నీవు నాకు భార్యగా నుండుము. నన్నుపొందుము. నిన్ను నా మనస్సునను ఉంచుకొందును. నీకు యీ విషయమైన అనుమానముకూడదు. పాపములను నాశనము చేయు తులసీదేవీ! దళముతో కూడియున్న మనోహరమైన నీ స్వరూపమును జూచినవారు గంగాస్నాన మాచ

రించినవారివలె వెంటనే పవిత్రులు అగుదురు. సుకోమలమైన నీపల్లవదళములతో నన్ను పూజించువారు నా రూపమునే పొందగలరు. మరియు వారికి పునర్జన్మలేదు. తులసీదేవీ! సుకోమల పల్లవదళయుతమైన నీదండను నిర్మించి నాకంఠమునందు నలకరించువాడు, వెయ్యికోట్ల కల్పములును, నూరుకోట్ల కల్పములును వైకుంఠమునందు సుఖముగానుండి పిమ్మట నాయందు లీనుడు కాగలడు. ఏనరుడు నిన్ను యింటియందుగాని, తోటయందుగాని, నీరుపోసి పెంచునో వానికి మహాపాతకము అంటనేరవు. ఉదయకాలమందు నిద్ర లేచి నిన్ను చూచినదినమే మంచిదినము అట్టి నరుడు సుఖమును పొందును.

తులసీదేవీ! నీదళములతో కూడిన నీటిని దేహమంతటను చల్లుకొనినవాడు, పరమ అపవిత్రుడైనను పవిత్రుడు కాగలడు. నీ చెట్టుమొదటగల మట్టిని నుదుట ధరించువాడు సౌఖ్యమును పొందును. అట్టివానిని యక్షరాక్షస పిశాచగణములు యేమియు చేయులేవు. వాటివల్ల భయములేదు. త్రిలోకపావనియగు తులసీ! నిన్నును లక్ష్మీదేవిని కూడ నేను సమానముగా జూతును. నీవును లక్ష్మియు తోబుట్టువులు గాన మీరిరువురును నాకు సమానులు; లక్ష్మీదేవి పాలసముద్రమునందు బుట్టినది. తులసీదేవి ఆ పాలసముద్ర తీరమందు పుట్టినది. గాన యిరువురును సోదరీమణులగుదురు. ఈ విధముగా తులసీ దేవికి వరమిచ్చి రమాభర్తయగు విష్ణుమూర్తి వివిధ శాఖలతో కూడిన తులసీ దేవిని సౌఖ్యవంతములగు తన చేతులతో తాకెను. విష్ణుమూర్తియొక్క హస్తస్పర్శవల్ల ఆ తులసిదేవి సర్వ శోభావంతమయ్యెను. ఆతులసీదేవి మంచిరూపము, గుణము, గలిగిన స్త్రీయయ్యెను. పిమ్మట మహానుభావుడైన రమాధవుని పాదసరోజములకు ప్రణమిల్లి వెంటనే శ్రీహరియంశను గాంచెను. పిమ్మట

భగవంతుడును, మాయామయుండును, జగద్భర్తయు నగు రమా వల్లభుడు లోక పవిత్రమైన తులసీ దేవిని దుర్మార్గులైన మానవుల కొరకు ప్రఖ్యాతిగా స్థాపించెను.

శ్రీహరియొక్క ఎడమ చేతితో నెచ్చట ముట్టబడినదో, ఆ భాగమంతయు తులసీదేవికి కొమ్మలయందు కృష్ణవర్ణము కలిగెను. అట్టి తులసి కృష్ణతులసి యని ప్రఖ్యాతి జెందినది. ఈతులసీవృక్షము నకు సమీపమునగల చెట్లన్నియు పవిత్రములైనవి. గాన భూలోక మున తులసి పవిత్రమైనదియు, పుణ్యము నిచ్చునదియుగా చెప్పబడు చున్నది. ఈ తులసీవృక్ష మెచ్చట గలదో ఆభూమి పాపమును హరించునది యగును. సుందరస్వరూపము గలదియు, సమస్తపుష్ప ములకంటే అందమైనదియునగు తులసీదళమును తీసుకొని తరువాత విష్ణువు భక్తుడైన సత్యజిత్తునితో యిట్లనెను. సత్యజిత్తూ! వెంటనే నా పూజను చేసి, బ్రాహ్మణులయొక్క సంతర్పణము సంతృప్తికర ముగా చేసి నీవును భోజనము చేయుము. ఆలస్యము చేయకుము అని శ్రీహరి చెప్పగానే సత్యజిత్తు ఆ మాటలను విని శ్రీహరిని పూజించి మిగిలిన ప్రసాదమును గ్రహించెను. గరుడవాహనా రూఢుడైన భగవంతుడు యీ రీతిగా ఏకాదశీ వ్రతమును సమాప్తి చేయించి తన భక్తులగు సత్యజిత్తును, అతని భార్యను తులసిని ఆ గరుత్మంతుని మీద నెక్కించుకొని సమస్తభూతములకు దర్శన మిచ్చుచు, తన నిలయమగు వైకుంఠమును జేరెను.

జహ్నుమునీ! ఏకాదశీవ్రతము యీ విధముగా సవిస్తర ముగా దెల్పితిని. మహిమను విధానమును దెల్పితిని. ఇది అశ్వమేధ యాగమువలన కలుగు ఫలితమునిచ్చును. చాలా సుఖప్రదము, ఈ మాఘమాసమున ఏకాదశి మిక్కిలి సుఖదాయకము గనుక మాఘ శుద్ధ ఏకాదశియందు ఉపవాసమును చేసి, రాత్రి జాగరణముండి

శ్రీహరిని పూజించిన వాడు యిహలోకమందనేక సౌఖ్యములను అనుభవించి అంతమందు విష్ణుసన్నిధానమును పొందును. మాఘ మాసమున మకరరాశి యందు సూర్యుడుండగా శుద్ధయేకాదశినాడు ఉపవాసవ్రత మాచరించని నరుడు అంతమందు బ్రహ్మరాక్షసు డగును. పాపనాశనమగు ఏకాదశిని ఉపవసించి ద్వాదశినాడు పారణచేయువాడు సమమగు పుణ్యమును పొందగలడు.

మాఘశుద్ధ ద్వాదశి దినమున శ్రీహరిని ప్రీతికొరకై దూడతో కూడియున్న పాలనిచ్చు యావును పరమశ్రోత్రియుడైన, హరికథా శ్రవణమందాశక్తిగలవాడైన, కుటుంబీకుడైన విప్రునకు దాన మిచ్చువాడును, యీ ద్వాదశినాడు భూదానము, వస్త్రదానము, బంగారు దానము, సాలగ్రామదానము తిలదానము, ఫలము పెరుగు అన్నదానము, తాంబూలము, యజ్ఞోపవీతము మొదలగు దానము లను దక్షిణలతోకూడ చేయువారును, అంతమందు స్వర్గమందు సుఖమనుభవించి పిమ్మట భూలోకమున పుట్టి చక్రవర్తులై సౌఖ్య మునుపొంది, అంతమందు విష్ణులోకము చేరి భగవంతునితో గూడ శాశ్వతానందమును పొందుదురు. విప్రోత్తమా! నీ వడిగిన ప్రకా రము మూడులోకములందును పవిత్రమైన కథను నీకు చెప్పితిని. ఇది యిహపరలోక సుఖముల నిచ్చును. పాపహరమైన యీ కథను వినువారు యెంత అపవిత్రులైనను, పూతులై అంతమందు విష్ణుసన్ని ధిని జేరుదురు. ఈఅధ్యాయము శ్రీహరియెదుట భక్తియుక్తుడై వినువాడును, చదువువాడును, యిహలోకమందు అనేకభోగసుఖము లనుభవించి అంతమందు విష్ణుసాయుజ్యమును పొందును."

ఇదిస్కాంద పురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు నిరువది మూడవ అధ్యాయము.

# ఇరువదినాల్గవ అధ్యాయము

గృత్సమదుడు జహ్నుమహర్షితో చెప్పుచున్నాడు. జహ్ను మునీ! వినుము. మాఘస్నాన ప్రభావమును ధీమంతుడైనవాడు శ్రద్ధగలవానికి చెప్పనియెడల అట్టివాడు మహాపాతకుడగును. కాన శ్రీహరియొక్క కథలను వినుటయందాసక్తిగల మనస్సుతో నున్న నీకు చెప్పెదను. మాఘవ్రతము ఆచరించువాడు మహాపాతకములు చేసినను, పాపములు చేసినను, అట్టిపాపములనుండి విముక్తుడగును. ఈమాఘవ్రతము ఆచరించుటానికి సంక్రమించిన అజ్ఞానకృతమైన పూర్వగాథ యొకటి కలదు. దానిని చెప్పెదను వినుము. తొల్లి కళింగదేశమున కొందఱు తెలియక అజ్ఞానముచేత మహాపాతకము లను చేసిరి వారి చరిత్ర మీకు వినదగినది గాన చెప్పెదను వినుడు.

కళింగ దేశమందు చాలా ధనవంతుడైన ఒక కిరాతు డుం డెను. శూరుడును, పరాక్రమవంతుడును అగు నా కిరాతుడు తన సేవకబృందమును వెంటగొని, విల్లు కత్తి, బాణము, ఖడ్గములను ధరించినవాడై ప్రతిదినమును తిరుగు చుండును. అత డొకనాడు దురాత్ములైన తనజ్ఞాతులను తీసికొని బహువృక్ష లతాగుల్మాదు లతో నిండియున్న మహారణ్యమును చేరెను. వారు కుక్కల తోను జంతువులను బట్టుకొను వలలతోను ఆయరణ్యమందు మృగములకై వెదకిరి బంధనములచేతను, జిగురుపదార్థములచేతను, పూత్కార ములచేతను, పొదలమాటున దాగుటచేతను, గోతులుతీసియుంచుట చేతను మృగములు తిరుగులాడు అటవీమార్గములందు వివిధములైన ధ్వనులుచేయుటచేతను, ఏనుగులు, దున్నపోతులు, పెద్దపులులు,

ఎలుగుబంట్లు యిబ్బులు, మొదలగు అనేకములైన మృగములను, పక్షులను చంపి యీ యడవినుండి మఱియొక అడవికి బోదలంచి ఆలకిరాతు డిటునటు తిరుగుచుండెను.

ఆ సమయమున విధివశమున వేద వేదాంగ తత్వవిద్యా విశారదుడగు ఒక విప్రుడు అటవీ మార్గమున పోవుచు, మార్గాయాసమును పొంది, యెండవలన అలసిపోయి దరిగానున్న నర్మదా నదీజలమందు స్నానము చేయదలంచి స్నానముచేయుటకు శక్తి లేనివాడై పాంథులకు శ్రమదీర్చు మఱ్ఱిచెట్టునీడను, కొంతసేపు విశ్రమించి మార్గాయాసమును దీర్చుకొని తిరిగి వెళ్ళుటకై ప్రయత్నించెను. అంత నా దురాత్ముడైన బోయవాడు తన సేవకబృందమును గూడికొని విప్రుని దరి కేతెంచి ఆతని వస్త్రములు, పాదుకలు, గొడుగు దండము, పూసల పేరు, కమండలము మొదలగు అన్ని వస్తువులను అపహరించి తిరిగి విప్రునితో యిట్లనెను.

విప్రుడా! నీవద్ద దాచిన సొమ్మును నాకిమ్ము. అట్లుకాదేని నిన్నీకత్తితో చంపెదను. అని కిరాతుడు పలుకగా బ్రాహ్మణుడా దురాత్ముడైన కిరాతునితో ఓరీ! నే నెన్నడును కొంచమైనను ధనమును దాచలేదు. దరిద్రుడనగు నాకు ధనమెట్లు వచ్చును? గాన నావద్ద యేమాత్రము ధనములేదు. అని చెప్పెను. ఆవిప్రుని పలుకులను విని ఆ దురాత్ముడైన కిరాతుడు తన ఖడ్గమును దీసి ఆ బ్రాహ్మణుని శిరస్సును నఱికివేసెను. పిమ్మట తన పరివారమును గూడికొని తన గృహమునకు కిరాతుడు వెడలెను. యీ రీతిగా కష్టజీవుడైన కిరాతుడు ప్రతినిత్యము కల్లుత్రావుచు, కయ్యము లాడుచు, మార్గస్థుల సొమ్ము లపహరించుచు, అన్ని మార్గములందును, పట్టణములందును, పరిసర ప్రాంతములందును, పల్లెలం

దును, భయపరచుచు ప్రజలనుండి చాలధనమును సంపాదించెను. ఇట్టి బోయికి కొంతకాలమునకు గొప్పదైన తాపత్రయము కలిగెను.

బంగారమును అపహరించువాడును, దుర్మార్గుడును. ఆత్మ పోషణమందే ఆసక్తికలవాడును. అగుకంసాలి యొకడా కిరాతుని వద్ద జేరెను. ఆ కంసాలి బహు చతురోపాయవేత్తగాన ప్రతిదిన మందు తాను చేయు బంగారు భూషణములనుండి బంగారమును అపహరించుచుండెను. నాలుగు జాతులవారికిని అతడు నగలను చేయుచు చౌర్యము జేయుచుండెను. కిరాతుడు దినమందు దొంగ తనముగా సంపాదించిన దంతయు కంసాలి విక్రయమునకు కొను చుండెను. అందు మాయచేసి లాభమును పొందుచుండెను. క్రయ విక్రయ వృత్తిచేత కిరాతునకు స్వర్ణ కారునికిని స్నేహ మధికమగు చుండెను. కామాంధుడును దుర్మార్గవృత్తి గలవాడును, భాగ్య వంతుడును, ధర్మహీనుడును, పరస్త్రీ లాలసుడు అగు శూద్రు డొకడచ్చట నుండెను. ఆ శూద్రునితండ్రి చనిపోయిన పిమ్మట అతని తల్లియు సుందరమునగు మందహాసము గలదియు, విశాల నేత్రియునై, దుర్మార్గవతియు, వ్యభిచారిణియు గూడ నయ్యెను.

ఒకనాడాజారిణియగుశూద్రునితల్లి కృష్ణపక్షమునందుఅష్టమి తిథియందు సంభోగమందు యిచ్ఛగలదయి జారుని కొరకాతని గృహమునకు వెడలి చీకటిలో వానిరాకకై వేచియుండెను. కాని యాతడాదినము రాలేదు. ఆ రాత్రియందే తనకును కామ మధికము కాగా స్వేచ్ఛాసంభోగము సంభవింపగలదని తలచి శూద్రుడు తన తల్లి జారుడు తన స్నేహితు డగుటచేత నాయింటియందే చీకటిలో తల్లి వేచియున్న పంచనే తానును చేరెను. ఇరువురును ఒకరినొకరు తెలియక చీకటిలో నిద్రించిన కొంతసేపటికి శూద్రుడు నిద్రనుండి

లేచి తనజారుఁడే వచ్చినదేమోనని చేతులతో తడివిచూచెను. అంత నాచీకటిలో నొకయాముది యగుపడెను. జీకటియగుటవలనను, కామాతురు డగుటవలనను, శూద్రుడు, తన తల్లియని తెలియక నామెను కౌగిలించుకొనెను. ఆలింగనానంతర మామెతో సంభోగించెను. ఆ శూద్రునితల్లి జారునికొఱకై చూచుచున్నందున నిద్ర నుండి లేచి రతిసౌఖ్యమునందు లగ్నమైయున్నందున తనతో సంభోగించువాడు తనజారుఁడేనని తలచి వానిని బిగ్గరగాకౌగిలించుకొనెను. ఈరీతిని శూద్రుడును, వానితల్లియు క్షణమాత్ర రతిసౌఖ్యమునకు యిట్లుచేసిరి. శూద్రుడును సంభోగానంతరము రేతస్సును వడలగానే కౌగిలినిగూడ విడచి, యీామె యెవరైయుండునని యాలోచించి చూడగా యామె తనతల్లియైయుండెను. ఆమెయు నాజారుని తన కుమారునిగా తెలిసికొనెను. యిరువురును విచారించిరి.

జహ్నుమహర్షి ! వినుము ఆడువారికి ఏకాంతమందు అన్న గాని, తండ్రిగాని, కుమారుడుగాని, తమ్ముడుగాని, శిష్యుడుగాని ఒంటరిగా కనుపించిన వారి యోని ద్రవించును. గాన స్త్రీలు రహస్యముగా పురుషులు దొరికినయెడల, వారు కామాతురులయి తదావేశము నాపుకొనజాలక, వారితో నాలింగన సౌఖ్యమును, చుంబన సుఖమును కలిగించుకొని సంభోగమును చేయుటకు ప్రయత్నింతురుగాన దంపతులుగానివారు స్త్రీపురుషులెన్నడును యేకాంతమందు చేరరాదు. తల్లియు కుమారుడును లోకాపవాదుకు వెఱచి అగోప్యమగు కృత్యమును వెలిబుచ్చలేదు, గాని యిహమందు దాచిపెట్టినను పరలోకమున దుఃఖమనుభవింపక తప్పదు. పరలోకమున స్త్రీపురుషులు జేయు పుణ్యాపాపములను గురించి చెప్పుటకు పదునలుగురు సాక్షులున్నారు. సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని, ఆకాశము, భూమి, నీరు, మనస్సు, యముడు, రాత్రి, పగలు,

ప్రాతస్సాయంకాలసంధ్యలు ధర్మము, ననునవి చూచు చుండును. ఆశూద్రినితల్లి అనేకరీతులుగా విచారించి పశ్చాత్తాపము ను పొంది గంగలోపడి మరణించెను.

శూద్రుడుభయవర్జితుడయి సంచరించుచు సదాపరస్త్రీసంభోగమునందే కాలముగడుపుచు, తండ్రి సంపాదించినదంతయు నాశన మొనర్చి కిరాతునివద్ద భృత్యుడుగా చేరెను. తల్లితో సంభోగించిన ఆశూద్రపాతకుడు, ఉదరపోషణార్థమై కిరాతుడు చెప్పిన పనులన్నియు చేయుచు, వానికి ప్రియుడై యుండెను. ఈ విధముగా విప్రహంతకుడు సువర్ణస్తేయి గురుతల్పగామియగు ముగ్గురునొకేచోట జేరిసంతసించు చుండిరి. అంతట నాదేశస్థుడగు విశ్రృంఖలుడను విప్రుడొకడు వృత్తిలేక స్వపోషణజరుపుకొనలేక వచ్చి కిరాతునాశ్రయించి వీనినిసేవించుచు, పతివ్రతను విడనాడి, నిత్యమితనివద్దనే నివసించుచుండెను. ఆదుర్మార్గుడగువిప్రుడు స్నానసంధ్యాదులను వదలి నిత్యము కిరాతు నాశ్రయించి, వాని కనువర్తనుడయి, యనుగ్రహపాత్రుడై యుండెను. ఆకిరాతులందరుకును విశ్రృంఖలుడు పురోహితుడయి పుణ్యసమయములందు వారివలన దానములను గొనుచుండెను. ఈరీతిగా విశ్రృంఖలుడు కిరాతులతో రెండుసంవత్సరములుండెను, ఇట్లుబ్రహ్మహంతకుడు, సురాపానుడును, సువర్ణస్తేయి గురుతల్పగామియునగు వారితో కలిసిన విప్రుడు పంచమహాపాతకు లయిరి.

జహ్నుమహర్షీ! విశ్రృంఖలునకు మహాపాతకులతో సంసర్గము కలిగినదోషముచేత బ్రాహ్మణత్వము నశించెను. మిక్కిలిప్రేమతో మహాపాతకులతోనే విప్రుడే దినమున సంపర్కము కలిగించుకొనునో అట్టి విప్రున కాతనికి గల పుణ్యములో నాల్గవ భాగ మప్పుడే యంతరించును. రెండుదినములు మహాపాతకులతో సంచరించిన విప్రునకు అర్ధగా వారిని సేవించుట స్పృశించుట వారితో

శయనించుట, కూర్చుండుట, మాట్లాడుట. భుజించుట, రెండవ భాగము బ్రాహ్మణత్వము శూన్యమగును, మూడుదినము లట్లాచరించిన మూడు భాగములు నశించును. నాల్గుదినములకు నాల్గుభాగములు నశించును. అనగా పూర్తిగా బ్రాహ్మణత్వము నశించును. ఇంకను అధికముగా నట్టివారింగూడి సంచరించిన విప్రుడు వారితో సమానమగు మహాపాతకుడగును. ఇట్టి పాపమును చేసినవాడు నరకలోకముచేరి తిరిగి యటనుండి రాజాలడు. తెలిసియు తెలియక చేసిన నీచ పాపములన్నియు పోవుటకు మనువు మొదలగువారు ధర్మశాస్త్రములందు ప్రాయశ్చిత్త విధి కల్పించి యున్నారు. కాని తెలిసియుండి పూర్వజ్ఞానముతో చేసిన బ్రహ్మహత్యాది మహాపాతకములకు ప్రాయశ్చిత్తము యేశాస్త్రమందును చెప్పలేదు. తెలిసి చేసిన పాపము కొంచముగాని, తత్ఫలమును క్రమముగా అనుభవించి, పిమ్మట భూలోకమున బ్రహ్మరాక్షసియై వేయి బ్రహ్మకల్పము లుండిన గాని ప్రాయశ్చితకర్మకు అర్హుడుగాడు.

అజ్ఞానము వలన చేయబడినపాపము గొప్పదైనను, చిన్నదైనను ప్రాయశ్చిత్తముచేతను, పశ్చాత్తాపము చేతను, పవిత్రమగును. పశ్చాత్తాపమనగా పాపమును చేసిన పిమ్మట విచారమును బొంది నేనెట్టిపాపమును చేసితిని? ఎందు కిట్లుచేసితిని? యింకెన్నడును యిట్టిపాపము చేయను. నాకు బుద్ధి వచ్చినది ఈ చేసిన తప్పును మన్నింపుము నన్నురక్షింపుము శ్రీహరీయని భగవంతుని గూర్చి ప్రార్థించుట యందును వ్రతముచేతను, ఉపవాసముల చేతను, నియమములచేతను, శుష్కములచేతను, చాంద్రాయణ వ్రతములచేతను, మానవుడు గంగాస్నానము చేసిన వానివలె మోక్షమును పొందును. ఆవిప్రుడీరీతిగా కిరాతుని వద్ద రెండుసంవత్సరముల కాలముండిన పిమ్మట విధి వశమున ఒకనాడు కిరాతుడు

నియమింపగా వేరొక గ్రామమునకు వెళ్ళెను. అక్కడ రుద్రాక్ష మాలాధారుడును, విభూతి భస్మాలంకార శరీరుడును, కృష్ణాజినధరుడును, దర్భలను చేతియందు కలవాడును కరుణామయుడును, పండితులకు మోక్షము నిచ్చు పుణ్యతీర్థములను సేవించువాడును కృష్ణా! నారాయణా! మాధవా! గోవిందా! ముకుందా! శ్రీధరా! రాఘవా! కేశవా! విష్ణో! శ్రీహరీ యను నామములచేత రమావల్లభుని కీర్తించు వాడును, నగు వీరవ్రతుఁడను పేరుగల బ్రాహ్మణ శ్రేష్ఠుని చూచెను.

పాపకర్ముడైన ఆ విప్రాధముడు ఆ వీరవ్రతునకు ప్రదక్షిణ నమస్కారమును చేసి కృతాంజలుడయి అతని యెదుట నిలువంబడి యూరక ఉండెను. ఆవిప్రుడు బ్రహ్మతేజస్సుచేత విడువబడినవిశృంఖలుడను యీ బ్రాహ్మణాధముని జూచి మిక్కిలి ఆశ్చర్యమును పొంది నీవెవడవు? ఎచ్చటికి జోవుచుంటివని యడిగెను? విశృంఖలుడు వీరవ్రతునితో అయ్యా! మహానుభావా! నేను బ్రాహ్మణుడను నాకు జీవనము గడువక ఒక కిరాతునివద్ద నుంటిని అని చెప్పెను. వీరవ్రతుడాతని మాటలు విని మిగుల వింతనొంది, కమండలూదకము చేత కండ్లను కడుగుకొని రెండుగడియలకాలమట్లు కండ్లుమూసుకొని ధ్యానముచేసి పిమ్మట మరల కండ్లుదెరచిచూచి బ్రహ్మవర్చస్సును పోనాడుకొనియున్న విశృంఖలునితో నిట్లని పలికెను.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు నిరువదినాల్గవ అధ్యాయము.

— —

# ఇరువదియైదవ అధ్యాయము

"వీరవ్రతుడు చెప్పుచున్నాడు. ఓరీ! విశృంఖలా! విప్రాధమా! నీవు చేసిన సర్వవిధపాపములను వివరించి చెప్పెదను వినుడు. నీ యజమానియగు కిరాతుడు మిక్కిలి పాపములు చేసినవాడు. బ్రహ్మ హత్యాపాతకుడు. కల్లుద్రావుటయందగ్రగణ్యుడు, బంగారము దొంగి లించు పాపమును చేసినవాడు. వానికి మిత్రుడు కంసాలి యొకడు గలడు. అతడు ప్రతిదినము బంగారమును దొంగిలించువాడు. వీరిరువు రకును ఒక శూద్రుడు పరమమిత్రుడు కలడు. వారు తన్ను కన్న తల్లితో రమించినాడు అట్టిపరమ నీచునితో సాంగత్యమాచరించుట వలన నీకుగల బ్రహ్మతేజము నశించినది. వారు ముగ్గురు చేయుపాప ములన్నియు నీకు సంక్రమించినవిగాన నీకుపాప మపరిమితమయ్యెను. ఏ నరుడుగాని బలవంతముననైనను సహజమగు స్వభావముచేత నయినను, విధివశముచేత నయినను, ధనమును పొందుట కొరకయి నను, మహాపాతకులతోడను, పాపులతోడను, మాట్లాడుటగాని, వారిని చూచుటగాని, వారిని తాకుటగాని చేసినవాడు వారితో సమానమగు పాతకియగును. అట్లు ఒకప్పుడు వారితో మాట్లాడవలసి వచ్చినప్పుడు దర్భలను శిరస్సున నుంచుకొని భాషింపవలెను. అట్లు చేసినయెడల వానిని పాపములు అంటనేరవు. లేదేని పాపసంబంధము దప్పక సంభవించును. అట్టి మహాపాతకునితో, కలిసిమెలసి, తిండి, పడక, కూర్చుండుట, తాకుట, భాషించుట లోనగు చేష్టలను చేయు వాని పాపమును తొలగించుటకు యెవడు సమర్థుడు కాగలడు! అవి వర్ణనాతీతముగాన నీవట్టి కిరాతునితో సంపర్కము కల్గియుంటివి కాన నీతో మాట్లాడగూడదు. బ్రహ్మహత్య చేసినవాడు, కల్లు త్రాగినవాడు బంగారమును దొంగిలించినవాడు, సంసర్గము చేయ రానిస్త్రీలతో రమించినవాడు, వీరిస్నేహముగలవాడు, యీ అయిదు

గురు ప౦చమహాపాతకు లందురు. అట్టి వారితో నే నరుడు తెలిసి యుండి కలసిమెలసి తిరిగిన వానిని చండాలునిగాతలంచిదూరముగా నుంచవలెను. జహ్నుమునీ! వీరవ్రతు డిట్లు విశృంఖలునితో పలికి యూరకుండెను.

పిమ్మట విశృంఖలుడు పశ్చాత్తాపమును పొంది భయకంపితు డయి వీరవ్రతునితో నిట్లనెను. మహానుభావా! నాకు సమస్త పాప క్షయకరమగుకర్మను ప్రాయశ్చిత్తరూపముగానాచేత చేయింపుము. అని ప్రార్థింపగా వీరవ్రతుడు సమస్త ప్రాణులయందును దయను జూపు స్వభావము గలవాడుగాన విశృంఖలునియందు దయగలిగి మనువు మొదలైనవారు రచించిన ధర్మశాస్త్రముల ననుసరించి ప్రాయశ్చిత్తకర్మను చెప్పసాగెను. బ్రాహ్మణాధమా! విశృంఖలా! నీ వాచరించిన సాంగత్యరూపకముగా కలిగిన మహాపాతకమునకు ప్రాయశ్చిత్తమును చెప్పెదను వినుము. సదా పాపములను తలచు కొనుచు తీర్థములను సేవించుచు, నిత్యముగ్రామముల వెంట వెళ్ళుచు ప్రతి యింటికిపోయి భిక్షాటనముచేసి యాచించి తెచ్చుకొని భోజ నము చేయుచు పన్నెండు సంవత్సరములు నీవు యిట్లు వ్రతనియమ మును చేయవలెను. ప్రతిసంవత్సరము మాఘమాసమున ప్రయాగ నదియందు ప్రాతఃకాలమున స్నానముచేసి రమావల్లభుని సేవింపు చుండుము. ప్రయాగను స్మరించినంత మాత్రముననే మోక్షము కలుగును. ఇక స్నానముచేసిన కలుగు ఫలితము వర్ణనాతీతము. మహాపాతకుడు గాని, పాతకుడుగాని మాఘమాసమందు మకరరాశి యందు రవియుండగా ప్రయాగనదియందు స్నానము చేసినయెడల అతడా వెంటనే పవిత్రుడు కాగలడు. గాన నిరంతరము విడువక పన్నెండు సంవత్సరము లీప్రకారము నియమముతో తీర్థసేవచేసిప్రతి నిత్యము భిక్షాన్నమే తినుచుండవలెను.

పంద్రెండు సంవత్సరములు పూర్తిగాగాని, మొదటయందు గాని, మధ్యకాలమందుగాని, లేక ఆఖరుసంవత్సరము నందుగాని మూడుసంవత్సరములుకాని, ఒకసంవత్సరముకాని, ప్రయాగనది యందు మాఘమాసమున స్నానము చేయుము. ఈరీతిగా చేయుచు ఆవుపిడకలు మొదలైనవాటిచేత ఉడుకబెట్టిన అన్నమును ఒక నెలరోజులు తిninapimmata నీవు పవిత్రుడవు కాగలవు. ఇది యథార్థము. నామాటనమ్ముము అని చెప్పెను. విశృంఖలుడు వీరవ్రతుని మాటలనువిని, అట్లనే చేయుదునని చెప్పి గద్గదస్వరముతో మరల సిట్లనియడిగెను. మహానుభావులైన మీ ప్రసాదము లోకమున కుప కార హేతువగుచున్నది. నాకు ప్రాయశ్చిత్తమును చెప్పితిరి. నా స్నేహితులగు కిరాతుడు, కంసాలి, శూద్రుడు, వారికిగూడ ప్రాయ శ్చిత్తకృత్యమును నిర్ణయించి చెప్పుము. కరుణామయా! మీరువారికి గూడ ప్రాయశ్చిత్తమును చెప్పితిరేని వారికది చెప్పిచేయింతును. మీవంటి పుణ్యాత్ముల సంచారము లోకమున కుపకరించుచున్నది. దయచూపుమని మాటిమాటికి వీరవ్రతుల పాదములమీద పడి ప్రార్థించెను.

దయాస్వరూపుడైన వీరవ్రతుడా విశృంఖలునితో ఓయీ! నీకు చెప్పిన ప్రాయశ్చిత్తమే నీమిత్రులకును ఏర్పరచబడినది గాన నీవు సత్వరముగా బోయి వారినికూడ నీప్రాయశ్చిత్తమును చెప్పి అట్లుచేయుడు. ఆలస్యమును చేయుక వెంటనే పొమ్ము అనిచెప్పెను. విశృంఖలుడు అందులకు వల్లెయని సంతసింపుచు మునికి నమస్కార ములుచేసి తలను వంచుకొని వీరవ్రతమునివల్లభా! పంద్రెండువత్సర ములకు అనంతరము నేను యేమిప్రాయశ్చిత్తకృత్యమొనర్పవలెను. ఏ యే ధర్మములను నిర్వహింపవలెను. చెప్పుమని యడుగగా వీర వ్రతుడు విశృంఖలున కిట్లు చెప్పెను. విప్రుడా! పంద్రెండువత్సరములు

గడచిన తరువాత ప్రాయశ్చిత్తమువలన పవిత్రుడవైన నీవు చేయ దగిన ధర్మముల నప్పుడు చెప్పుదును. పొమ్ము అనెను. విప్రాధము డగు విశృంఖలుడు వీరవ్రతుని వచనములను విని వినయముతో నమస్కరించి, సంతసించుచు, కిరాతునివద్దకుపోయి భక్షకమును, విడచి ముని తనకు చెప్పిన సమస్తవిషయములును, ప్రాయశ్చిత్త నియమమును చెప్పెను. వారందరా మాటలను విని భయముతో పశ్చాత్తాపమును పొందిరి.

పిమ్మట కిరాతాది స్నేహిత బృందము యెవరికివారే వేరుగా తీర్థయాత్రకుపోయి సర్వతీర్థ సేవలను చేయుచు, అన్నితీర్థములందును స్నానము చేయుచు పరిశుద్ధమానసులై, ప్రయాగ నదియందు స్నానము చేయు కోరికతో పన్నెండు సంవత్సరములు నియమ పూర్వకముగా సదా ప్రయాగ నదియందు మాఘమాసమున స్నానముచేసి, ప్రయాగయందుగల రమా మాధవులను దర్శించి, కిలాతుడు, కంసాలి, శూద్రుడు ముగ్గురును మహాపాతకములనుండి విముక్తులైరి. వారి సాంగత్య దోషమువలనమహాపాతకుడైన విశృం ఖలుడును విప్రాధముడు అన్నితీర్థములయందును స్నానముచేసి వ్రత నియమము కలవాడై భూమినిచుట్టి తిరుగుచు, క్రమముగా త్రిలోక పావనియు, సుందరమునగు కాశికాపురిజేరి అచ్చట కొంతకాలము నివాసముండి ఆ పిమ్మట ప్రయాగక్షేత్రమునుచేరి యీ మాసమున స్నానము చేసెను. అన్ని తీర్థములకుగలపాపములను నశింపజేయు ఫలితమునిచ్చు-శక్తి యీ ప్రయాగనదియందు ఈమాసమున మకర రాశియందు సూర్యుడుండగా చేయు స్నానమునకు కలదు. అది గాక మోక్షము నొసంగు శక్తికలదు. ఒక నెలగాని, సర్వదాగాని, ప్రయాగయందు స్నానముచేసి పిమ్మట ఆవుయొక్క గుదద్వారము నుండి విడువబడు వానిచే తండులములను వండుకొని భక్షించుచు

ఈమాసవ్రతమును నెరవేర్చెను. యీ విధముగా కఠినమైన వ్రతమును పన్నెండు సంవత్సరములు జరిపి విశృంఖలుడు పవిత్రుడై నెమ్మదిగా నైమిశారణ్యమందున్న వీరవ్రతుని సమీపించి వానికి ప్రదక్షిణ నమస్కారములు చేసి సంతసింపుచు నుండెను. వీరవ్రతుడావిశృంఖలునిజూచి దయగలవాడై వానిని లేవనెత్తి, అతని కుశలములను కనుగొని సంతసముతో యిట్లు పలికెను."

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు నిరువదియైదవఅధ్యాయము.

—0—

## ఇరువది యాఱవ అధ్యాయము

"గృత్సమదుడు జహ్నుమహర్షితో యిట్లు చెప్పసాగెను. జహ్నూ! వినుము. వీరవ్రతు డట్లు సాగిలబడిన విశృంఖలునితో యిట్లు చెప్పెను. విప్రుడా! నీయొక్క సమస్తమైన పాపములు నశించినవి. ప్రయాగనదియందు నీవు చేసిన స్నానమహిమ వలన సంపర్గ పాపముకూడ నశించినది ఈ మాసమున మకరమందు మార్తాండుడుండగా నీవుచేసిన స్నాన మహిమ వలన నీ పాపములు నశించినవి. నీవు యిప్పుడు బ్రాహ్మణ తేజము కలిగియున్నావు. నీవు మూడుదినములు నిరాహారుడవై యుండవలయును. అట్టి నిన్ను యిప్పుడు నేను మంత్రములచేత, పవిత్రమైన నీటిచేత స్నానము చేయింతును. పిమ్మటనీవు మిక్కిలి పవిత్రుడవు కాగలవు. అని వీరవ్రతు డిట్లు చెప్పి దర్భలచేతను, మంత్రములచేతను పవిత్రమైన నీటిచేతను మూడుదినములు స్నానము చేయించి విశృంఖలుని

నిరాహారునిగా నుంచెను. అందువలన అతను పాతక సంసర్గదోషము నుండి ముక్తినిబొంది పవిత్రుడయ్యెను.

వీరవ్రతుడు, భక్తితో పాదములంబడిన విప్రుని, ప్రీతితో కౌగలించుకొనెను. పిమ్మట వీరవ్రతుడా విశృంఖలునకు భోజనము చేయించెను. ఆతరువాత నాతనికి సమస్తధర్మములను ఉపదేశము చేసెను. విశృంఖలా! నీవు సర్వదా సంతోషముతో సుఖమునిచ్చు వేదమార్గమును అనుసరింపుము. విధ్యుక్తకర్మల నతిక్రమింపకుము. భార్యను పెండ్లాడి గృహస్థాశ్రమ ధర్మములను నిర్వహింపుము. జీవ హింసను చేయకుము. సనాతనధర్మములను అనుసరింపుము. భక్తిగా సజ్జనబృందమును సేవింపుము. నిత్యకర్మలను విడువకుము. ఇంద్రియ ములను నిగ్రహించి శ్రీహరిని, శివుని బూజచేయుము. ఇతరుల అప రాధములను లెక్కచేయకుము. ఇతరుల యభివృద్ధినిజూచి విచార పడకుము. పరస్త్రీలను తల్లుల మాదిరిగా చూడవలెను. చదువుకున్న వేదములను మరచిపోకుము. అతిథులను అవమానము చేయకుము. పితృతిథులయందు శ్రాద్ధమును చేయుము. కలలోనైనను, కొండె ములు చెప్పకుము. భారతము మొదలగు యితిహాసములను భాగ వతము మొదలగు పురాణములును, మనువు మొదలగు ధర్మశాస్త్ర ములను సదాచూచుచుండుము. వేదాంతశాస్త్రమును, వేదాంగము లను జూచుచుండుము. లజ్జలేక హరినామమును, సంతతము కీర్తిం చుము. జాబాలిముని చెప్పిన ఉపనిషత్తు తంత్రము ప్రకారము త్రిపుండ్రము ధరింపుము.రుద్రసూక్తముచేత, కంఠమందు రుద్రాక్ష పేరును దాల్చి శివుని పూజింపుము. కంఠమున తులసి పూసల పేరును ధరించుము. తులసిదళములతోను, బిల్వపత్రముల తోడను రమావల్లభుని, పార్వతీపతిని, సదా ఒకపూటగాని, రెండుపూటలు గాని మూడు మూరులుగాని పూజింపుము. తులసీదళములతో కూడిన

శ్రీహరియొక్క పాదతీర్థమును గ్రహింపుము. సదా శ్రీహరికై నైవేద్య మొనరించిన అన్నమునే భుజింపుము. అన్నముపవిత్రమగుటకై వైశ్య దేవమును చేయుము.

ఇంటి కేతెంచిన అతిథులను బ్రహ్మతత్త్వజ్ఞాన నిష్ఠులును అగు యతీశ్వరులను, యోగీశ్వరులను బ్రహ్మచారులను, ముసలులను దిక్కులేనివారిని, రోగము గలవారిని, తదితరులను ఆదరించి తృప్తిని గలిగింపుము. తల్లిదండ్రుల సేవచేయుము. నిత్యము ఔపాసనాగ్నిహోత్రకర్మలను ఆచరింపుము. ఓంకారముతో గూడిన పంచాక్షరీ నారాయణాష్టాక్షరీమంత్రములను, యితర మంత్రములను, వాని ననుసరించి మంత్రాధిదేవతలను ధ్యానించుచు నుపాసింపుము. నరకమునందు నివసింపజేయు కామము, క్రోధము, లోభము, మోహము, మదము మాత్సర్యము లనగు అంతశ్శత్రువులను అరికట్టుము. నిష్ఠగలిగి ప్రతిసంవత్సరమును మాఘమాసమందు ప్రాతస్స్నాన మాచరింపుము. ధైర్యవంతుడవై సుఖమును పొందుము. మాఘస్నానమునం దాసక్తి కలవారును, రమావల్లభుని భక్తులను, సర్వసమానత్వదృష్టికల సాధువుల సంసర్గమును, సదా చేయుము. మాఘమాసమున స్నానముచేసి రమావల్లభుని పూజ చేయుము. మాఘమాసమున మకరమందు ఉదయమున స్నానము చేసి రథసప్తమి, ద్వాదశి, పౌర్ణమి యీ మూడుదినములు రమాధవుని పూజచేసినవాడు పాపకర్మములనుండి విడువబడును. అనేక వేల జన్మములయందునుండి సంచితమైన పాపములు, పరలోకమందు విచారమును కలిగించు పాపములు మాఘస్నానము చేత నశించును. వేద విహితమైన మార్గమును అవలంబించు వారును, శ్రీహరి యొక్క భక్తియందాసక్తులగు వారికిని, కర్మలనాచరించు వారికిని, మనస్సునందు పవిత్రత కలుగుచున్నది. బంధమునకు, మోక్షమునకును మనస్సే కారణము గనుక మానవులకు మనశ్శుద్ధియే ముఖ్యము.

పాపము చేసినవారుకూడ పశ్చాత్తాపము వలనను, చిత్త పవిత్రత చేతను పాపవిముక్తులగుదురు. అందరియందును సమత్వము కలవారును, సదా సత్కర్మలను సమాచరించుటయందు దాసక్తిగల వారును, సాధువులును, యిహపరసుఖముల నిచ్చునట్టి సుఖవంత మగుబుద్ధినే గొప్పగా దలచి దానివలన, చిత్తశుద్ధిగలిగి. ఉత్తము లనబడుచు పూజలను పొందుచున్నారు. గాన నీవు మాఘమాస వ్రతమును ముఖ్యముగా మనోనియతితో చేయుము. ఈ నీ దేహ మంతమగువరకును సర్వమును తెలిసినవాడును, సర్వాంతర్యామియు నగుసర్వేశ్వరుని పువ్వులతోను, దళపల్లవములతోను, భక్తితో పూజించుచు మాఘవ్రతమాచరింపుము. ధర్మ సంచయమందు యీ మాఘస్నాన ఫలధర్మముతో తులతూగునది యీ మూడులోకము లందును లేదు. మాఘవ్రతము పాపమును నశింపజేయునది. వెయ్యి అశ్వమేధ యజ్ఞముల ఫలితము నిచ్చును. వేయి వాజపేయములు చేసిన ఫలితము కలదు. బ్రహ్మహత్యా మహాపాతకములకు, ఉప పాతకములకు, చిన్నవైన పాపములకుకూడ ప్రాయశ్చిత్తమే యీ మాఘమాసస్నాన మహిమయగును. మాఘవ్రత మాచరింపని, మానవుని బ్రహ్మహత్యగావించిన మహాపాతకునిగా చెప్పుచున్నారు.

విప్రోత్తమా, విధ్యుక్తముగా మాఘస్నానము చేయుము. భక్తితో మాఘవ్రతమాచరింపుము. అందు వలన కష్టములు తగ్గి ఇహలోకభోగములనుభవించి, పంచభూతాత్మకమైన దేహ మంత రించినపుడు, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను నాలుగు విధములగు ముక్తిమార్గములలో ముఖ్యమగు సాయుజ్యమును పొందగల్గుదువు. మాఘస్నానమును చేసి, శ్రీహరియొక్క పవిత్ర మైన చరిత్రను, వినుచుండిన, మోక్షమునుపొంద గలవు దేహాంతర

మందు వైకుంఠమును చేరగలవు. ఈ చెప్పిన విషయములన్నియు నియమ పూర్వకముగా విడువక చేయుము. నీకు మేలు చేకూరగలదు.

జహ్నుమహర్షీ! వింటివా! యీ విధముగా వీరవ్రతుడు చెప్పగా విశృంఖలుడు విని సంతసించి మీ రుపదేశించిన రీతినే చేయుదునని అనేకమారులా మునిచంద్రుని పాదములకు నమస్కరించి సద్గుణములను గలిగి, భక్తితో నాతని ననేక విధముల స్తోత్రము చేసి, ఆవీరవ్రతుని వద్ద సెలవు పొంది, సర్వ పాప పరిహారిణగు కాశికాపురిని చేరెను. అచ్చట భార్యను నిశ్చయము చేసుకొని పెండ్లి యాడిగృహస్థాశ్రమమును స్వీకరించెను. మరియు గృహస్థాశ్రమమందుండి సర్వవిధముల చేతను సమస్త ధర్మములను నిర్వహించుచుండెను. విశృంఖలుడిట్లు ప్రతిసంవత్సరమందును మాఘమాసమున మార్తాండుడు మకరమందుండగా, ప్రయాగ తీర్థమందుస్నానము చేసి పుత్రపౌత్రయుతుడై అనేక విధభోగములననుభవించి దేహాంతరమందు శ్రీహరిసన్నిధానమును జేరి అచ్చట జ్ఞానమును పొంది ముక్తిని గాంచెను. కాబట్టి పాతకులు ప్రాయశ్చిత్త విధి నవలంభించి యీ విశృంఖలుని వలె విగతపాపులు కాగల్గుదురు"

ఇది స్కాందపురాణాంతర్గతమగుమాఘపురాణమున
ఇరువదియారవ అధ్యాయము



## ఇరువది యేడవ అధ్యాయము

గృత్సమదుడు జహ్నుమహర్షితో నిట్లు చెప్పెను. జహ్నూ! ఇంకను మాఘమాసమాహాత్మ్యమును చెప్పెద నాలింపుము. ఈ కథ చదివిన వారు జన్మసంసార సాగరమునుండి తరింతురు.

పూర్వకాలమున ద్వాపర యుగమందు అంగదేశాధీశుడైన సునిష్ఠుడను పేరుగల సూర్యవంశమునం దుద్భవించిన రాజు గలడు. అతడు మిక్కిలి ధర్మాత్ముడును బలముగలవాడును, సాధువును శత్రువులను చంపువాడును, శత్రువుల పట్టణములను జయించినవాడును, అయి ప్రజలను మిక్కిలి చక్కగా పరిపాలించుచుండెను. ఆ రాజునకు పరమ పతివ్రతలగు నూరుమంది భార్యలుండిరి. పర్వత ద్వీపరాజ్యము నంతను పాలించుచు సామంత రాజులచే మర్యాదలు పొందుచునుండెను. అతడు తన నూరుమంది భార్యల యందును పుత్రునొకని బొందనేరక, పుత్ర సంతానము కొరకు అనేక ధర్మకార్యములను చేయుచుండెను. కాని పుత్రులు లేక రాజు మిగుల చింతాక్రాంతుడై యిట్లు తలంచెను. నేను పూర్వ జన్మమున పుత్రులను పొందగలుగు మంచికార్యముల నేమియు చేయలేదు. అందువలన నాకు రాజ్యమును పరిపాలింపగ గుణవంతుడైన పుత్రుడొకడును కలుగలేదు. పుత్రులు లేని వారికి పుణ్యలోకములు లేవని పురాణములు చెప్పుచున్నవి. పుత్రుడు లేనివారికి, దరిద్రునకును, చేసిన మేలు మరచిన వానికిని సన్యాసికిని, వేదము రాని విప్రునకును సద్గతి కలుగజాలదని వేదవేత్తలగు మునులు వచింతురు. గాన పుత్రహీనుడనగు నాకు యిహపరసుఖములు లేవుగాన నేను మునీశ్వరుల ఆశ్రమములకుపోయి, సమస్త ధర్మార్థజ్ఞానులగు వారి సేవచేసి నాయభీష్టమును వారికి తెలుపుదును. వారు నాకు పుత్రుడు కలుగు నుపాయమును చెప్పగలరు. ఆ యుపాయమును నేను నిర్వర్తించెదను. అని మనస్సులో నిశ్చయించుకొని సులక్షణుడు విచిత్రమైన రథ మెక్కి సహచరులతో కూడ బయలుదేరి సర్వమునిజన సంసేవ్య

మానమగు నైమిశారణ్యమును జేరి అచ్చటగల మునులకు నమస్కరించి బద్ధాంజలుడై వారియెదుట నిలువబడి తన వృత్తాంతమును వారికి విన్నవించెను.

ఆ మునులు రాజుయొక్క పుత్రకాంక్షను ధర్మాసక్తిని గని, రాజా! నీవు పూర్వజన్మమందు పాపము చేసితివి. దానిని వినుము చెప్పెదము. పూర్వజన్మమందు నీవు క్షత్రియుడవు. సౌరాష్ట్రదేశము నకు రాజువు. నీవు రథగజతురగ పదాతులతో గూడుకొని, సమస్తసంపదలతో కూడినవాడవై మాఘమాసమున మకరరాశి యందు సూర్యుడుండగా రథసప్తమినాడుదయమందు స్నానము చేయలేదు. ఆ రథసప్తమినాడు గుమ్మడికాయను దానమివ్వలేదు. అందువలన నీకు పుత్రసంతానము కలుగలేదు. మాఘ శుద్ధసప్తమినాడు గుమ్మడికాయను దానమిచ్చినవాడు పుత్రసంతానమును పొందును, మాఘశుద్ధ సప్తమిదినమున పువ్వులు, ఆవు నెయ్యి, పెరుగు, పాలు మొదలగునవి చేర్చి గుమ్మడికాయతో దానమును విప్రునికి యివ్వవలెను. అట్లు చేయనివానికి పుత్రప్రాప్తి లేదు. సులక్షణుడు వారి పలుకులను విని పుత్రార్థియై మునుల పాదములకు వేలువేలుగా నమస్కరించి, వారిని స్తోత్రముచేసి ముని వల్లభులారా! నాకు పుత్రుడు గలుగునట్లు వరమును ప్రసాదింపుడని యడిగెను. మునీశ్వరులు ఆ రాజు పలుకులు విని మాదీఫలమును మంత్రించి రాజుకిచ్చెను. రాజా! ఈ మాదీఫలమును నూరుభాగ ములుచేసి నీ నూరుగురు భార్యలకును యిమ్ము. వారు దీనిని తిందురు. పిమ్మట నీకు నూరు మంది పుత్రులు గలుగుదురు. నీ యింటికి పొమ్ము. అని కరుణామయులగు మునులు పలికి ఫలమును నిచ్చిరి. రాజు ఫలమును గ్రహించి మునులకు నమస్కరించి తన యింటికి జేరెను.

సులక్షణుని భార్యలు, తమభర్త మంత్రింపబడిన మాదీఫలమును దెచ్చియున్నాడని గ్రహించియింటికివచ్చినట్లు దాసీలవల్ల విని, పరమసంతోషముతో భర్తకు యెదురుగా వెళ్లి తమ యింటిద్వారమందు, పుష్పములను, పేలాలను, అక్షతలను భర్తపై జల్లి నీరాజనాది దీపహారతులచేత పరమప్రేమను జూపుచు రాజు నాదరించిరి. రాజు మార్గాయాసమున అలిసియుండిరి. మాదీఫలమును శయనగృహామందుంచి భోజనార్థము మఱియొక గృహాంతర్భాగమునకు జనెను. సులక్షణుని భార్యలలో నాఖరిభార్య తనకొక్కతికే పుత్రుడుగలుగవలెనను అసూయాభావముతో నా మాదీఫలమును సంగ్రహించి యొక రహస్యప్రదేశమందు ఆ ఫలమంతయు పరమసంతోషముతో తినెను. రాజు భోజనముచేసి శ్రమదీర్చుకొని శయనాగారమందు తానుంచిన మాదీఫలమును భార్యల కీయదలచి చూచెను. ఫలము గానరాలేదు. ఆశ్చర్యపడి, భయపడి అంతఃపురమందలి ఆడువారి నందఱిని ఫలమును గుఱించి వేయువేయుగా రాజు యడిగెను. నాకు పుత్రసంతానమునిచ్చు మంత్రిత మాదీఫలము యీ శయనాగారము నందుంచితిని కనిపించుటలేదు. దీనినెవరు తీసిరో ఎవరుతినిరో వారందఱిని బట్టుకొని కఠినమగు శిక్షలకు పాల్పడజేతును. రాజు మాటలువిని అంతఃపుర పరిచారకులు తమకాఫలము తెలియదని నుడివిరి. రాజువిచారించి మూర్ఛాగతుడయ్యెను. కొంతసేపటికి మూర్ఛనుండి లేచుసరికి రాజుయొక్క కనిష్ఠభార్య తా నాఫలమును భక్షించితినని చెప్పెను.

సులక్షణుడామాటలువిని ఒకవిధమారుగా ననుకలుగునని సంతసించుచు, విచారమునువిడిచి. కనిష్ఠభార్యను పుత్రకాంక్షచేత బహుజాగరూకతతో కాపాడుచుండెను. సులక్షణుని మూర్గురు భార్యలందరు కనిష్ఠభార్య గర్భవతియై పుత్రుని గనునను యసూయచే, మిగిలిన

భార్యలు, మనస్సున వైషమ్యమును వహించి గర్భవిచ్ఛిన్నమగు మందును కనిష్ట భార్యకిచ్చిరి. అందువలన ఆమెకు గర్భమునశింప లేదు. పిమ్మట వారు వేఱొక యౌషధమొసంగిరి. దానివలన కనిష్ట భార్య జ్ఞానమును వదలి, మనోవిభ్రమకలిగి చిత్తవికారమును పొందెను. రాజభార్యలందరును బాహ్యమందు కనిష్టభార్యయందలి గౌరవము, ప్రేమజూపుచుండిరి. వారియంతరంగములందు విచ్ఛిన్న వృత్తి వహించినను ప్రత్యక్షముగా గర్భము పూర్తియగువరకు నామెను రక్షించిరి. కాని యొకనాడు దైవవశముచేత కనిష్ట భార్యకు మతిచలించి, అంతఃపురమునుండిబయలుదేరి అకాలమందు మిక్కిలి ఘోరమైన అరణ్యమును చేరెను. పదియవమాసమందామె యచ్చటనే కుమారుని గనెను. ఆయరణ్యమందు గల పర్వత గుహలలో నొకగుహయందున్న పెద్దపులి ఆహారార్థముతిరుగుచుమనుష్య గంధమును గ్రహించి చెట్టుక్రింద నొంటరిగానున్నస్త్రీని జూచి, తన కది చాలునని యాహారముగా నామెను భక్షించెను. రక్తమయమైన యాశిశువును, చెట్టుక్రింద యందముగా నున్నందున చూచిన హంస తన పరివారముతో వచ్చి రెక్కలచేత కాపాడుచు, బాధ లేకుండ తేనె, పండినపండ్లు మొదలగునవి యిచ్చి ఒకసంవత్సరము పెంచెను. అంత నాహంస తన జాతిపక్షులతో జతచేర్చి యచ్చట నుండుమని యా శిశువును ఒక సరోవర తీరమున నుంచెను.

ఆ సరోవరమునకు వనమందుండు మునికాంతలు స్నానార్థమరుదెంచి భర్తలతోగూడి స్నానమాడుచుండిరి. అందులో నొకముని యిరువురు భార్యలుకలిగియు పుత్రహీనుడయి ఆతీరమందాడుకొనుచున్న పిల్లవానినిజూచి దగ్గరకు తీసి సంతసమున నిట్లాలోచించెను. ఈ పిల్లవాడెవడు? యీ పిల్లవానితల్లిభర్తనువదలి, యెందులకీయడవికి వచ్చెను? యీయడవియందీ బాలకుని రక్షించుచున్నవారెవరు?

అని పలురీతుల విచారించి తుదకిట్లు సిద్ధాంతీకరించుకొనెను. అడవి యందుగాని, గర్భమందుగాని, యింటియందుగాని, మరియెచ్చటగాని ప్రాణినికాపాడువాడు పరమేశ్వరుడు. పరమేశ్వరుని విడిచి నరుడు సుఖవంతుడు కాజాలడు. దక్షతలేకపోయిన నీబాలుడు చక్కగా ఆడుచున్నాడు. అని తలచి పిల్లవానిని తీసికొని, సరోవరమందు తానును, సతులును. స్నానమాడి నిత్యకర్మల నిర్వహించి పిమ్మట తనయాశ్రమమునకు జేరెను. మునియు, భార్యలును, తేనె, పండిన పండ్లు, పాలు, నేతులతో నా బాలకుని రెండు సంవత్సరములు పెంచెను. నిత్యము ఆముని భార్య లాబాలకుని విషయమై మాత్సర్య బుద్ధితో కలహింపసాగిరి. బాలకుడు నా వాడనియు, నేను పెంచితి ననియు, పరస్పరము కలహించుచు ఈర్ష్యతో నుండిరి. ఒకనాడు మునియొక్క పెద్దభార్య సాయంకాలమున ఆడుకొనుచున్న పిల్లవాని నెత్తికొనిపోయి జనులులేని ఘోరారణ్యమందు విడిచి యెవరికిని యేమియు తెలియకుండనుండెను. ఇంటివద్ద మునీశ్వరుడు పిల్లవానిని గానక అర్ధరాత్రియందు సాధ్యమగునంతవరకు వెదకి యెచ్చటను కనుపించకపోగా మిక్కిలి విచారమును పొందెను. భర్తదుస్తరదుఃఖ మగ్నుడైనను భార్య పిల్లవానిమాట యేమాత్రమును చెప్పలేదు. సుగుణుని భార్యలును యీరీతిగనే సాహసించిరి. పిమ్మట యీ ముని భార్యయు యిట్లే చేసినది. శిశువున కిది రెండవసారి యరణ్యమున బడియుండుటయు, కష్టపడుటయు తప్పలేదు. ముని భార్య శిశువు నరణ్యము పాలును భర్తను దుఃఖముల పాలును బడవైచినది.

మూడేండ్లు వయస్సుగల బాలుడై, నిర్జనవనమందుండి అర్ధ రాత్రియందు దక్షతలేక విచారించి నెమ్మదిగా కొంత కాలమునకు విధివశముచేత రమ్యవాటికా సమానమగు తులసి చెట్టును జేరి అచ్చట సుఖించెను. ఆ బాలునకు తులసి చెట్టుయొక్క దర్శనము

స్పర్శనము కలుగుటవలన రాత్రి అడవియందు యేవిధమైన అపాయము జరగలేదు. రాత్రి జరిగిపోయినది. ఉదయమున సూర్యోదయము కాగానే కండ్ల వెంట నీరు గార్చుచు బిగ్గరగా నేడ్చెను. ఎండలో ఒంటరిగా నేకాకియై యేడ్చుచున్న బాలకుని చూచి అరణ్యమున గల పక్షులు, మృగములు, క్రూరజంతువులుకూడ వానితో కూడ నేడ్చుటకు మొదలిడెను. జంతుజాలమే బాలకునియందు జాలిగొని యేడ్వగా మానవమాత్రులకు విచారముకల్గుట వింతయగునా? అట్టి క్రూరమృగములకైనను బాలునిపై దయగలిగెను. గాని, వానినరణ్యమందు విడిచిన సవతితల్లులకుమాత్రము మనసా చలింపలేదు. దయగలుగ లేదు. పక్షులు, జంతువు లిట్లు విచారించి, పండ్లు నీరు దెచ్చి, ఆకలిదప్పికలు దీర్చి, తమ రెక్కల నీడచేతను ఎండను వారించి, బాలున కుపచారము చేయుచుండెను. బాలుడా యుపచారములచేత శ్రమలేక సుఖముగా నుండెను. తులసీ సాంగత్యము వలన బాలునకు శ్రీహరి నామసంకీర్తనమందు బుద్ధికలిగెను. ఆ బాలుడు అరణ్యమందు కృష్ణా! వాసుదేవా! గోవిందా! అచ్యుతా నారసింహా! అనంతా యని భగవంతుని నామములను కీర్తించుచుండెను. జహ్నుమహర్షీ! వింటివా! తులసీదర్శనస్పర్శనములను చేయువానికి పాపనాశనము కలుగును. అరణ్యమందుగాని యింటియందుగాని భయముండనేరదు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు మాఘపురాణమందు
ఇరువది యేడవ అధ్యాయము.

---

# ఇరువది యెనిమిదవ అధ్యాయము

"కృత్స్నమదుడు జహ్నుమహర్షితో ఇట్లుపలికెను. జహ్నూ! వినుము. ఇచట యీ ముని యింటియందుగల కథ నటుంచుము. ముందుగా చెప్పిన రాజు కథను చెప్పెద నాలింపుము. ఆ సుగుణుని యింటియందు రాజు తన కనష్ఠభార్యనుగానక గర్భవతిగా నుండి ఎచ్చట కేగియుండునని విచారించి మిక్కిలి శోకమును పొంది నాశ్చర్యముతో పురజనులను మంత్రులను సేవకులను, రహస్యదూతలను అన్ని దేశములకును, అన్ని ప్రదేశములకును, బంపి వెదకించి, తానును వెదకి యెచ్చటను భార్యనుగానక, మిక్కిలి ఆయాసమును పొంది విరమించెను. మిక్కిలి జ్ఞానవంతుడైన ఆ రాజుయొక్క పుత్రుడు బాలుడైనను, ఆ యరణ్యమందే శ్రీహరినే తండ్రి తల్లి స్నేహితుడు, బంధువు, సోదరుడుగా తలంచుచు మనస్సుచేత నిశ్చయించుచు, సదాభక్తితో పుండరీకాక్షుని కీర్తించుచు, ఆనందమున మునిగి తేలుచు, తులసీ చెట్టుయొక్క మొదట తులసీవిభుడగు విష్ణుదేవుని పూజించుటకై సమీపమందుగల సరోవరమున నీటిని దీసికొనివచ్చి తులసీ సాన్నిధ్యమును జేరి, ఆవృక్షమునే విష్ణుమూర్తిగా భావించి సుకోమల నవతులసీదళ పల్లవములతో షోడశోపచారములచేత శ్రీహరిపూజను చేసెను. ఇట్లు ఒంటరిగా విష్ణుపూజాసక్తుడై ఆఱుమాసములు పూజించెను. శ్రీహరి ప్రసన్నుడు కాలేదు. పిమ్మట బాలుడు, కరుణామయుడైన భగవంతుడెందులకు తనకు ప్రసన్నుడు కాలేదని విచారించి చింతానిమగ్నుడాయెను.

ఆకాశమందు ఆ సమయమున అశరీరవాక్కు ప్రియముగా నిట్లు వినిపించెను. ఓ రాజపుత్రా! నీకు సమీపమున నున్న సరస్సు

నందు మాఘమాసమున మకరరాశియందు సూర్యు డర్ధోదితు డగు చుండగా ప్రాతఃకాల స్నానము ఆచరింపుము. అప్పుడు శ్రీహరి నీకు ప్రసన్నుడు కాగలడు. ఇందు కేమాత్రమును సందేహములేదు. అని బల్కి అశరీరవాక్కు విరమించెను. బాలుడా పల్కులు విని, దరిగా నున్న సరోవరమందు మాఘమాసస్నానము చేసి తులసీ సమీపము నకు వచ్చి, ఆ చెట్టు మొదట పువ్వులు, పండ్లచేత శ్రీహరిని భక్తితో పూజించెను. ఆబాలునకు మాఘశుద్ధ చతుర్దశీదినమందు సపరివారుడైన లక్ష్మీకాంతుడు, చతుర్భుజములతోను, శంఖ చక్ర గదాపద్మ కిరీటకుండల కౌస్తుభ వనమాల మొదలగు సర్వాలంకార ములతోను, మందహాసము గలరూపములతో ప్రత్యక్షమయ్యెను. శ్రీహరి బాలుని తన సుఖపంతములగు హస్తములతో నాలింగనము చేసికొని, కరుణామయుడగు కేశవుడు ప్రేమతో నిట్లు బలికెను. బాలుడా! నీవు నాభక్తుడవు గాన నేను నీకు ప్రసన్నుడనైతిని. నీకు వరమిత్తును కోరుకొనుము. అనగా బాలుడు, జగన్నాథా! నాకు శాశ్వతముగా నీ సన్నిధానమందు నివాసము నిమ్ము. అని పల్కిన భగవంతుడు యిట్లు చెప్పెను.

బాలుడా! నీవు యీ భూమిని పాలింపుము. నీ విప్పుడు నీ తండ్రివద్దకుపొమ్ము. నీతండ్రియొక్క సింహాసనమధిష్ఠింపుము. ధర్మ మూర్తివై చతుస్సముద్ర ముద్రితమైన భూమండలమును పరిపా లింపుము.

రాజ్యలక్ష్మితో కూడినవాడై, భూమిని పాలించుచు మాఘ మాస వ్రతమును ఆచరించుచు పుత్ర పౌత్రయుతుడవై సమస్త సంపదలతోను, వివిధ భోగములతోను, సుఖముగా అనుభవించి, పిమ్మట నా స్థానమునకు చేరి శాశ్వతముగా సుఖింప గలవు. అని వైకుంఠవాసుడు చెప్పినందున సమీపమునగల సునందుని సహాయ

మున యా బాలుడు తండ్రివద్దకుజనెను. భగవంతుడా వెంటనే యంత ర్థానుడాయెను. సునందుడు రాజకుమారుని వెంట గొని తెచ్చి సులక్షణునకు వప్పగించి, కుమారుని పుట్టుకవృత్తాంతము నంతయు రాజునకు నివేదించెను. రాజు ఆ మాటలను విని యాశ్చర్యముతో కుమారుని ముద్దాడి పరమసంతోషమున సుఖమనుభవించెను. సునం దుడును యటనుండి తన యాశ్రమమును జేరెను. పిమ్మట రాజ కుమారుడు పెద్దవాడు కాగానే సులక్షణుడు, చతురంగ బలయుత మైన, నిష్కంటకమైన రాజ్యమును కుమారునకిచ్చి, తాను భార్య లతో గూడుకొని, వార్థక్యదశగాన వానప్రస్థాశ్రమమును స్వీకరించిరి. ఆ రాజకుమారుడు సుధర్ముడను పేరుతో రాజుగానుండి, సరిసమాన వంశజాతియగు సుందరవతియను భార్యను పెండ్లియాడి. ధర్మము దప్పక ప్రజలను పాలించుచు సమస్త ధరణీచక్రమును పాలించెను. చాలాకాలమునకు సులక్షణుడు కాలధర్మము బొందెను. అతని భార్య లతనితో సహగమనము చేసిరి. సుధర్ముడు తండ్రియొక్క మరణవార్తను విని మిక్కిలిశ్రద్ధతో శ్రాద్ధకర్మలను చేసెను. ఆ చని పోయిన సులక్షణుడును, అతని నూర్గురు భార్యలును వైకుంఠమును గూర్చి వెళ్ళిరి. పిమ్మట సుధర్ముడు సంతసింపుచు, పుత్ర పౌత్ర యుతుడై మాఘమాసవ్రతమును ఆచరించి, శ్రీహరిని పూజించి, యీ లోకమందు ననేక భోగములను అనుభవించి, అంతమందు వైకుంఠము జేరి సుఖించెను.

విప్రోత్తమా ! శ్రీహరియొక్క పాదరాజీవ మకరందపానము నందాసక్తిని గల మనఃపద్మలకు, శ్రీహరిని ప్రీతికరమగు మాఘ మాస వ్రతనియమమునందు పరాయణులగువారికి, సత్కర్మాచరణ శీలురకు నెన్నడును, యెప్పుడును, యెక్కడనుకూడ భయముండ దనుటచే మిగిలినకర్మలనుతగ్గించినను, మాఘవ్రతమునునిష్ఠతో చేయు

వలెను ఏమానవుడు శ్రీహరి పదధ్యానాసక్తుడై, భక్తుడై యీ అధ్యాయమును వినునో అతడు యిహలోక సుఖములననుభవించి, పరలోకమునందు శ్రీమహావిష్ణువుతో కూడి శాశ్వతసుఖమును పొందగలడు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమున నిరువది యెనిమిదవ అధ్యాయము.

—0—

## ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

"గృత్సమదుడు జహ్నుమహర్షితో చెప్పుచున్నాడు. జహ్నూ! వినుము. మాఘమాసము వచ్చుననగా మకరరాశియందు సూర్యుడుండగా పూర్వమందు చెప్పిన కల్పోక్త విధి యుక్తముగా మాఘస్నానము చేసి శ్రీహరిని పూజించినవానికి గలుగు ఫలితమును చెప్పెదను సావధానమతివై వినుము.

మాఘవ్రతమును చేయువాడు స్వప్రకాశితమగు విమానమునెక్కి సమస్త దేవతాపూజితుండై స్వర్గలోకమును చేరును. వాని యొక్క పుణ్యముయొక్క ప్రభావమువలన వాని బంధువు లందఱును కోటికులములవరకు స్వర్గలోకమును పొందుదురు. ఇంకొక కథను చెప్పెదను సావధానముగా వినుము.

ద్వాపరయుగమందు విదేహదేశమున క్రూర యను పేరుగల యొక శూద్రస్త్రీ యుండెను. ఆమె కర్కశనకు సతియై మిగుల కోపవంతురాలై మిక్కిలి పరాక్రమవంతురాలై యుండెను. ఆ దంపతులకు పుణ్యమూర్తియు, బ్రహ్మవేత్తయు సాధుసమ్మతుడును, సర్వభూతములందును దయగలవాడును, సద్ధర్మములందు ప్రీతిగలవాడును

అగు పుత్రుడు గలడు ఆ పుత్రునకు భర్తృప్రేమకలదియు, పతి భక్తికలదియు, ధర్మకార్యనిరతయు, అత్తమామలకును, భర్తృ బంధువులకును, వృద్ధులకును, రోగులకును, సాధువులకును, నిత్య మును సేవచేయునదియు నగు భార్యగలదు. అత్త, కోడలినుగాంచి సదా కోపమువహించి, కొట్టుట, లాగుట, యీడ్చుటచేసి భర్తను కూడ చేర్చుకొని యిరువురును కలసి ఆమెను బాధించెడివారు. నిత్యము అకారణముగా పుత్రుని తిట్టుచుండెడివారు. అయినను కోడలు విచారముతో అత్తకు ఉపచారములు చేయుచుండెడిది. ఇట్లాకోడలు అత్తవలన బాధలను బొందుచు పూర్వజన్మ కర్మ ననుభవించుచు దుఃఖించుచుండెను. ఆశూద్రుని పుత్రుడు సదా తన భార్య యేడ్చుచు బాధపడుచుండుట చూచి, తల్లిదండ్రులతో యిట్లని పలికెను.

తండ్రీ! అమ్మా! కీర్తి కరమును,ధర్మమును కలిగించునదియు నగు నాపలుకులను వినుము. కోడలియందు మీకు కోప మెందు లకు. శరీరమును శుష్కింపజేయు యీ కోపమును వహించినందుకు మీకుగల లాభ మేమి? మత్సరగ్రస్తులై కలహించుటమీకు యుక్త కార్యము కాదు. నిత్యకలహ మీయింటియం దెందులకు? కల హము వలన సర్వసంపదలు నశించును. నేనుగాని, నా భార్యగాని, మీకు అపకృతి యేమి యొనర్చితిమి? కోపమువలన కలుగు యీ కలహమునకు కారణ మేమియు కనుపించలేదు. కోపముచేత. ఆయుర్దాయము, ధనము, మానము, యశము గౌరవము, పాండి త్యము వెంటనే నశించును. మీ పుత్రునియం దింతకోప మెందు లకు ? మీరు సమస్తము నెఱింగినవారు. నాయందు దయ జూపుడు. సజ్జనులకు సమ్మతమగు క్షమను సేవింపుడు. ఆచండి భర్తను కూడి, పుత్రుని పలుకులు విని కోపముబూని, కదలుచున్న పెదవులతో, తిట్టుచు పుత్రునితో నిట్లనెను.

మూర్ఖుడా! వెళ్ళిపొమ్ము. నీభార్య నీకు యిష్టురాలుగుగాక! తలిదండ్రులను శిక్షణచేయుచున్న మీ దంపతులను శిక్షించినను పాపములేదు. సత్యాసత్యదోషములేదు. సకారణమైనను కాకపోయి నను తప్పులేదు. లేదనిచెప్పి ఆచండి కర్రతో కొట్టెను.

సదా యీరీతిగా తల్లిచేత తాడితుడై. శూద్రకుమారుడు రోషయుక్తుడయ్యెను. కాని క్షణముండి మరలజ్ఞానమును తెచ్చు కొని యిట్లాలోచించెను. తలిదండ్రులతో కలహించు వాడును తలిదండ్రులను తిట్టువాడును, మరల జన్మలేని మహా నరకమును పొందును. ఎవడు అజ్ఞానముచేత తలిదండ్రుల నవమానముచేయునో వాడు రౌరవాది నరకమును బొందును. మూడు లోకములందును తల్లిదండ్రులతో సమానమగు దైవములేదు. ఆడువారికి మగనితో సమానమగు దేవుడులేడు. దేవతలలో శ్రీహరితో సమానమగు దైవములేదు. తీర్థములలో గంగానదితోసమానమగుతీర్థములేదు. ఆడు వారికి భర్తకంటె దైవములేదు కుమారునకు తలిదండ్రులకంటె దైవములు లేరు. అని తలంచి తన భార్యకు నీతులుపదేశించెను.

చండి కోడలిని కోపముతో చేతులను నొక్కి పట్టి తన యిచ్చవచ్చినట్లు కొట్టి వేరొకగదియందు ఆమెనుంచి తలుపులు బిగించి తాను సుఖముగా నుండెను. కుమారుడు తప్పిదములేని తన భార్యను తల్లియట్లు శ్రమపెట్టుచున్నందులకు మనస్సునందు మిగుల దుఃఖించుచు యేమియు మాటాడ నేరక, తల్లిదండ్రుల కుపకారము చేయుచుండెను. ఏడురాత్రులాకోడలికా ఇంటియందు యిట్లుజరిగెను. ఏడుదినము లిట్లుతిండిలేక, నీరులేక, నిద్రలేక యున్నందున ఆమె ప్రాణములు శరీరమును విడిచి ఆకాశమున చేరెను. చండికి లోకులు, బంధువులు. హితులు, తగనిపని చేయుచుంటివని యెంత చెప్పినను వినకుండెను. ఆమె నాగదినుండివిడువలేదు. ఎట్లున్నదో యని చూడలేదు. కుమారుడు భార్యను నిర్బంధము నుండి తొల గించక యూరకుండెను. పన్నెండుదినములు గడచెను. కుమారుడు భార్యను జూచుటకై తల్లిభయముచేత తలుపు దీయలేక రహస్య

ముగా నెట్లో తీసి భార్య స్థితిని చూచి కుమారుడు విలపించెను. అయ్యో! యని హాహా రావముతో, ప్రభంజన ప్రచలితమై నేలగూలిన వృక్షము పగిది భూమి మీందా శూద్రకుమారుడు పడెను. క్షణ కాలము మూర్ఛయందు మునిగి, పిమ్మట లేచి పరిపరి విధముల దుఃఖించు చుండెను.

ఆచండి వచ్చి గదితలుపుతీసియుం టచూచి కోపపూరితయై విచారించుచున్న తనకుమారుని చూచి లోపలకేగి చచ్చి యున్న కోడలినిచూచి స్వయముగా నేడ్పుచున్నను కుమారుని చూచి బయటకువచ్చి బిగ్గరగా నేడ్చెను. చండి యేడ్పుట విని అందఱును ఆశ్చర్యముతో వచ్చిచూచిరి. మరియు నామెను పలు విధముల నిందించిరి. బంధువులు, మిత్రులు, హితులు, లోనగు వారందఱువచ్చి చూచి చండిని నిందించి జరిగినదానికి విచారించి వెడలిరి. పిమ్మట ఆమె శవమును దహించిరి. తరువాత శూద్రకుమారుడా విచారముతో నచట నుండలేక గంగా తీరమును జేరి యచ్చట కొంత కాలముండి పిమ్మట మరణించెను మరియు శ్రీహరి సాయుజ్యమును పొందెను. పుత్రశోకముచేత బాధపడుచు, పశ్చాత్తప్తురాలై ఆచండి రాత్రింబవళ్ళు విచారించుచుండెను. శూద్రదంపతులును మిక్కిలి విచారించుచు, కళ్ళలోను, నోటిలోను, మట్టిని గొట్టుకొనుచు, ఎంత మంది అడ్డుపెట్టినను, వినక మిక్కిలిగా యేడ్చుచు తిండి, నీరు లేక నిద్రనుమాని పుత్రశోకముచేత కృశించి మరణించిరి. అంతట యమ ధర్మరాజుయొక్క దూతలువచ్చి ఆశూద్రదంపతులను తీసికొని వెళ్లిరి.

శూద్రదంపతులు యమలోకమున మిక్కిలి భయంకరమైన ఆసిపత్రవనమందు నరకమును అరువదినాలుగు యుగములు అనుభవించి పిమ్మట మరల భూలోకమునకు వచ్చిరి. వారు సర్పములై జన్మించి అన్నిజంతువులకు ఆధారభూతమైనచంపానదీతీరవనమందు సౌఖ్యవంతమైన రావిచెట్టుతొఱ్ఱలో నివసించిరి. దైవవశమున కృతార్థతజెంది సజ్జనసమ్మతులైన ధీరుడు ఉపధీరుడు, అను యిరువురు

సాధువులు ఆ చంపానదియందు స్నానమాడుటకై వచ్చి, మాఘ స్నాన మాచరించి, ఆ రావిచెట్టు క్రింద విష్ణుదేవు నర్చించి బహు సంతసమున మాఘమాస మహిమను కొనియాడుచుండిరి. ఆ రావి చెట్టుతొఱ్ఱలో నివసించుచున్న సర్పద్వయము తమ కండ్ల చేతను, చెవులచేతను, బహు శ్రద్ధతో నా మాఘమాస మహిమను విని సర్ప దేహములను విడిచి పవిత్ర దేహములను ధరించివచ్చి మరల నా చంపానదియందు మాఘస్నానమును గావించి, బాలభాను తేజో విరాజమానులై పుష్పక విమానము నెక్కి, స్వర్గలోకమును చేరిరి. మాఘమాస మహిమను వినుట చేతను, మాఘమాసమున స్నానము చేయుటచేతను ఆ శూద్ర దంపతులు నీచజన్మలనుండి ముక్తి గాంచిరి.

అనేకరీతులుగా మాఘమహిమను చెప్ప నేల? మాఘవ్రత ముతో సమానమగు వ్రతము లేదు. ఈ మాఘమాస ప్రభావమును భూలోకమందుగాని, స్వర్గలోకమునందుగాని, మూడులోకము లందుగాని, శ్రీహరితప్ప మఱియొకరు తెలిసికొనజాలరు. గురువును ద్రోహముచేసిన వాడుగాని మూర్ఖుడుగాని, అడుదానిని చంపినవాడు గాని ఆవును చంపినవాడుగాని, కుమారుని, చంపుటయందాసక్తి కలవాడుగాని, చేసిన మేలు మరచిపోయినవాడుగాని, మహాపాతక ములు చేసినవాడుగాని యీమాఘవ్రతమును చేసినయెడల సమస్త పాపములచేత విడువబడి శ్రీహరిని చేరగలడు."

ఇది స్కాందపురాణాంతర్గతమగు మాఘపురాణమునందు
ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

---

## ముప్పదియవ అధ్యాయము

గృత్సమదుడు జహ్నుమహర్షితో చెప్పుచున్నాడు. జహ్ను మునీ! వినుము. ధర్మమునకు సాధనములయిన నెలలన్నిటిలో మాఘమాసము మిక్కిలి ఉత్కృష్టమైనది. యజ్ఞము మొదలగు సమస్తమైన కర్మలయొక్క ఫలములును మాఘమాస వ్రతమువల

ననే సిద్ధించును. మాఘమాసము సర్వవిధ తపస్సులయొక్క సారము అన్ని కర్మలకును ఉత్తమఫలము. అన్ని ధర్మములకు నాధారము. ఎక్కువ ఉత్తమము. శ్రీహరికి ప్రియకరమును శివునకు ప్రేమాస్పదము సూర్యుడు, ఇంద్రుడు అగ్ని, బ్రహ్మ మొదలగు దేవతాలోక ప్రాప్తిని పొందగలుగు స్థానము, సౌఖ్యప్రదమగు స్థలము జహ్నూ! యీ మాఘమాసప్రభావమును వినగోరినందున నీకు వివరించి చెప్పితిని, నేను చూచినంతవరకు, విన్నంతవరకు, యింతియేసునూ! నాకు తెలిసినంతవరకు చెప్పితిని. శ్రీహరికి భక్తుడైన నరుడు అన్ని ధర్మములను నిర్వహింపకపోయినను మాఘమాసవ్రతమును నిష్ఠతో చేయవలెను. దానివలన సర్వధర్మములను చేసినంత ఫలితము కలుగును. జహ్నుమునీ! ఇదియే మాఘప్రభావము. ఈ మాఘమహాత్మ్యమును వినువాడు సమస్త పాపములనుండి ముక్తుడగుననుటకు సందియము లేదు.

పార్వతీ! సకల ధర్మవిదుడైన గృత్సమదుడు చెప్పిన మాఘమాసప్రభావమును మునివల్లభుడైన జహ్నుముని విని మాఘమాసమున విధ్యుక్తముగా మాఘవ్రతమును చేసెను. గాన యీ మూడులోకములందును మాఘవ్రతముతో సమానమగు ధర్మము లేదు. ఇది బహురహస్యమైన విషయము అయినను నీవు నాకు ప్రియురాలవగుటచే దీనిని నీకు చెప్పితిని. ఎవడు యీ మాసప్రభావము భక్తిశ్రద్ధలతో వినుచున్నాడో, ఎవడు శ్రీహరిని యెదుట మాఘపురాణము చెప్పుచున్నాడో వారిరువురుకూడ అన్ని చోటులందు నీవరయందు సుఖమునుపొంది దేహాంతమగు శ్రీహరి నిలయమగు వైకుంఠము జేరుదురు.

"శౌనకాది మహామునులారా! పూర్వకాలమున రజతాద్రియందుగల కైలాసమున పార్వతీదేవికి శంకరుడు చెప్పిన మాఘమాస మహాత్మ్యమును మీరందఱును భక్తిశ్రద్ధలతో వినగోరియున్నందున మీకు నేను చెప్పితిని. మాఘవ్రతము సమస్తమైన పుణ్యములను ఇచ్చును. సమస్తసంపదలను ఇచ్చును. సత్కీర్తిని

కలిగించును ధర్మముతో కూడియుండును. ఆయుర్దాయమును వృద్ధి పరచును. రోగములను నాశనము చేయును. విష్ణులోకప్రాప్తిని కలిగించును. మోక్షాసక్తులగు వారికి మోక్షమునిచ్చును. ఇంద్రలోకమును, సూర్యలోకమును, చంద్రలోకమును చేర్చును సుఖమును చేకూర్చును. ఎవరెప్పు డేది కోరుకొందురో దానిని మాఘవ్రతము వలన పొందగలరు. ఈ మాఘమాస వ్రతమును మంచి బుద్ధితో, ఆత్మజ్ఞానమును తెలిసికొని, భక్తిశ్రద్ధలతో నాచరించు శిష్యునకే చెప్పవలెనుగాని భక్తి శ్రద్ధలులేని వానికి జెప్పగూడదు. ధీమంతుడీ విషయమును జ్ఞాపకముంచుకొని ఇట్టి సద్గుణశీలుడగు శ్రోత లభించినపుడే నామాఘమాసము మాహాత్మ్యములు చెప్పవలెను. ఇది సత్యము" అని సూతుడు శౌనకాది మునులకు చెప్పెను.

ఇది స్కాందపురాణాంతర్గతమగు
మాఘపురాణమునందు ముప్పదియవ అధ్యాయము.



## మాఘస్నాన వివరణ

మాఘమాసమున మకర సంక్రమణము మొదలు కుంభ సంక్రమణము వరకుగాని మాఘశుద్ధపాడ్యమి మొదలుకొని మాఘబహుళ అమావాస్యవరకుగాని సూర్యుడర్ధోదితు డగుచుండగా ప్రతి మానవుడును స్నాన మాచరింపవలెను. సూర్యోదయమునకు పిమ్మట చేయు స్నానము వ్రతస్నానము కానేరదు.

మాఘమాసమున సూర్యోదయ సమయమునజలములన్నియు బ్రహ్మహత్యాదోషమును కల్లుద్రావిన పాపమును గూడ బోగొట్టి పవిత్రులను చేయగలవు. మాఘమాసమున మకర రాశియందు

సూర్యుఁడుండగా వేడినీటితో స్నానమును యింటివద్ద జేసినను ఆఱు సంవత్సరములు ప్రతనియమముతో చేసిన స్నానఫలము గలుగును. కాలువ, చెఱువు మొదలగు వానియందు స్నానముచేసిన పండ్రెండు సంవత్సరముల ఫలితమునిచ్చును. నదియొక్క కాలువయందు స్నానమాడిన ద్విగుణము, నదియందు సహస్రగుణము, గంగాయమునా సంగమమైన ప్రయాగయందు స్నానమాడిన, నూరుకోట్లు ఫలము కలుగును. మానవుడు మాఘమాసమున మార్తాండుడు, మకరరాశి స్థితుడై యున్నప్పుడు సూర్యుడర్ధోదితుడగుచుండగా ఎక్కడస్నానము చేసినను; ప్రయాగను, శ్రీహరిని మాత్రము స్మరించుచుండవలెను. స్నానము సంకల్ప పూర్వకముగా జేయవలెను. స్నాన సంకల్పము చూడవలెను, దుఃఖమును దరిద్రమును నశింప జేయుటకు పాప నాశనకరమైయుండు మాఘమాసపు ప్రాతఃకాల స్నానము విష్ణు ప్రీతికై చేయుచున్నాను. గాన ఓ శ్రీహరీ! కృష్ణా! వాసుదేవా! గోవిందా! అచ్యుతా! మాధవా! నేనును చేయు యీమాఘ స్నానములకు తగు ఫలితము నిమ్ము అని విష్ణుమూర్తిని ప్రార్థించి ఆ పిమ్మట స్నానము చేయవలెను, పిమ్మట బ్రాహ్మణ సంతర్పణ చేయ వలెను.

## గద్య

ఇది శ్రీకౌశిక గోత్రపవిత్ర జయంతివంశపయఃపారావారరాకాసుధా
కర, సుందరాంబ బలరామేశ్వరగర్భ శుక్తిముక్తాఫల
సాహజపాండిత్య, జగన్నాథశాస్త్రి నామధేయ
ప్రణీతంబైన స్కాందపురాణాంతర్గతమగు
మా ఘ పు రా ణ ము
సంపూర్ణము.



## పురాణపఠనానంతరమున చదువదగినది.

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేనమార్గేణమహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం
లోకాస్సమస్తా స్సుఖినోభవంతు
కాలేవర్షతుపర్జన్యః పృథివీసస్యశాలినీ
దేశోయం క్షోభరహితో బ్రాహ్మణాః సంతునిర్భయాః
సకాలేభవితావృష్టిర్దేశోస్తు నిరుపద్రవః
సమృద్ధా బ్రాహ్మణాస్సంతు రాజాభవతుధార్మికః
సర్వేచసుఖినస్సంతు సర్వేసంతు నిరామయాః
సర్వేభద్రాణి పశ్యంతు మాకశ్చి త్పాతమాప్నుయాత్
అపుత్రాః పుత్రిణస్సంతు పుత్రిణస్సంతు పౌత్రిణః
అధనాస్సంతు జీవంతుశరదాంశతమ్



# ధనుర్మాస వ్రత మహాత్మ్యము

## (తా త్ప ర్య స హి త ము)

ఋషయః

ఆఖ్యాతంభవతాసూత తులశ్యాశ్చప్రభావకం
సర్వాఘౌఘహరం పుణ్యం భుక్తిముక్తిప్రదంశుభమ్ 1
ఇదానీం శ్రోతుమిచ్ఛామో ధనుర్మాసస్యవైభవం

సూతః :

నారదాయపురాగీతం బ్రాహ్మణాపర మేష్టినా 2

పూర్వము నానాద్రుమ లతాశోభితమును, సకల జంతు నివాహకోలాహల సంకలితమును, సమస్త పవిత్ర మునిగణవిరాజిత మును అగు నైమిశారణ్యమను పుణ్యస్థలమందు శౌనకుడు మొద లగు మునులు సూతునివలన వ్యాసమహర్షిచే జెప్పబడిన సమస్త పురాణములను వినుచు ఆ పౌరాణికోత్తముని గాంచి యిట్లుబలికిరి. సూతుడా! సమస్తపాపములను పోగొట్టి, యిహపర సౌఖ్యముల నొసంగునట్టియు, పుణ్యప్రదమగు నట్టిదియు. శుభదాయకమును నగు తులసీ మహాత్మ్యమును నీవల్ల వింటిమి. ఇప్పుడు మాకు ధనుర్మాస మహిమను గురించి చెప్పగోరుచున్నాము. దానిని విను టకు కుతూహలులమై యున్నాము, గాన మాకు దయతో జెప్పు మని వేడగా సూతపౌరాణికుడు శౌనకాదిమునులను గాంచి యిట్లు పలికెను. మునిచంద్రులారా! పూర్వమందు పరమేష్టియగు బ్రహ్మ దేవుడు తన పుత్రుడైన నారద మహాముసీంద్రునకు యీధనుర్మాస మాహాత్మ్యమును చెప్పియుండెను.

తదోఽహంసం ప్రవక్ష్యామి శృణుధ్వం భక్తి పూర్వకం
వ్రతానాం చైవ సర్వేషాం దానానాం యజ్ఞకర్మణామ్ 3
అధికంస్వ పుణ్యానాం ధనుర్మాస ఫలంశుభం
వదంతి మునయస్సర్వే దేవా బ్రహ్మాదయస్సురాః 4

గాన నేను దానిని మీకు జెప్పెదను భక్తితో గూడిన వారై వినుడు. సమస్తమైన వ్రతములన్నిటిలోను యజ్ఞ యాగాది సర్వ క్రతువులలోను, సకల దానములలోను, సకల మంగళములను సమకూర్చి, సర్వ పుణ్యములను గలుగజేసి, మానవులకు సుఖమిచ్చు ధనుర్మాస వ్రతమును మించినది వేఱొకటిలేదు. అని బ్రహ్మాది దేవత లెల్లరు చెప్పుదురు.

ఋషయః

తత్కథం ముని శార్దూల! పూర్వస్యాధికముత్తమం

సూతః

ధనుర్మాసస్యమాహాత్మ్యం వక్తుం విస్తరతోమయా 5
నశక్యముని శ్రేష్ఠాస్తథావర్ష శతైరపి,
అన్యేషుచ పురాణేషువిస్తరేణ ప్రకీర్తితం 6
సంక్షేపాదభిధాస్యామి శృణుధ్వంభక్తి సంయుతాః
ధనుస్సంక్రాంతమారభ్య మాసమేకం వ్రతంచరేత్ 7

అని సూతుడు చెప్పగా విని మునీశ్వరులు సూతునితో ఓ ముని శార్దూలా! ధనుర్మాసవ్రతమన్నిటికంటె నధికమెట్లయ్యెను అని యడిగిరి. అంత సూత పౌరాణికుడిట్లు చెప్ప దొడగెను. మునులారా! వినుడు. ఆధనుర్మాసప్రభావమును వివరముగా విస్తరించి చెప్పుటకు నూరు సంవత్సరములైనను నేను చాలను. అన్ని పురాణములందును, వివరముగా విస్తరించి చెప్పబడినదానిని నేను మీకు సంక్షేపముగా చెప్పబూనితిని. మీరు భక్తితోకూడినవారై వినుడు.

జపాద్ధోమాత్తథాదాన ద్యాగాచ్చతపసోఽపిచ
ధనుర్మాసస్థ విశిష్టంహి పురాణై పరికీర్త్యతే 8

అకర్మణాకృతాపూజా కార్తికే విష్ణువల్లభే
అపునర్భవదా ప్రోక్తా నిత్యముక్తం ద్విజోత్తమాః 9
యస్సంపదంసముద్దిశ్య కరోతి మనుజోముదా
ససంపద మవాప్నోతి సకలాం ముని పుంగవాః 10

ధనుస్సంక్రాంతి మొదలు ఒక నెలరోజులు యీ ధనుర్మాస వ్రతము ఆచరింపవలయును. జపము, హోమము, తపస్సులను చేయుదానికంటె. దానము, యాగము చేయుటకంటెను యీధనుర్మాస వ్రతము ఆచరించుట శ్రేష్టమని పురాణములు పల్కుచున్నవి. ఏ మానవుడైనను కర్మల నాచరింప కున్నను ధనుర్మాసమున శ్రీహరికి ప్రీతిగా భక్తితో పూజగావించిన వాడు తిరిగి జన్మలేని శాశ్వత వైకుంఠపదవిని పొందగలడనుటలో సందియము లేదు. ఏ నరుడు సిరిసంపదల నాశించి యీ ధనుర్మాసమున సంతోషముతో శ్రీహరిని పూజించునో వాడు సంపదలను పొందును.

అకృత్వా సర్వదానాని హ్యస్నాత్వా పుణ్యవానదీః
ఏకదావా ధనుర్మాస మాచరేద్యదిమానవః 11
సర్వదాన స్నాన ఫలం ప్రాప్నోత్యేవ నసంశయః
ఖాదన్మాంసంపిబన్ మద్యం సంగచ్ఛన్నంత్య జాతిభిః 12
సకృద్ధనుర్మాసచరా త్తత్పాపం నాశమాప్నుయాత్
జపాసన పరిత్యాగీ దేవలాన్న స్యభోజనః 13
సురాపయోషిత్సంసర్గీ గణికన్నాశన స్తథా
గణాన్న భోజనశ్చైవ పతితాన్న రత స్తుయః 14
యేచమర్త్యాః ప్రముచ్యంతే ధనుర్మాస ప్రపూజనాత్
అనిషేవ్య రవిం వహ్ని మనుపాస్యపరాన్ సురాన్ 15
శుభకామోహి మనుజో ధనుర్మాసం చరేద్యది
ముచ్యతేసర్వ పాపేభ్యో విష్ణులోకే వసేచ్చిరమ్ 16

ఎవడైనను యేదానమును చేయక, స్నానమును చేయక యుండి యేదోయొకప్పుడైనను పుణ్యప్రదమగు ధనుర్మాస వ్రతము నాచరించెనేని అతడు సర్వదానములను చేసిన ఫలము, సమస్త

నదులయందు స్నానము ఆడిన ఫలమును పొందును. ఇందుకు సందేహములేదు. ఏ మానవుడైనను చండాలాది నీచమానవుల సహవాసముచేత మాంసము తిని కల్లు త్రావియున్నను. ఎప్పు డైనను ధనుర్మాస వ్రతమును చేసెనేని అతని పాపము లన్నియు నశించును నిత్యము ఔపాసన కర్మను చేయనివాడును. దుష్టాన్న ములను తినువాడును, కల్లుత్రావు నలవాటుకల కాంతలతో రమించు వాడును గణికాన్నంబును, గణాన్నంబును, నీచుని యన్నమును తినువాడు యీధనుర్మాస వ్రతము నాచరించుటవలన పవిత్రులు కాగలరు. ఎవడైనను సూర్యునుపాసింపక, అగ్నిహోత్ర కర్మల నాచరింపక, దేవతాపూజను గావింపక, యీ ధనుర్మాస వ్రతమును చేసెనేని ఆనరుడు సమస్త పాపముల నుండి విడువడి అంత్యమందు విష్ణులోకమును జేరి శాశ్వత నివాసము చెందగలడు.

భగినీం గురుభార్యాంచ తద్వైవచ రజస్వలామ్
భ్రాతృభార్యాం మిత్రభార్యాం మద్యపాంచ పరస్త్రియమ్ 17
హీనస్త్రీయంచ విశ్వస్తాం యోభిదచ్ఛ తిరాగతః
తాంగతం సమవాప్నోతి ధనుర్మాసవ్రతి క్రమాత్ 18
కపిలాగోసహస్రేణ కన్యాద్వాదశదానతః
యత్ఫలం సమవాప్నోతి బ్రాహ్మణేభోజ నేకృతే 19
బ్రహ్మలోకేచ వైకుంఠే కైలాసేభూతి లేషుచ
రంతుమిచ్ఛా భవేద్యేషాం తేకుర్వంతి వ్రతమ్‌శుభమ్ 20
చతుర్ణామపి వేదానాం సాంగానాం పారగామినాం
యత్రాప్తతస్నానాయాం నిత్యమగ్ని హోత్రరతాత్మనామ్ 21

ఏ మనుష్యుడైనను, సోదరిగాని, గురువుభార్యనుకాని రజ స్వలమైన స్త్రీనిగాని సోదరుని భార్యనుగాని, స్నేహితుని భార్యను గాని, కల్లుత్రావునట్టి నీచస్త్రీనిగాని, విశ్వస్తనుగాని, కామోద్రే కముచేత గూడ రమించెనేని, వాడు యెట్టినరకలోకమును పొందునో అట్టి లోకమునే యీధనుర్మాసవ్రత మాచరింపని మానవుడుకూడా

పొందును. కపిలగోవులను వేయింటిని దానమిచ్చిన ఫలితమును,
పండ్రెండు కన్యాప్రదానములు చేసిన ఫలమును యీధనుర్మాసమున-
బ్రాహ్మణప్రీతిగా భోజనముపెట్టినందువలన గలుగును. బ్రహ్మలోక
మందును, వైకుంఠమందును కైలాసమందును భూలోకమందును,
గూడ పుణ్యలోకములను పొంది యిహపరసుఖముల నందగోరువాడీ
ధనుర్మాసవ్రతము నాచరింపవలెను.

నిత్యాన్న దానవ్రతినాం నిత్యశ్రాద్ధరతాత్మనాం
సహాతిథిభోజన్న కృత్వాం నిత్యం గోపూజకారిణామ్ 22
ఫలశాకస్వర్ణ తామకాంస్యలోహ మయాత్ సుఖాన్
తాంబూలపుష్ప ధాన్యాదివస్త్రతండులమైక్షవమ్ 23
నిత్యదాన కృతావతాం యాగతిః ప్రోచ్యతే బుధైః
ధనుర్మాసాన్న దానేన సాగతిర్భవతి ధ్రువమ్ 24
సహస్రంవా పంచశతంవా మునిసత్తమాః
పంచాశద్దశసంఖ్యా కాన్యథావిత్తానుసారతః 25
విప్రా న్వేదవిదశ్శాంతాన్ యతీంశ్చనియమోజ్జ్వలాన్
శాకై స్సూపైరనేకైశ్చఘృత భక్ష్యైర్మనోహరైః 26
శాల్యన్నైర్దధి ఖండైశ్చపరమాన్నై రనేకధా
శర్కరాకదళీ స్వాదుఫలైస్సతాంబూల సంభవైః 27
ఏవం యః కారయేద్విద్వాన్ బ్రాహ్మణానాం భోజనముదా
ఇహైవభుక్త్వాసకాలాన్ పుత్రపౌత్ర సమన్వితాన్ 28
దాసీదాసాననేకాంశ్చ హస్త్యశ్వరథసంకులాన్
భుక్త్వాభోగాననేకాంశ్చ ఇహైవససుఖంవసేత్ 29
దీర్ఘాయుశ్చనిరోగీచ బహుమాన్యస్సమేఘచ
వదంతే సర్వలోకేషుస్థిత్వాతత్రవ్యవస్థితాన్ 30
భుక్త్వాభోగాననేకాంశ్చపునరావృత్తివర్జితం
మోక్షంప్రజేమ్మని శ్రేష్ఠా! బ్రాహ్మణానాంతుభోజనాత్ 31
యేకుర్వంతి సదాభక్త్యానరాస్సర్వత్రగామినః

వేదములను, వేదాంగమును చదువుకొన్న వాడును, నిత్యమును తప్పక ప్రాతఃస్నానమును చేసి నిత్యకర్మలను, నిత్యాగ్నిహోత్రకర్మలను చేయువాడును నిత్యమును అన్నదానము చేయువాడును నిత్య శ్రాద్ధపితృకర్మలు జేయువాడును, సదా గోపూజచేయువాడును, పండ్లు, కూరలు, బంగారము, రాగి, కంచులోనగు లోహములను, తాంబూలము పువ్వులు, ధాన్యము, యీ మొదలైనవస్తువుల దానములను ప్రతినిత్యము చేయువారును, పోవు పుణ్యలోకమునకే యీ ధనుర్మాసమున అన్నదానము చేయువారుకూడ పోగల్గుదురు. ఈ ధనుర్మాసమున మానవుడు తనకు గల శక్తినిబట్టి బ్రాహ్మణులకు, వేదవిదులయినట్టియు, శాంతులయినట్టి విద్వాంసులకు, యోగులకు, నియమముగల సజ్జనులకు ఏబదిమందికిగాని, నూరుమందికిగాని, అయిదువందలమందికి గాని, వేయిమందికి గాని అనేక విధములగు భక్ష్యభోజ్యయుతంబును శాక సూపఘృతదధి క్షీరసమాయుక్తంబును నగు శాల్యన్నమును, అనేక విధములగు మధురఫలములతో గూడ పెట్టవలెను. అట్లు అన్నదానము చేసినవాడు యీ లోకమందే సమస్తమైన సుఖములను పొంది, అంత్యమందా స్వర్గలోకమున అనేక భోగము లనుభవించి శాశ్వత మోక్షమును పొందును. ఇహమందు పుత్రపౌత్రాదులతోడను, దాస దాసీపరివారముతోడను, ఏనుగులను, గుర్రములను యెక్కుచూ, రథములను నడుపును దీర్ఘాయుర్దాయవంతుడయి మంచియారోగ్యమును గలిగియుండి సుఖించును.

నారద :- తావకేన విధానేన ధనుర్మాసప్రపూజనమ్ 32
విధినా కేనకర్తవ్యం తత్ర కానామదేవతా
కదావాపరిపూర్ణంస్నాత్కదా వాతదుపక్రమః 33
ఏతత్సమస్తం విస్తార్యకథ యస్వపితామహా !

నారదు డడిగెనంత; తండ్రీ! యీ ధనుర్మాస వ్రతమును యెట్లు చేయవలెను? ఏ విధానము చేత ప్రారంభింప వలయును. ఏ

వ్రతమున కధిదేవత యెవరు? ఎప్పుడు యీ వ్రతమును మొదలు పెట్టవలెను? ఎప్పుడు ముగింపవలెను? ఈ వివరమంతయు పూర్తిగా నాకు తెల్పుము.

బ్రహ్మోవాచ-బ్రహ్మ చెప్పుచున్నాడు.

ఉదయాత్పంచఘటికా ప్రాత రుత్థాయయత్నతః 34
స్నానంకృత్వా ప్రథమతో నిత్యకర్మసమాచరేత్
కృత్వాసంధ్యాదికం చాపి వేదమాతుర్జపంతథా 35
యథోచితంకర్మ కృత్వా దేవపూజాం సమాచరేత్
యథా కామ్యాశ తత్కర్మభుం క్తేల్పద్వాదశీదినే 36
తథాప్రాతర్ధనుర్మాసే సర్వకర్మాస్సమాచరేత్
పంచనిష్క ప్రమాణేన తదర్ధార్ధేనవాపునః 37
ప్రతిమాం కారయేద్విద్వా న్యధాశక్త్యనుసారతః
మధుసూదన నామ్నావై ప్రత్యహం పూజయచ్ఛ్రుతామ్ 38
ధనుస్సంక్రాంతి మారభ్య మాసమేకం వ్రతం చరేత్
పూజయేత్ ప్రయతో భక్త్యా వాద్యఘోషపురస్సరమ్ 39
గోక్షీరంశంఖ మాపూర్య స్నాపయేన్మధుసూదనమ్
నారికేళోదకేనైవవతాథా పంచామృతేనచ 40
స్నానయేధథవిష్ణోచ్ఛతులసి కోమలైర్దళైః
సహస్రనామభిః పూజయన్నైత్యః పుష్పైరనేకశః 41
ధూపదీపాదిభిర్గేనంతథాష్టోత్తరనామభిః
నైవేద్యాన్నవిధానం వై ప్రవక్ష్యేశృణునారద 42

కుమారా నారదా! మానవుడు సూర్యుడు ఉదయించుటకు ముందు అయిదు గడియలకు లేచి స్నానముచేసి నిత్యకర్మలను నెరవేర్చి పిమ్మట యథోచితముగా మాధవుని పూజింపవలయును. ఏకాదశినాడుపవాసముచేసి ద్వాదశినాడు నరుడుచేయు యథోచిత కర్మలవలెనే యీ ధనుర్మాసవ్రతము చేయువాడును నిత్యకర్మలను చేయవలయును. తన శక్తికొలది పంచనిష్క ప్రమాణము గలదైనను, అందులో సగమైనను ప్రతిమను చేయించి మధుసూదనుని

పీటిడి నియమము, వాద్య విశేషములు వెలుంగగా, ఆవుపాలు, కొబ్బరికాయనీళ్ళు, పంచామృతము మొదలగువానిచేత స్నానము చేయించి, సుకోమలములగు తులసీదళముల చేతను, అనేకవిధములగు పువ్వులచేతను, నూటయెనిమిది నామములతో పూజ గావించి ధూపదీపము మొదలైనవి సమర్పించు నైవేద్యమును సమర్పించవలెను. ఆ నైవేద్య విధానము చెప్పెదను వినుము.

ముద్గద్విళసంఖ్యాతు తండులానంతథైవచ
తయోః ప్రమాణం వక్ష్యామి ముద్గాన్నకరణే త్విహ 43
తండులానాం సమం చేత్స్యాముద్గాద్విదళ ముత్తమం
మధ్యమం తండులార్థంవై తదర్థమధమం స్మృతమ్ 44
ముద్గానాం ద్విదళం కేచిద్ద్విగుణం ప్రవదంతిహిః
మరీచిహింగులవణ పాచితం సుమనోహరం 45
ముద్గద్విదళసం మిశ్రం శాల్యన్న మతుతో పమం
సుగృహాణహృషీ కేశతవప్రీత్యై నివేదితమ్ 46
గోక్షీరపాచితం దివ్యం సితశర్కరయాన్వితం
పరమాన్నంతథా భక్ష్యాశాకై ర్నానావిధైరపి 47
కదళీఫల గోక్షీర దధిఖండవిమిశ్రితం
నైవేద్యం గృహ్యతాం దేవ! మధుసూదన! కేశవ! 48
ఇతిదత్వాచ నైవేద్యం తాంబూలం సుమనోహరం
హిరణ్యగర్భమంత్రేణ దక్షిణాంచని వేదయేత్ 49
నీరాజనేన వై దేవం పుష్పాంజలి విధానతః
ప్రదక్షిణ క్రమేణైవ నమస్కారేణ వైనతః 50
ప్రత్యహం పూజయేద్దేన మేవం పూజావిధానతః
అర్థమాస మిదం వత్స! ముద్గాన్నంనిష్ఠ వేర్పయేత్ 51

బియ్యముతో సమముగా పెసరపప్పును చేర్చి పొంగలిగా జేయుట ముఖ్యము. ఆ నైవేద్యపరిమాణమును తెల్పెదను వినుము. బియ్యములో సగము పెసరపప్పు చేర్చి పొంగలిగావించుట మధ్యమము, బియ్యములో నాలుగవవంతు పెసరపప్పు చేర్చి పొంగలిగా

గావించుట అధమము. కొందఱు బియ్యమునకు రెట్టింపు పెసరపప్పు చేర్చవలెనని యందురు. మానవుడు భక్తిగలవాడై మధుసూదనా! కేశవా! మరీచిహింగులవణ సహితమైనట్టియు పెసరపప్పు బియ్యము కలిపి వండినట్టియు, అనేకమైన కూరలు కలిగినట్టియు, మనోహరమగు యీ శాల్యన్నమును నీకు నైవేద్యముగా సమర్పించుచున్నాను. గైకొనుము. హృషీకేశా! నీప్రీతికై, ఆవుపాలతో వండినట్టియు, దివ్యమైన తెల్లని చక్కెరతో కూడినట్టియు నగు క్షీరాన్నమును ఫలురకముల శాకములతోడను, అరటిపండ్లతోడను, ఆవుపాలతోడను, పెరుగుతోడను, కూడియున్న హారము నీకు నైవేద్యముగా సమర్పించుచింటిని, గైకొనుము. అని యీ విధముగా హరికి సమర్పింపవలెను.

నైవేద్యానంతరము మనోహరమగు తాంబూలమును సమర్పింపవలెను. హిరణ్యగర్భమను మంత్రముచేత దక్షిణకూడా యుంచవలెను. ఆ పిమ్మట నీరాంజనమును, పుష్పాంజలియు, ప్రదక్షిణానమస్కారములును గావింపవలెను. ఈ విధముగా ప్రతిదినమును శ్రీమహావిష్ణువును పూజచేయవలెను ఇట్లు నగమునెల అనగా పదునైదు దినములు విష్ణుప్రీతికయి పెసరపప్పు పొంగలినే నైవేద్యమిడవలయును.

ఉషఃపూజాం ధనుర్మాసే యోనకుర్యాత మందధీః
కోదండస్థే సవితరి మాసం ద్వాదశ శోభితం . 53
నైవేద్యం యోర్పయేత్తస్మై తస్య పుణ్యఫలం శృణు
సహస్రవార్షికీపూజా దినేనైకేన లభ్యతే 54
యదేష్టం దధిఖండేనత ద్దైలానాగ రేణవై
మరీచిహింగుళసమ్మిశ్రిరాదధ్యన్నం సాధుసంయుత 55
మాసార్థానంతరం వత్స! ముద్గాన్నేనసమ మునే
మాదద్యాదర్ధమాసంతు సామ్రాజ్యంలభ్యతే ధ్రువం 56
ముఖ్యారుణోదయే పూజాముధ్యకాలు ప్రకారకాం
అధమాసూర్యసహితతో వైహ్యమాధమాభ 57

సూర్యోదయే ప్రశస్తంహి బ్రాహ్మణానాంతుభోజనమ్
ద్విముహూర్తాత్పూర్వమన్నం మధ్యమం పరికీర్తితమ్
త్రిముహూర్తాత్పూర్వ మన్న మధమం మునిపుంగవ ! 58

ఉషం ఘృతపుతంచాన్నంముద్గద్విదళసంయుతం
భక్త్యాశర్కరయా స్వాదుదధిఖండేనమిశ్రితమ్
శాకై రనేకై స్సంయుక్త పరమాన్నం మనోహరం
యోఽర్పయే ద్బ్రాహ్మణేభ్యస్తుతస్యపుణ్యఫలంశృణు 60

ఈ ప్రకారముగా ధనుర్మాసమున నే మానవుడైనను ప్రాతః కాలమున పూజనుచేయడో, యాత దేవుజన్మంబులయందు వరుసగా దరిద్రుడయియుండి తదనంతరమందు నరకవాసము చేయును. ఏమానవుడు ధనుర్మాసమున భక్తియుక్తుడయి యొకదినమందయినను దేవాది దేవుడయిన శ్రీహరికి నైవేద్యమును సమర్పించునో అతడు నూరుసంవత్సరములు మాధవుని పూజించిన మహిమను గాంచగలడు. ఎవడు పెరుగుతోగూడిన ఏలకాయలు, జాపత్రి మొదలగు వాటితోడను ఇంగువతోడనుగూడిన, అల్లమునుకూడ చేర్చిన దధ్యోదనమును, రుచికరముగా నైవేద్యమును శ్రీహరికి ప్రీతికయి చేయుచున్నాడో, అట్లు పదునయిదుదినములు చేసి పూజ చేయుచున్నాడో, ముద్గాన్నమునువండి నివేదించుచున్నాడో అతడు సామ్రాజ్యమును పొందగలడు. ముఖ్యముగా అరుణోదయకాలమందు శ్రీహరికి పూజచేయుట ఉత్తమము. నక్షత్రములు తగ్గిపోయిన వెనుక పూజించుట మధ్యమము. సూర్యోదయమైన వెనుక విష్ణుదేవు నారాధించుట అధమాధమము సూర్యోదయకాలమున బ్రాహ్మణ భోజనము ఉత్తమము. సూర్యోదయమునకు రెండుముహూర్తములు వెనుక భుజించుట మధ్యమము మూడుముహూర్తములు వెనుక అధమము. నారదా ! పప్పుతోకూడిన, నేతితో కలిపిన అన్నపు పొంగ

ము, పిండివంటలతోడను, పెరుగుతోడను, పాయసాన్నములతోడను మనోహరమగు కూరలతోడను భోజనమును బ్రాహ్మణునకు యీ ధనుర్మాసమున పెట్టువాని పుణ్యము చెప్పెదను వినుము.

వారణాస్యాం ధనుష్కోట్యాం త్రివేణీసంగ మేపిచ
యత్ఫలం ఋషిభిః ప్రోక్తం శత బ్రాహ్మణభోజనాత్ 61
తత్ఫలం సమవాప్నోతి బ్రాహ్మణే భోజనకృతే
అగ్ని ప్రజ్వలనంకృత్వా సీతార్తేభ్యః ప్రయచ్ఛతి 62
సర్వలోకేషు చిరం రమతేఽత్ర నసంశయః
అరోగిగాత్ర కాంతిశ్చ భవేజ్జన్మనిజన్మని 63
తస్మాత్త్వశ స్తంభో విప్రా ! అగ్నిదానంహి కార్ముకే
శీతావాతార్త విప్రాయ వస్త్రంకంబళే మేనవా 64
యోదదాతి మునిశ్రేష్ఠ ! ఇహాముత్రసుఖంలభేత్
ఉషఃపూజా ధనుర్మాసే లభ్యయతిమానవైః 65
త్రైలోక్యతస్యపుణ్యంచకోవక్తుక్షమతేనరః
అనేక జన్మసహస్ర పుణ్యానాంతుఫలేనవై 66
కరోతివై దేవపూజాం సర్వాభీష్టప్రసిద్ధయే
ఏవంకృత్వా మహాపూజా సర్వదారిద్ర్యనాశినీ 67
సర్వసంపదత్ప దా పుణ్యా పుత్రపౌత్ర ప్రదాయినీ
భవిష్యతి నసందేహ స్సత్యం సత్యం మయోదితమ్ 68
వర్షేవర్షేతు కర్తవ్యం ధనుర్మాసవ్రతముదా
పూజాయాం వర్తమానాయాం పుణ్యాత్మాతు దినేదినే 69
ధనుర్మాసస్యమాహాత్మ్యం శృణుయాద్భక్తిపూర్వకం
సత్కథాశ్రవణం విష్ణోర్భయరోగ వినాశనమ్ 70

ఈ ధనుర్మాసమున ఒక విప్రునకు భోజనము పెట్టినయెడల అతడు కాశీ యందును ధనుష్కోటి యందును, త్రివేణీసంగమ మం

దును, నూరుమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టినందువలన యేఫలితము కలుగునో ఆ ఫలితము కలుగునని ఋషులు చెప్పిరి. ఈ ధనుర్మాసమున చలి బాధనొందు వారలకు అగ్నిప్రజ్వాలనము చేసి యిచ్చి వాని బాధతీర్చునరుడు సమస్తలోకములందును శాశ్వత సౌఖ్యమును గాంచగల్గును. యిందులకు సందేహములేదు, జన్మజన్మమునందును రోగములేనివాడై; శరీర కాంతిగలవాడై యుండును. కాబట్టి ధనుర్మాసమందు అగ్నిదానము ముఖ్యమైనది. నరుడీ ధనుర్మాసమున చలిబాధ నొందు బ్రాహ్మణులకు వస్త్రము, కంబళము దానముచేసెనేని అతడు యిహమందును, పరమందు కూడ సుఖించును. ఉషఃకాలయున ధనుర్మాస పూజచేయు మానవుని యొక్క పుణ్యమును చెప్పుటకు యీ మూడులోకము లందును యెవ్వడును సమర్థుడు కానేరడు, అనేకవేల జన్మలయందు చేసిన పూర్వపుణ్య విశేషముచేతనే యీ ధనుర్మాస పూజచేయుట కలుగును. ఈ ధనుర్మాస పూజను చేసినవాడు, సమస్త దరిద్రముల నుండి విడువడి సర్వసంపదలు పొందగలడు. పుత్ర పౌత్రులను కూడ పొందగలడు. నాచేత చెప్పబడిన యీ విషయము నందు సందేహ మేమాత్రమును లేదు. ఇది వాస్తవము. మనుష్యుడు ప్రతిసంవత్సర మందును యీ ధనుర్మాసపూజ చేయునేని సంతోషముతో పూజాభక్తితో ప్రతిదినమందు పుణ్యావంతుడై, యీధనుర్మాస పురాణమును, మహిమను వినునో అట్టివాడు భయము రోగము లేక సుఖించును.

అజ్ఞాన తిమిరాంధానాం దీపోఽయం జ్ఞానసిద్ధిదః
భవరోగ నిబద్ధానాం సంసేవ్యం పరమౌషధమ్ 71
మహాపాతక శైలానాం వజ్రోయం ధనురుత్తమం
యేశృణ్వంతి సథా విష్ణోః కథాంభువన పావనీమ్ 72

తేవై మనుష్యలోకేస్మి వైష్ణవాహి నసంశయః
యేశృణ్వంతి హరేర్గాథాం ధనుర్మాస కృతాం సదా 73
తేషాం పాదరజాంస్యేవ తీర్థాని ముపయోజగుః
తస్మాన్మి శ్రేయసకతుం యే౽భివాంఛంతి దేహినః 74
యేశృణ్వంతి సదా భక్త్యాధనుర్మాస కథామిమాం
యద్యశక్తశ్చిరం శ్రోతుం శీతవాత భయార్దితః 75
ముహూర్తం వాపిశృణుయాన్మాసమేకం నిరంతరం
అతః ప్రతిదినం శ్రోతుం ధనుర్మాసవ్రతం శుభమ్ 76
అశక్తోయదిమర్త్యో౽సౌశీతవాతాది పీడితః
తేవైధృతౌ వ్యతీపాతే దశమాం ద్వాదశీదినే 77
అష్టమ్యాం పౌర్ణమాస్యాంచ తథా పుణ్యదినేష్వపి
ధనుర్మాసస్య పూజాం వై యః కుర్యాద్యవిమానవః 78
సనిష్క్రిమ్యేచ సంసారాత్తద్వాదుష్కర్మ కాటవీం
యేశృణ్వంతి సదా భక్త్యాన తేషాం భవదుర్గతిః 79
యేనా౽౽చరంతి మనుజా ధనుర్మాసవ్రతం శుభం
చండాల యోనిం తేయాంతి దశజన్మ సునారదః 80

ఈ ధనుర్మాస్య వ్రత మహాత్మ్యము నేనరుండు భక్తియుక్తుడై వినునో, అతడు అజ్ఞానమను అంధకారమున బడువారికి దీపమువంటిదియు, జ్ఞానమును కలిగించునదియు రోగబాధ నొందువారికి ఔషధమువలె, సంసార బాధనొందువారికి పరమ ఔషధమును, పర్వతములకు వజ్రాయుధము వలె మహాపాతకములను ఖండించు నదియు నగు యీ ధనుర్మాసము వలన ముక్తినిగాంచును ఎవరు ధనుర్మాసమున యీ శ్రీహరి కథామృతమును నిరంతరము వినుచుందురో అట్టివారు వైష్ణవులన బడుదురు. అట్టివారి పాద

ధూళియే సమస్తమైన తీర్థములని మునులు చెప్పెదరు, ఈ ధనుర్మాసకథను, శ్రీహరి కథలను వినువారు మోక్షమును పొందగలరు. సదా యీ హరికథను వినజాలని వారు, చలి, గాలి, చేత బాధ నొందువారు సదా నెలరోజులూను ప్రతినిత్యము ముహూర్తకాలము వినవలెను. అట్లుచేయుటకును నశక్తుడయ్యేనేని, వైధృతివ్యతీపాతము లందును, దశమీ, ద్వాదశులయందును, అష్టమీ, పూర్ణిమల యందును, యీ మొదలగు పుణ్య దినములందు భక్తియుక్తుడై శ్రీహరి కథలను వినవలయును. ధనుర్మాసమందిట్లు వ్రతమును చేయువారు దుష్కర్మలను అడవిని దహించి సంసారకష్టములనుండి ముక్తులగుదురు. వారికి దుర్గతులుండనేరవు. ఏ నరులీ ధనుర్మాస వ్రతమును నాచరింపరో, వారు పదిజన్మలవరకు భగండాల జాతియందు జన్మింతురు.

యత్ఫలంసర్వయజ్ఞేషు సర్వదానేషు యత్ఫలం
సకృద్ధనుర్మాస చరాత్తత్ఫలం విందతేనరః 81
యేనకుర్వంత్యజానంతో ధనుర్మాసవ్రతోత్తమం
పితృతో మాతృతశ్చైవ కులమేకోతరం శతమ్ 82
పచ్యంతే నరకే ఘోరే యావత్కాలిశతత్రయం
దృఢపుష్టి శరీరోపి హిమశీతభయాన్నరః 83
నకరోతిహి పాపాత్మా క్రిమికీటాది జంతుషు
భూత్వాభూత్వాత ధాన్యాని శరీరాణ్యథలభ్యచ 84
సమస్తేష్వేషు ఘోరేషు నరకేషు వసన్ సదా
తదంతేభువమాసాద్య విష్ఠా కూపే క్రిముర్భవేత్ 85
విందన్ వై నకరోతిస్మ మూఢాత్మా పాపచేతసః
పద్యతే నరకేఘోరే యమదూతైర్భయానకైః 86
నరకాత్తరణం నాస్తి తస్య కల్పశతైరపి

ఇతి హాస పురాణాని భూయో భూయో మహామునే 87
సర్వదైవతు కర్తవ్యం కర్తవ్యం ధర్మమిచ్ఛతా
న వేదేషు పురాణేషు ధనుర్మాసవ్రతం సమమ్ 88
నియతస్తం వ్రతం దృష్ట్వా ధనుర్మాస ప్రపూజనం
వివర్ణ వదనో భూత్వాతత్పాపం మార్జయేత్యనః 89
ధనుర్మాసవ్రతం వత్స! మాసమేకం నిరంతరం
కుర్యాత్సర్వ ప్రయత్నేన విత్తలోభ వివర్జితః 90

సమస్తమైన యజ్ఞయాగాది క్రతువులు చేయుటవలన కలుగు ఫలితములను, సర్వదానమును చేయుట వలన గలుగు ఫలమును ధనుర్మాస వ్రతమొకసారి మాత్రము చేయుట వలన కలుగును. ఈ ధనుర్మాస వ్రతము నెవరు అజ్ఞానముచే ఒకసారైనను ఆచరింపరో వారు, తండ్రి వంశము వారితోడను, తల్లి వంశము వారితోడను నూటయిరువది తరములవారితో గూడిమూడువందలకలియుగములు ఘోరమైన నరకమును అనుభవింప గలరు. మంచి బలము గల శరీరము గలిగియుండియు యే నరుడు చలి గాలి బాధ చేత యీ ధనుర్మాస వ్రతమును చేయడో అతడు అనేకమైన నరక బాధలను పొంది పిమ్మట పాపభూయిష్టమైన క్రిమికీటకాది నీచజన్మల యందు బాధ పడుచుండును. అలాగున సమస్తమైన ఘోర నరకము లందును నివసించి పిమ్మట మరల భూలోకమున పాపరూపము నందుంబడి క్రిమిరై బాధనొందుచుండును. పాపాత్ముడై యేనరుడు అజ్ఞానవంతుడై యీ మాధవపూజను నిరసించునో ఆతడు భయాన్వితుడై యమదూతల చేత ఘోర నరకమందు బాధింపబడును. అట్టి వానికి నూరుకల్పములైనను ఆనరకము నుండి నివృత్తిలేదు, ఇతిహాసపురాణాదు లీ ధనుర్మాస వ్రతమహిమలు సదా చెప్పుచుండును కాబట్టి నారదా! ధర్మమునుగోరు ప్రతి మానవుడును

ఈ ధనుర్మాసవ్రతము నాచరింపవలెను. దీనితో సమమగు వ్రతము వేరొకటి యేపురాణము లందును వేదములందును చెప్పబడలేదు. ఏ మానవుడీ వ్రతమును నియమముగా నాచరించునో అట్టివాడు యమదండము నుండి తప్పింపబడును. యముడాతని పాపములను వివర్ణవదనుడై పోగొట్టును.

తదర్థమాసంవా కుర్యా దథవావద్దినేషు వా
అష్టార్థదివసేష్వేవ హేకస్మిన్దివసేఽథ వా 91
నకుర్యా ద్యదిలోభో నయాావత్కల్ప శతత్రయం
అనుభూయైనదుఃఖాని సర్వేషు నరకేషుచ 92
తదంతేభువమాసాద్య సర్వయోనౌ సముద్భవేత్
పాపావసానేయోవత్స ! విష్టాశీ గ్రామసూకరః 93
భూత్వాంతే పాప శేషాణాం విష్టాకూపే క్రిమిర్భవేత్
నరకోత్తారణంనాస్తి దుఃఖాన్యేవ పునఃపునః 94
అశక్తావ్యాధితో వాపి స్త్రీవృద్ధో శూద్రజోఽథవా
అన్యైర్వా కారయిత్వాతు త్రైస్యైకం భోజనంచరేత్ 95
తస్యపాపానినశ్యంతి వహ్నౌ ప్రక్షిప్త తూలవత్
అసక్తస్సర్వదాకర్తుం యోవాకోవాఽపి మానవః 96
యాచితత్వాధనధాన్యంతు ధనుర్మాసనిమిత్తతః
కర్తవ్యం సర్వదావిష్ణో-ర్బ్రాహ్మణానాంతు పూజనమ్ 97
కరిష్యేవై ధనుర్మాస యాచయిత్వ ధనంముదా
నకరోతిహి లోభేన తమాహ్యుర్బ్రహ్మ ఘాతుకమ్ 98
లోభేన యోధనుర్మాసం సంపన్నోఽపి దరిద్రవత్
మానవో యదియాచేత తమాహుః పాపినః బుధాః 99
అశక్తః సర్వదాకరుం కారయో ద్యాఽన్యమానవైః
ధనుర్మాసఫలస్యాసౌ చతుర్థాంశం లభేత్తతః 100

ఓయీ నారదా! యీ ధనుర్మాస వ్రతమును నియమముగా ఒక నెలరోజులు చేయవలయును. అట్లు చేయకున్న పక్షము దినములయినను, లేక ఆరు రోజులయినను, లేక నాల్గు రోజు లయినను, లేక నొక దినమైనను లోభముగా చేయవలెను. అట్లు చేయకున్న యెడల, నూరుకల్పములవరకు నరకదుఃఖము ననుభవించి, పిమ్మట భూలోకమున అనేక నీచజన్మలనుబొంది, పాపముతగ్గిన పిమ్మట పంది జన్మమును పొందగలరు. ఇంకను పాపశేషముండిన యెడల క్రిమికీటకాది జన్మలను పొందుదురు వానికి నరకమునుండి ముక్తి కలుగదు. ఎల్లప్పుడును దుఃఖములనే అనుభవించుచుందురు. శక్తి లేనివాడును, రోగబాధితుడును స్త్రీయు, వృద్ధుడును శూద్రుడును, లేక మరి యితరు లెవరయినను యీవ్రతమును చేయజాలరేని, యితరులచేత చేయించి వారలతోకూడి భోజనము చేయవలయును. అట్లు చేసినవారికి పాపములన్నియు అగ్నిలోబడిన దూదివలె క్షణములో నశించును. ఏ మానవుడయినను, యీ ధనుర్మాసపూజను చేయుటకు ధనములేక అసమర్థుడగునేని యితరులను యాచించి ధనుర్మాస పూజకై ధనము సంపాదించి శ్రీహరిని బ్రాహ్మణులను పూజించి యీవ్రత మాచరింపవలెను. ధనసమర్థత కలిగియు ధనుర్మాసవ్రతము నిమిత్తము యాచించినను, లోభముచేత దరిద్రుని రీతిగా సంపాదించిన ధనమును వ్యయము చేయక మిగుల్చుకొన్నను, అతడు బ్రహ్మహత్యా పాతకమును పొందును. ఏ నరుడు ధనుర్మాస వ్రతమును చేయుటకు తానసక్తుడయినను యితరులచేత యాచించి చేయించునో అట్టివాడు యీధనుర్మాసవ్రతఫలముందు నాల్గవభాగమును పొందును.

ధనుర్మాసేన కర్తవ్యోపాంశవశ్యంతే పాపరాశయః
వర్ధతే ధర్మరాశిశ్చ శుక్లపక్షే యథాశశీ 101
యథారత్నాని వర్ధతే సముద్రే వివిధాన్యపి
అథాభాగ్యనివర్ధంతే ధనుర్మాసవ్రతోత్తమాత్ 102

దీపదానం ప్రశస్తంహి ధనుర్మాస ప్రపూజనే
గోఘృతేనచ వై దీప మధవా తిలతైలతః 103
అఖండదీపాన్భక్త్యాచ విష్ణవే పరమాత్మనే
అర్పయేద్యదిపుణ్యాత్మా సర్వరోగాత్ప్రముచ్యతే 104
దీపో దదాతి వై జ్ఞానం దీపోవై భాగ్యదోభవేత్
మాసే మాసార్థ కేవాపిదశైక దినసేపివా 105
యస్మిన్ దినే సమాప్తిస్స్యాత్తదాతాంప్రతిమాంవ్రతి
బ్రాహ్మణాయ సుశీలాయ వేదశాస్త్రార్థవేదినీ 106
దద్యాత్సదక్షిణంజాతు వ్రతసంపూర్తి హేతవే
మధుసూదన ! దేవేశ ! ధనుర్మాసఫలప్రద ! 107
తవమూర్తి ప్రదానేన మమ సంతుమనోరథాః
ధనుర్మాసే మునిశ్రేష్టా ! షోడశైదుపచారకైః 108
బృందావనేతు తులసీ ప్రత్యహంపూజయేద్యది
సముక్త స్సర్వపాపేభ్యో విష్ణులోకం ప్రజేత్పుమాన్ 109
ధనుర్మాసే ప్రశస్తంహి తులసిపూజనంమునే
కరోతి చేద్ధవాంపూజా మన్మాగాస పురస్సరమ్ 110

ధనుర్మాసవ్రత మాచరించుటవలన సమస్త పాపములు నశిం చును. ధర్మము శుక్లపక్షమందలి చంద్రునివలె వృద్ధిని పొందును. సముద్రమందు వివిధములగు రత్నములు యేవిధంగా వృద్ధిని పొం దునో యావిధముగానే యీ ధనుర్మాసవ్రతమహిమవలన సంపదలు వృద్ధిని పొందును. ధనుర్మాసమున మాధవ పూజయు, ఆవునేతితో గాని, నూనెతోగాని పరమాత్ముడయిన విష్ణుదేవునికి అఖండదీప మును, బెట్టుటయు, దీపదానమును చేయుటయు చాల ముఖ్యము. అట్లుచేసిన పుణ్యాత్ము డన్నిరోగములనుండి విముక్తుడగును. దీపము జ్ఞానమును కలిగించును. దీపము సంపదల నిచ్చును, నెల పూర్తిగా

గాని, అర్ధమాసముగాని, పదిదినములుగాని యీవ్రత మాచరించి దీపమును బెట్టిన సర్వపుణ్యములను పొందగలడు. యేరోజున నరు డీ ధనుర్మాసవ్రతమును సమాప్తి జేయునో ఆ దినమున అతడు శ్రీహరి ప్రతిమను వేదవేదాంగవిదుడైన, సద్గుణవంతుడగు విప్రునకు వ్రతసంపూర్తినిమిత్తము దక్షిణతోకూడ. మధుసూదనా! దేవేశా! ధనుర్మాసఫలితము నిచ్చువాడ' నాకు నీమూర్తి ప్రదానమువలన ధనుర్మాస ఫలితమంతయు నాకిచ్చి నాకోరికలను దీర్చుమని ప్రార్థింప వలెను. ధనుర్మాసమున, నారదా! ప్రతినిత్యము బృందావనము నందు తులసీ దేవిని షోడశోపచారములచేత పూజింపవలెను. అట్టి వాడు పాప విముక్తుడై పుణ్యలోకమును శ్రీహరిధామమును చేర గలడు. ధనుర్మాసమందు తులసీపూజ ముఖ్యము.

సర్వానాం దేవతానాం వై మృష్టాన్నన్య ప్రదోభవేత్
ప్రదక్షిణత్రయమతోయః కరోతి గదాం మునే 111
భువః ప్రదక్షిణె యచ్చతత్పుణ్యాం లభతే ధ్రువం
యత్ఫలం సర్వయజ్ఞేషు సర్వతీర్థేషు యత్ఫలమ్ 112
సకృత్పు రాణశ్రవణా త్తత్ఫలం విందతేనరః
కలౌహీనా ఒపోమర్త్యా దుర్బలాశ్రమపీడితాః 113
దుర్మేధసో దుర్విభాజో ధర్మాచార వివర్జితాః
పతిసంచిత్య భగవాన్ సర్వవ్యాపీ రమాపతిః 114
హితాయ తేషాం విధథే మాహాత్మ్యం ధనుషోఽవిహి
పిబన్నే వామృతంయత్నా దేకాదశ్యాం జరామరః 115
నైవేద్యత్వభజాద్విష్ణోః కులయే వాజరామరం
గురుపస్సంతిలోకేతు జన్మతో గుణతశ్చయే 116
తేషామపిచ సర్వేషాం పురాణజ్ఞాః పరోగురుః
భవకోటీషు సర్వాసు భూత్వాభూత్వాఽవసీద తామ్ 117

యోదదాత పునర్వృత్తిర్నోఽవ్యస్తస్యా తతోప్యగురః
అతిసంపూజయేన్నిత్యం వ్యాసంగురుమకల్మషమ్ 118
గంధపుష్పాక్షతైర్ధూపైర్వస్త్రైరాభరణాభిః
సంపూజయేత్తథావ్యాసం తతోతీరాజనాభిః 119
వ్యాసపూజాంనకుర్వంతి లోభ మోహాయుతోనరః
ధనుర్మాస ఫలంనాస్తి దుఃఖస్యాజ్జన్మజన్మని 120
పూజయేత్సర్వయత్నేన ధనుర్మాసి మునీశ్వర!
ధనుర్మాసస్య మాహాత్మ్యం శృణ్వంతి శ్రావయంతియే
ఇహలోకే సుఖం ప్రాప్యలభేయుః ఫలముత్తమం 121

ఇతి శ్రీమదథర్వణరహస్యే కపింజలసంహితాయాం
బ్రహ్మనారదసంవాదే ధనుర్మాసమాహాత్మ్యమ్
సమాప్తమ్.

---

ధనుర్మాసమందు మానవుడు విధి ప్రకారము ఆవునకు పూజ చేసి అన్నము, గడ్డి మొదలగునవి పెట్టిన యెడల సమస్త దేవతల కును మృష్టాన్నమును బెట్టిన ఫలితము కలుగును. ఆవునకు మూడు సార్లు ప్రదక్షిణము చేసినయెడల అతడు భూమియంతయు ప్రదక్షి ణము చేసి చుట్టివచ్చిన ఫలితమును పొందును. ధనుర్మాసమునయీ వ్రతమహిమను, విష్ణుకథను పురాణమును ఒక్కసారియైనను వినిన మానవుడు సమస్తతీర్థము లందు మునిగిన ఫలమును, సమస్త యజ్ఞ ములు చేసిన ఫలమును పొందును. ఈ కలియుగమందు జనులు ఆయుర్దాయహీనులు, దుర్బలులు, కష్టములకు లోనగువారు, అజ్ఞా నులు, ధర్మహీనులు, దురాచారులు, అనాచారులు, అత్యాచారులు అని తలంచి భగవంతుడైన శ్రీహరి సర్వాంతర్యామియు, లక్ష్మీవల్ల భుడు నగుటచేత నట్టివారికెల్ల హితమును, మేలును. చేకూర్చుటకై యీ ధనుర్మాసవ్రతమహిమను దెల్పెను. మానవుడేకాదశియందు

ఈ విష్ణు దేవుని చరితామృతమును తీర్థప్రసాదాది కామృతమును త్రాగినయెడల చావుపుట్టుకలుగాని ముసలితనమునుగాని పొందరు. అట్టివి శ్రీహరి నైవేద్యముగా సమర్పించి, పిమ్మట భుజించిన నతని వంశమువారందరును జరా మరణ రహితు లగుదురు. ఈ లోకము నందు పుట్టుక చేతను, విద్వత్తు చేతను, గుణశీలముల చేతను అనేకమంది గురువు లుందురు. వారందఱిలోను పౌరాణికుడుత్తమోత్తమమైనగురువు. అట్టిగురువువలన కోటిజన్మలనుండియున్న పాపములన్నియు నశించును. పునరావృత్తిలేని శాశ్వతపదవినికలిగించువాడు. అట్టిగురువుగాక వేరెవ్వరు చేయగలరు? కాబట్టి పాపరహితుడైన వ్యాససమానుడగు గురువును సదా గంధపుష్పములచేతను షోడశోపచారముల చేతను పూజింపవలెను. నీరాజనాగరు ధూప దీప తాంబూలము లర్పింపవలెను. ఈరీతిగా యీ ధనుర్మాసమున అజ్ఞానము చేతగాని ధనలోభముచేతగాని వ్యాసపూజ చేయడో అతనికీ మాస వ్రతఫలితము లేకుండుటయే గాక జన్మజన్మలకు దుఃఖములు కలుగుచునే యుండును. కాబట్టి నారదా! యీ ధనుర్మాసమున వ్యాసపూజ చేయవలయును. ఏమానవులు యీధనుర్మాస వ్రతమహాత్మ్యమును వినుచున్నారో, యితరులకు చదివి వినిపించుచున్నారో అట్టి మానవులు యిహలోకమున సర్వసౌఖ్యము లనుభవించి పరలోకమందు శాశ్వతమైన విష్ణుసాయుజ్యము పొందుదురు.

ఇది బ్రహ్మనారద సంవాద మందుగల
ధనుర్మాస వ్రతమాహాత్మ్యము
సమాప్తము.

---

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి-2